

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి 1964 మార్చి 14వ తేదీన రేడియోద్వారా రాష్ట్ర ప్రజానీకానికి ఉగాది సందేశం ఇచ్చారు.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 8 వైశాఖ - జ్యేష్ఠ
సంచిక : 7 1886 శకం
మే, 1964



ఆదిమ చిత్రకళకు చెందిన కారెనుము [చూ.వ్యాసం-5 పేజీ]

## విషయసూచిక



---

ముఖచిత్రం : "ఇద్దరు విదూషకులు"

విశ్వవిఖ్యాత చిత్రకారుడు పాబ్లో పికాసో ఆధునిక కళాఖండం. హైద్రాబాదులో 1964 మార్చి 15 నుంచి 24 వ తేదీవరకు జరిగిన ఫ్రెంచి అలంకార కళా ప్రదర్శనంలో దీనిని ప్రదర్శించారు.

---

సంవత్సరం చందా — రు. 3—00
విడి ప్రతి రు. 0—25 నయాపైసలు.

# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ!

ఉగాదినాడు ఆకాశవాణిలో నేను ప్రసంగించినప్పుడు, ప్రణాళికా కార్యక్రమాలను ఆచరణలో పెట్టడంద్వారా ప్రజలకు ఎంతవరకు మేలు చేకూరిందో మదింపు వేయడానికి ఒక కమిటీని మేము ఏర్పాటు చేయవచ్చని సూచించాను. అనేకమంది ప్రజలకు, పరిపాలనా విధానాలకు సంబంధించిన ఏ విస్తృత పథకాన్నయినా ఆచరణలో పెట్టేటప్పుడు యీ విధంగా ఎప్పటికప్పుడు ఫలితాలను మదింపు వేయడం అవసరం. దీనిపై మరికొందరు మిత్రులతో నేను చర్చించాను. మరొకసారి ఆలోచించాను. లోగడ సూచించినట్టు ప్రణాళికను మదింపువేయడం కన్న, ఎక్కువగా వెచ్చించే ప్రతిశాఖకూ వానికి సంబంధించిన సమాలోచనా సంఘాలను ఏర్పాటుచేయడం మంచిదని నా అభిప్రాయం. ఇటీవలే ప్రణాళిక మధ్యస్థపు లెక్కింపు జరిగింది. ఇటుపై ఎప్పటికప్పుడు మదింపు జరుగుతుంది. ఉద్దేశించబడిన సమాలోచనా సంఘాలే స్థాయీ సంఘాలు. అవి పథకాల ఆచరణను ఏరోజు కారోజు మదింపువేసే సామర్థ్యాన్ని కలిగివుంటాయి.

ఆయా శాఖలకు నిత్యం లభించే యీ సంఘాల సలహాలవల్ల వారు తమ పథకాలనుఅనుభవమూ, మారుతున్నపరిస్థితులను పురస్కరించుకుని సవరించుకొంటూ వుండవచ్చు.

బ్లాకుల పునర్విభజనలో సలహా యివ్వడానికై ప్రధాన కార్యదర్శి ఛైర్మనుగా కొంతకాలం క్రిందట ప్రభుత్వం ఒక ఉన్నతాధికార సంఘాన్ని ఏర్పాటుచేయడం మీ కందరకూ తెలుసు. పరిపాలనా సిబ్బందిపై చేసే ఖర్చును తగ్గించి, పురోభివృద్ధి ప్రాజెక్టుల కొరకు ఎక్కువగా వుపయోగించాలని బ్లాకుల సంఖ్యను తగ్గించాలని మేము భావించాము. ఈ కమిటీ తమ నివేదికను సమర్పించింది. ప్రస్తుతం వున్న 448 బ్లాకులను 306 బ్లాకులకు తగ్గించాలని తమ నివేదికలో సిఫారసు చేసింది. వి. ఎల్. డబ్ల్యుల సంఖ్య తగ్గదు కనుక, ఆ స్థాయిలో యీ కార్యక్రమంమాత్రం దెబ్బతినదు. ఈ నివేదికపై యింకా ప్రభుత్వం ఒక అభిప్రాయానికి రావలసి వున్నది. అయితే ఒక్క విషయం. బ్లాకులసంఖ్యను తగ్గిస్తే దానికి భారత ప్రభుత్వం యిచ్చే కేటాయింపుకూడా దాని ప్రకారం తగ్గుతుందని భారత ప్రభుత్వం వ్యక్తం చేసింది. ప్రతిఫలాన్ని బట్టికాక స్వరూపాన్నిబట్టి నిర్ణయించడం చాలా విచిత్రంగా వుంది. బ్లాకుల సంఖ్యను తగ్గించడంలో మన ప్రాథమిక ఉద్దేశ్యం ఏమిటంటే అభివృద్ధి కార్యక్రమాలకు ఎక్కువ నిధులను వెచ్చించాలని. వీటి కిచ్చే కేటాయింపు బ్లాకుల సంఖ్యనుబట్టివుంటే, ఏమాత్రం యిక పరిపాలనా యంత్రాంగాన్ని మార్పుచేసే ఆలోచనే మనకు అక్కరలేదు. ఈ విషయాన్ని మేము భారత ప్రభుత్వంతో సంప్రదిస్తున్నాము. వారు మన వాదనను అర్థం చేసుకుంటారని భావిస్తున్నాను.

వ్యవసాయోత్పత్తిని శీఘ్రతరంగా అధికం చేయడానికి ఆచరిస్తున్న వివిధ పథకాలలో చిన్న నీటివనరులు ముఖ్యమైనవి ఇవి, సత్వర ఫలితాలను యిచ్చేవిధంగా రూపొందించబడిన తక్కువ వ్యవధిపథకాలు కావడంవలన రాష్ట్రమంతట వీటిని ఎక్కువగా అమలుపరచాలనే భావం వ్యాపించివుంది వీరికోర్కెలను తీర్చడానికి ప్రభుత్వం చాలా ఆతృత పడుతున్నది. మూడు సోధకమండలాలు, అనేకడివిజనులు, సబ్ డివిజనులతోకూడినఒక పెద్దసంస్థను ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఇది, ప్రస్తుతం రూ. 1,600 లక్షల ఖరీదుచేసే 756 పథకాలను శోధించడమో, అంతిమనిర్ణయాన్నివ్వడమో — చేస్తున్నది. మరో 1,632 లను యింకా శోధించాలి.

ప్రస్తుతంరు. 10లక్షలూ, ఆ లోపు ఖర్చయ్యే నీటి పారుదల పథకాలు చిన్న నీటివనరుల పథకాలు అనబడుతున్నాయి. ఈ కార్యక్రమాలను త్వరత్వరగా ఆచరించేందుకు ఎక్కువ అవకాశాలను కల్పించడానికై ప్రస్తుతం వున్న యీ హద్దును పెంచి, పదిహేనులక్షల రూపాయలూ, ఆలోపు ఖర్చయ్యే పథకాలను చిన్న నీటివనరుల పథకాలు అనాలనే వివరణను అంగీకరించవలసిందిగా ప్రణాళికా సమితికి మేము సూచించాము. ఈ కొత్తహద్దును అంగీకరించడంతో; పథకాలశోధన, ఆచరణలలో ప్రస్తుతం వున్న వేగం దృష్ట్యా, మనం ఆహారోత్పత్తిలో ప్రణాళికా ధ్యేయాన్ని నెరవేర్చేందుకు ముందడుగు వేస్తాం అనవచ్చు.

మనం తీసుకుంటున్న అనేకమైన ప్రత్యక్ష చర్యల్లో యిదొకటి. దీనితోపాటు ప్రణాళికా కార్యక్రమాల్ని ఆచరించే మార్గంలో ఏవిధమైన అడ్డంకులూ — ప్రజలలోని ఏ వర్గం వారైనా సరే చేసే ఆందోళన రూపంలోగాని, నిరోధక మార్గాల రూపంలోగాని — లేకుండా మనం చూడవలసి వుంటుంది. ఈ రకమైన నిరోధక చర్యలకు ప్రజలు ఎల్లప్పుడూ వ్యతిరేకులే అని నాకు తెలుసు. వీరు ఎప్పుడూ అర్థరహితమైన ఆందోళనలను లేవనెత్తేవారి?

అండదండల్ని ఇవ్వరు. ఏ వర్గం వారివైనప్పటికీ సమంజసమైన వారి బాధలను గూర్చి చర్చించడానికి నేనెప్పుడూ సిద్ధంగానే వున్నాను. ఈ రకమైన చర్చలకు మనవంటి ప్రజాస్వామిక దేశంలో ఎప్పుడూ అవకాశాలు వుండనే వున్నాయి. సమస్యల్ని లేవనెత్తి, అల్లరి వాతావరణాన్ని సృష్టించే చర్యల్ని క్షమించలేం. అంతేకాక ప్రభుత్వం, అన్ని వర్గాల ప్రజల సమంజసమైన కోర్కెల్ని బాగా ఆలోచించిన మీదట, వాటిని తీర్చడానికి తన మార్గాన్ని వదిలి కొద్దిగా ప్రక్కకు రావలసి వుంటుంది. రాజీనామాల ఉద్యమాన్ని ప్రారంభించి, మళ్ళీ దాన్ని విరమించుకుని తమ పనులను తాము యథావిధిగా నిర్వర్తిస్తున్న గ్రామోద్యోగులను ఏ విధంగా సంతృప్తి పరచడం జరిగిందో యిక్కడ నేను ప్రస్తావిస్తాను. తమ పరిధులకు సంబంధించి, త్వరలో రూపొందించనున్న గ్రామీణ పరిపాలనకు సంబంధించి, తాత్కాలిక సహాయానికి సంబంధించి వీరికి కొన్ని బాధలున్నాయి. వీటన్నిటినీ బాగా ఆలోచించిన మీదట, పూర్తికాలం ప్రభుత్వ సేవకుల డిపార్టుమెంటల్ స్టాఫ్ కౌన్సిలులను పోలిన విధానాన్ని వీరికై ఏర్పాటు చేస్తామని కూడా మేము హామీ యిచ్చాము. ప్రాంతీయ రెవిన్యూ డివిజనల్ అధికారిగాని, లేదా కలెక్టరుగాని ప్రాంతీయ గ్రామోద్యోగుల సంఘం ప్రతినిధులతో ఏడాదికి రెండు మూడు పార్లు కలిసి సమావేశమై గ్రామాధికారులకు సంబంధించిన సాధారణ సమస్యలను విని, వెనువెంటనే తీర్చడం జరుగుతుంది. ఈ ఏర్పాటు దీనికి సంబంధించిన వారందరికీ సంతృప్తిని కలిగించింది. ఇతర రాష్ట్రాలకు సంబంధించిన యీ మాదిరి పరిస్థితులకు యిదొక చక్కటి ఉదాహరణ అని నేను భావిస్తున్నాను.

దేశంలో ఆచరణలోకి తెచ్చిన ముఖ్యమైన సంస్కరణలు, ముఖ్యంగా రాష్ట్రాల పునర్విభజన తరువాత, ఏమిటంటే గ్రామీణ ప్రాంతాలలో ప్రజలు తమ అభిప్రాయాలను సులభంగా ప్రభుత్వానికి తెలియజేయడానికి వీలుగా ప్రాంతీయభాషను అధికారభాషగా చేయడం. కొన్ని రాష్ట్రాలు అప్పుడే యీ సంస్కరణను ప్రవేశ పెట్టాయి. మనం కూడా యీ మార్గంలో కొన్ని చర్యలను తీసుకున్నాం. తొలిచర్యగా తాలూకా స్థాయిలోను, ఆ దిగువ స్థాయిల్లోను అనేక కార్యాలయాలలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికి తెలుగు ప్రవేశపెట్టబడింది. తరువాత ఇది ఇదేస్థాయి లోని ఇతర కార్యాలయాలకు కూడా విస్తరింప జేయబడింది.

మన రాష్ట్రంలోని వివిధ కార్యాలయాలలో పనిచేసే సిబ్బంది యొక్క ప్రస్తుత సరళి, ఇతర ప్రత్యక్ష అంశాల దృష్ట్యా అన్ని స్థాయిలలోనూ ప్రభుత్వ కార్యాలయాలలో ఉత్తరప్రత్యుత్తరాలకు ప్రాంతీయభాషను పూర్తిగా ఉపయోగించడానికి సాధ్యంకాదు. అయితే అధికారభాషగా ప్రాంతీయభాషను ఉపయోగించడమే మా లక్ష్యమని మీకు హామీ ఇస్తున్నాను. ఈ లక్ష్యాన్ని సాధ్యమైనంత త్వరలో చేరుకోవడానికి మేము సకల చర్యలూ తీసుకుంటున్నాము. శాసన సంబంధమైన, పరిపాలనా సంబంధమైన పదాలతో కూడిన పదకోశాన్నొకదానిని ముద్రించి వాటి ప్రతులను రాష్ట్రంలోని అందరు తాలూకా అధికార్లకూ, బ్లాక్ డెవలప్‌మెంట్ అధికార్లకూ సరఫరా చేయడం జరిగింది. చట్టాలు, కోడ్‌లు మొదలైన వాట న్నింటి తెలుగు ప్రతులను రాష్ట్రంలోని తత్సంబంధీకులందరికీ అందజేసే నిమిత్తం ప్రాధాన్యక్రమంలో వీటిని తెలుగులోకి అనువదించడానికికూడా ఉత్తర్వులు జారీ అయ్యాయి. తాలూకా కార్యాలయాలలో సాధారణంగా ఉపయోగించబడే లేఖలు, మెమొరాండం మొదలైన వాటి తెలుగు నమూనా ముసాయిదాలతో కూడిన పుస్తకాన్నొకదానినికూడా ముద్రిస్తారు. ప్రభుత్వ కార్యాలయాలలో, సంస్థలలో ఉపయోగించే నిమిత్తం కార్యాలయాలలో వాడే పారిభాషిక పదాలు, వాటికి సమానమైన తెలుగు పదాలతోకూడిన మరోపుస్తకం, తెలుగుషార్ట్‌హాండ్ మాన్యువల్, దాని వివరణ గ్రంథంకూడా ముద్రించబడుతున్నాయి. తెలుగు టైప్‌రైటర్ కీ బోర్డుసుస్థిరీకరించే అంశాన్నికూడా ప్రభుత్వం పరిశీలిస్తున్నది. ఈ విషయంలో సాధించే పురోభివృద్ధిని గురించిన సమాచారాన్ని నేనుమీకు త్వరలోనే అంద జేయగలుగుతానని ఆశిస్తున్నాను.

ముఖ్యమంత్రి బాధ్యత స్వీకరించినప్పటి నుంచి నేను శాసన సభ, శాసన మండలి కార్యక్రమాలలో నిమగ్నమై వున్నాను. మీరు ఈ లేఖ చదివే సమయానికి ఈ ఉభయ సభల సమావేశాలు ముగిసి నేను ప్రజానీకాన్ని కలుసుకునే నిమిత్తం పర్యటనలు జరుపుతూ వుంటాను. నా పర్యటనల సందర్భంలో మిమ్మలను ఇతోధికంగా కలుసుకోవాలన్నదే నా ఆకాంక్ష.

జై హింద్
భవదీయుడు,

# మేల్కొన్న వీరజాతి

'మ సూ నా'

మేల్కొన్నది భరతభూమి
మేల్కొన్నది భరతజాతి
శత్రులెవరో మిత్రులెవరో
తెలిసికొంది భరతజాతి ॥మే॥

ఆత్మవిదుల సనాతనుల
ఆర్యఋషుల జన్మభూమి
శాంతి ధర్మ సౌమనస్య
సాధనమౌ ధర్మభూమి ॥మే॥

యుద్ధ విముఖులగుచు దయా
మూర్తులైన వీరవరుల
ప్రబోధించి కర్తవ్యము
పాలించే కర్మభూమి ॥మే॥

తరతరాల అహింసా వి
శాల తత్వ పథమునుండి
తప్పుకొనియె భరతజాతి
తంత్రమెరిగె భరతజాతి ॥మే॥

విజాతీయ దాసిసత్వ
విముక్తికై అరువదేళ్ళు
పోరాటము సాగించిన
పౌరుషేయు లున్నారట ॥మే॥

తలవంచుట వెన్నిచ్చుట
ధర్మహాని కల్గించుట
బలహీనులమని కలగుట
కల నెరుగదు భరతజాతి ॥మే॥

గుండుకెదురు నిలువగలుగు
గుండె నిబ్బరమ్ము కలిగి
దండి మగల మనిపించే
యువకులార! రెండు! రండు! ॥మే॥

దేశరక్షణమ్ము కొరకు
సంసిద్ధులు కండు! రండు!
జాతి గౌరవమ్ము నిలుప
సత్వరమ్ము వెలికి రండు ॥మే॥

యువకులార! యువతులార!
భారతీయ ప్రముఖులార!
మాతృభూమి సంరక్షణ
మదినుంచుడు, శుభమెంచుడు ॥మే॥

ఏ తీరము లే సీమలు
శత్రు పీడితమ్ము లగునో
ఏ సమయము మీ సహాయ
మిచ్చు నవసరమ్ము పడునో?
దేశరక్షణమ్ము కొఱకు
దీక్షాభువులై యుండుడు
జాతి గౌరవమ్ము నిలుప
సన్నద్ధులుగా నుండుడు ॥మే॥



# అధునాతన చిత్రకళ

క. దివ్యజ్ఞాన సరోజినీదేవి

[ ఒక దేశంలోని, లేదా ఒక కాలంలోని ప్రజల సంస్కృతిని ఆనాటి చిత్ర, శిల్పకళలను బట్టి తెలుసుకోవచ్చు. కాలానికి ఎదురీది కొంతకాలంపాటు నిలిచేది లలితకళల్లో శిల్పకళ మాత్రమే. ప్రాక్సిటలస్ వీనస్ రూపసృష్టి, ఈజిప్టు పిరమిడ్ల నిర్మాణం, అజంతా శిల్పాల చెక్కడపు పనితనం-యివన్నీ ఆయా దేశాల ప్రజల శిల్ప కళాభిమానాన్ని, శిల్పుల ప్రతిభను, రాజుల ఆదరణను, మత విషయక విషయాలను, ఆచారాలను అర్థం చేసుకోవడానికి తోడ్పడతాయి. ఎప్పుడో ఎక్కడో భూగర్భంలో కలిసిపోయిన ఓ రాతి బొమ్మ బైటపడి, ముక్కు పదునులో, కళ్ళ చివరలో, పెదవికొసలో శిల్పి నిలిపిన అందం జిగేల్‌మని మెరిసిన కాలప్రవాహంలో కొట్టుకుపోయి, సంస్కృతీ విభవాన్ని చాటి చెప్పుతుంది. మొహంజదారో, హరప్పాలలో దొరికిన పగిలిన కుండపెంకు మొత్తం దేశపు సంస్కృతికే చిహ్నం. శిథిలమైన రోమను సామ్రాజ్యపు ప్రాభవాన్ని యీనాటికి నిలిచివున్న ఆరుబయలు రంగస్థలాల్లో చూడవచ్చు. కారనాక శిథిల దేవాలయాల మొండిగోడల్లో గ్రీకు సామ్రాజ్య విభవాన్ని గుర్తించవచ్చు. ఖజరహో శిల్పాల కళల్లో భారతీయ కళా ప్రతిభను దర్శించవచ్చు. ఆయా దేశాల ప్రజలు ఆయా కాలాలలో తమతమ కళా ప్రాంగణాల్లో తీర్చిదిద్దిన రంగవల్లులే తరువాత కాలాలవారికి ఆయా ప్రజల సంస్కృతిని తెలుసుకొనే చారిత్రకాధారాలు.

పవిత్ర భారతీయ చిత్రకళా చరిత్రతో ప్రారంభించి వివిధ చిత్రకళా ప్రక్రియలను, వాటి పరిణామాలను వివరణాత్మకంగా సులభగ్రాహ్యంగా ఉటంకిస్తూ శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవిగారు రచించగా ఆంధ్రప్రదేశ్ (తెలుగు)లో ప్రచురితమవుతున్న వ్యాసాల పరంపర ఈ సంచికలో ప్రచురితమైన వర్తమాన కాలంలో విస్తృత ప్రచారం పొందుతున్న ''అధునాతన చిత్రకళ'' వ్యాసంతో ముగుస్తున్నది. అశేష పాఠకజనాళి ప్రశంసలనే కాక చిత్రకారుల చిత్రకళా విమర్శకుల మెప్పులను సైతం పొందిన యిటువంటి వుత్తమ వ్యాసాలను ''ఆంధ్రప్రదేశ్'' పాఠకులకు అందించిన శ్రీమతి దివ్యజ్ఞాన సరోజినీదేవిగారికి మా కృతజ్ఞతలు. —ఎడిటర్ ]

"ఈ పుట క్రిందున్న కారెనుము చిత్రము తొలి పుటలో నున్న కారెనుము చిత్రము యిరువదివేల సంవత్సరముల నాటికి చెందినదో, లేక యిటీవల పికాసోచే చిత్రింపబడినదో మీరు నిర్ధారణగా చెప్పగలరా ?" అని ప్రశ్నించాడో ప్రఖ్యాత చిత్రకళా రచయిత. నిజమే చెప్పలేము. బైజాన్‌టైన్ చిత్రకళతో అంతమైన ప్రాచీన చిత్రకళ అధునాతన చిత్రకళా రూపములో మరల పునర్జన్మించినదేమో !

ప్రాచీన చిత్రకారు లేవస్తువునైన అది తమ కనులకు గోచరించిన విధముగా చిత్రించెడివారు. కాని మధ్య యుగాంతపు చిత్రకారులు ప్రజల మన్ననల పొందుటకైతేనేమి, మరియేకారణము వలననైతేనేమి ఆ వస్తువును ప్రజలందరేవిధంగా వర్ణించెడివారో ఆవిధముగానే చిత్రించెడివారు. కాని అధునాతన చిత్రకారు లట్లుకాదు. వారా వస్తువు వర్ణనలను మనఃపూర్వకముగా మరచి, ఆదిమ చిత్రకారులవలె తామే ఆ వస్తువును ప్రపంచమున ప్రప్రథమముగా చిత్రించుచున్నట్లు మదిలో నూహించి, దానిని తమ కనులకు దృగ్గోచరమైనట్లు చిత్రించుచున్నారు. మరి కొంద రధునాతన చిత్రకారులీ స్థాయినిసైతమతిక్రమించి, ఆ వస్తువును కేవలము తమ బాహ్య నేత్రములకు గోచరించినట్లుగాక, తమ మనోనేత్రములకు గోచరించిన విధముగా చిత్రించుచున్నారు.





బహద్దూర్

ఇంకను ఈనాటి చిత్రకారులు ప్రాచీన చిత్రకారులవలె తమ చిత్రములందు వర్ణములకు ముఖ్యస్థానమే యిచ్చి యున్నారు. ఈ యిరు వర్గముల చిత్రకారులు తమ చిత్రములందలి వస్తువులను అతి ముఖ్యమైన వర్ణములతోనే చిత్రించియున్నారు. వర్ణములను సైత మీనాటి చిత్రకారులు, తమ చిత్రములందు ప్రకృతిలో నున్నట్లును, యితరులు నిర్దేశించినట్లును గాక, తమ కనులకు గోచరించిన విధముగా చిత్రించుచున్నారు. వీరప్పు డప్పుడు తమ చిత్రములందు వస్తువుల రూపములనుగాక, కేవల మా వస్తువుల వర్ణములనే తగు నిష్పత్తిలో సాంకేతికముగా గూడ చిత్రించుచున్నారు. మరియు, వీరు తమ చిత్రపటములందు దూరమునందు గల వస్తువులను తద్వత్తుగా చిత్రించుటకు సైతము వర్ణములనే వాడుచున్నారు. ఉదాహరణకు ఒక చిత్రకారుడు తన చిత్రము నందు ఒక నల్లచదరమును దాని వెనుక ఒక ఎఱ్ఱ చదరమును చిత్రించి, ఆ రెండు చదరముల పైననూ వుండునట్లు ఒక పూలకుండీని చిత్రించినాదనుకొనండి. అప్పుడా చిత్రకారుడు యెఱుపు చదరముపై నున్న పూలకుండీ భాగమును, తెలుపు, నలుపు వర్ణములలోనో, నల్ల చదరముపై నున్న కుండీ భాగమును ముదురు బూడిద వర్ణములోనో చిత్రించును. అప్పుడు మనకు చూచుట కా మెఱుపు చదరము ఆ పూల కుండీకి ఆ నలుపు చదరముకన్న దూరములో నున్నట్లు కానవచ్చును. దీనిలోనే వున్నది అధునాతన చిత్రకళా ప్రత్యేకత.

ఈ అధునాతన చిత్రకళయందును, ప్రాచీన చిత్రకళయందు వలెనే సాంకేతిక చిత్రముల నెక్కువగా వాడినప్పటికిని, ఈ రెండు సాంకేతిక చిత్రములకు బేధము కలదు. పూర్వపు సాంకేతిక చిత్రములు కొందరిచే నిర్ణయింపబడిన సాంకేతిక రూపములు గలవి. ఆనాటి సాంకేతిక రూపములు ఆనాటి ప్రజలందరికి అర్థమగునవి. కానీనాటి సాంకేతిక చిత్రములర్ధము తెలుసుకొనుట మందరికి సాధ్యముకాదు. కారణ మీనాటి చిత్రకారులు తమ చిత్రములను నిర్ణయింపబడిన కొన్ని సాంకేతిక రూపములలోగాక, తా మొక్కొక్కరి మదిలో మెదిలిన సాంకేతిక రూపములతో చిత్రించుచున్నారు.

అధునాతన చిత్రకళలో మతమున కంతటి ప్రముఖస్థానము లేదు. ఈ చిత్రకారులు తమ చిత్రములను మతముచే నిర్దేశింపబడిన విధముగా గాక, తమ బాహ్యమనోనేత్రములకు గోచరించిన విధముగా, తలచిన సాంకేతిక ఆకారములలో, అవ్యయవాను సంబంధము కలిగి, యేక స్వరము కలిగియుండునట్లు చిత్రించుచున్నారు. ఈ చిత్రకళలో సహజత్వమునకు, మనో వికార ప్రేరేపితమైన భావములకు స్థానములేదు. చిత్రకారుల ఆలోచనా లోక్తిమైన భావమే ఈ అధునాతన చిత్రకళకు దోహదకారి.

ఇట్టి అధునాతన చిత్రకళ సూరత్,



లేండ్ స్కేప్

సెజాన్‌లతో, పందొమ్మిదవ శతాబ్దియందు ఆరంభమైన దని చెప్పవచ్చు. వీరు మొట్ట మొదట తమ చిత్రములను వాస్తు శాస్త్రమందలి ఆకారములను (చదరము, గుండ్రము, త్రికోణము, దీర్ఘ చతురస్రమము, ధనురాకారము మొదలగునవి) పోలియుండునట్లు చిత్రించసాగిరి. అనగా వారి చిత్రములందు చిత్రింపబడిన వస్తువులుగాని, మనుష్య రూపములుగాని ఈ పై ఆకారములలో నేదో నొకటిని పోలియుండునట్లు అమర్చబడెడివి. కా నటుపిమ్మట చిత్రకారు లంతటితో తృప్తిపడక, తమ చిత్రములందలి వస్తువుల ఆకారములను సైతము ఈ వాస్తుశాస్త్రపు ఆకారములను పోలియుండునట్లు విరూపము జేసి చిత్రింపసాగిరి. విరూపము చిత్రకళా చరిత్రలో క్రొత్తదేమిగాదు. అలనాడు ఈజిప్షియనులు తమ మానవ ప్రతిమల ముఖములను ప్రక్కనుండి చిత్రించినను, ఆ ప్రతిమల కన్నులనుమాత్రము (దుష్టశక్తులను బయటపెట్టి పారద్రోలుటకై) చాల పెద్దవిగాను, గుండ్రముగాను (ముందువైపునుండి చిత్రించినట్లు) విరూపము జేసి చిత్రించెడివారు. అటుపిమ్మట గ్రీకులు తమ మానవ ప్రతిమలను అతి సౌందర్యవతులుగా విరూపము చేసి చిత్రించెడివారు. కడకు బైజాన్టైన్ చిత్రకారులు సైతము తమ పుణ్యపురుషుల ప్రతిమలను, వారు సామాన్య మానవులవలెగాక శరీరమున కతీతులైన ఆత్మ స్వరూపులుగా కనబడుటకై విరూపించి చిత్రించెడివారు. కావున అధునాతన చిత్రకళలో మరల విరూప మగుపడుటలో క్రొత్తేమీ లేదు. ఈ అధునాతన విరూపములో నున్న ప్రత్యేకత అది త్రొక్కిన క్రొంగ్రొత్త పంథా మాత్రమే.

ఇట్టి విరూపము చేయుటలో నేటి అధునాతన చిత్రకారులలో పికాసో బహు ప్రసిద్ధుడు. ఈ చిత్రకారుడు పై వివరింపబడిన వాస్తుశాస్త్రమందలి ఆకారముల సంబంధమైన విరూపములనేగాక, తన చిత్రములందు ఒక మనిషినిగాని, వస్తువునుగాని చిత్రించునప్పుడు, ఆ మనిషియొక్కగాని, వస్తువుల యొక్కగాని వివిధ భాగములను వివిధ కోణములనుండి గ్రహించి, సమన్వయించి, విరూపముజేసి చిత్రించియున్నాడు. ఇట్టి చిత్రములందు ముగ్గురు గాయకుల చిత్రము ప్రపంచ ప్రసిద్ధి నొందినది. అందుచేతనే అధునాతన చిత్రకళను పేర్కొనినప్పుడు 'పికాసో' నామమును తలపక తప్పదు. సూరత్, సెజాన్, పికాసోలు గాక, అధునాతన చిత్రకళలో చెప్పుకోతగ్గ మరియొక పాశ్చాత్య చిత్రకారుడు మత్తేసి. ఇతని చిత్రములందు ప్రాచీన చిత్రకళా ఛాయలు చూడవచ్చు.

లోగడ వివరింపబడిన యంశముల నాధారము జేసుకొనియు, పై పేర్కొనబడిన ప్రఖ్యాత చిత్రకారుల చిత్రకళా శైలి నాధారము చేసుకొనియు, నేడనేక చిత్రకారులీ అధునాతన చిత్రములను చిత్రించుచున్నారు. వీరు తమ చిత్రములందు కేవలము లౌకిక వస్తువులనేగాక, మనము మాటలలో సరిగా నిర్వచించలేని ప్రేమ, దయ, భీభత్సము, ఆనందము, శాంతి, ఆత్మ మొదలగు అలౌకికవిషయములసైతము చక్కగా చిత్రించుచున్నారు.

ఇట్టి ఆధునిక చిత్రములను బాగుగ అర్థము జేసుకొనవలయునన్న ఆ చిత్రకారుల దృక్పథమునుండి మనము వాటిని పరీక్షింపవలయును. వాటి నిజమైన విలువను, మనము, అవి పొందే ప్రఖ్యాతినిబట్టి గాని, వాటి ఖరీదుని బట్టిగాని, వాటిని చూచునప్పుడు మనలో కలిగే ఆనందానుభూతులను బట్టిగాని మాత్రము నిర్ణయించలేము. ఏ అధునాతన చిత్రకళా చిత్రమైన, యది వొక గొప్ప కళాఖండమైన యెడల, దానిని మనము, రోజు జీవిత కాలమంతా చూచుచున్నను మనలను విసిగించక వినూతన శోభతో ఆకర్షించుచు నుండును. అదే దాని విలువకు గీటురాయి.



# జీవన విధానం

పరిగి రాధాకృష్ణ

నేడు కావలసినది నీతి నిజాయితీ
మంచిని రహింపజేసే అనవాయితీ! ॥

నిస్స్వార్థ భావాల దీపదీధితులే
నాల్గు దిక్కులలోను నాట్యమాడాలి!॥

అందరూ కలసి అందరి అభ్యుదయమునకు
శ్రమపడుటే జీవన విధానం కావాలి! ॥

జీవితంలో లక్ష్యశుద్ధి కావాలి!
లక్ష్యసిద్ధికి సదాచారణ కావాలి! ॥

చర్చలను తగ్గించి చేతలను పెంచాలి
ఆచరణలో ఆత్మశుద్ధి రహియించాలి! ॥

దౌష్ట్యమ్ము నెదిరించు ధీరత్వ మవసరము
ధర్మ సమ్మతమైన దృష్టి యవసరము! ॥

నేడు కావలసినది నీతీ నిజాయితీ
మంచిని రహింప జేసే అనవాయితీ! ॥

---

# రచయితలు

శ్రీ మండా సూర్యనారాయణ (మసూనా) మహారాణిపేట, విశాఖపట్టణం — 2

శ్రీమతి క. దివ్యజ్ఞాన సరోజినీదేవి, 14 అశోకారోడ్డు, న్యూఢిల్లీ.

శ్రీ పరిగి రాధాకృష్ణ, బి. ఇ; జూనియర్ ఇంజనీరు, రాష్ట్రవిద్యుచ్ఛక్తి బోర్డు, గుంతకల్లు.

శ్రీ సి. నరసింహం, ఐ. ఎ. ఎస్. ప్రణాళికాశాఖ కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.

శ్రీ తూమాటి దోణప్ప, తెలుగు లెక్చరర్, ఆంధ్రా యూనివర్సిటీ, వాల్తేరు.

శ్రీ చిట్రిప్రోలు కృష్ణమూర్తి, గమ్మలపాడు పోస్టు వయా, దాచేపల్లి, గుంటూరు జిల్లా.

శ్రీ వెలగా వెంకటప్పయ్య, తెనాలి, గుంటూరుజిల్లా.

శ్రీ కె. నాగభూషణరెడ్డి, డి. పి. ఆర్. ఓ. విజయవాడ, కృష్ణాజిల్లా.

శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, వాఙ్మయమహాధ్యక్ష — ఎడిటర్— తెలుగు ఆంధ్రప్రదేశ్, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాదు.

కీ॥ శే॥ కురుగంటి సీతారామయ్య......

'భాను' శ్రీ జి. భాను, బి. ఎ. (ఆనర్సు) అసిస్టెంట్ తెలుగు లెక్చరర్, గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల, అనంతపురం.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, సినిఆర్టిస్టు, మద్రాసు — 24

శ్రీ చావలి సూర్యనారాయణమూర్తి, టీ. నగర్, మద్రాసు.

శ్రీమతి గోటేటి సావిత్రి, భాషాప్రవీణ, C/o శ్రీ జి. ఎస్. ఆర్. కె. రావు, 122, జవహర్ నగర్, బొంబాయి.

శ్రీమతి ఊటుకూరు శకుంతలాదేవి, జిల్లారచయితలసంఘం, ఖమ్మం.

శ్రీ అక్కిరాజు జనార్దనరావు, చిక్కడపల్లి, హైదరాబాదు.

శ్రీ గొబ్బూరి అప్పారావు, అంగలకుదురు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

శ్రీ వేటూరి ఆనందమూర్తి, తెలుగు లెక్చరర్, సాయం కళాశాల, హైదరాబాదు.

శ్రీ కొత్త దేశపతిరావు, సబ్ ఎడిటర్; ఆంధ్రజనత, హైదరాబాదు.

శ్రీ బాసాని సుదర్శనరెడ్డి, సబ్ ఎడిటర్; గోలకొండ పత్రిక, హైదరాబాదు.

# వెలుగు బాటలు

సి. నరసింహం

మానవ జీవితంలో యౌవనారంభదశ వికసించిన పుష్పం వంటిది. నాలుగు దిక్కులా పరిమళాలు వెదజల్లుతూ రంగు రంగుల ఆకర్షణలతో చూపరులను ఆనంద పరచే పూవులే ఉద్యానవనానికి శోభ. అవే జీవం. అలాగే సంఘ జీవితంలో యువకులు ఆకర్షణీయమైన పాత్ర నిర్వహించ గలుగుతారు. యువకులు లేని యే ఉద్యమం కూడ రాణించదు. మహాత్ములైన కొంతమంది జీవితాలలోని ప్రత్యేకతలను మినహాయిస్తే సాధారణంగా మానవులందరిలోను యౌవనదశలోనే యేదో కొంత ఘనత సాధించే ప్రయత్నము, ఫలసిద్ధి కనిపిస్తుంది. భవిష్యత్తులో వారి జీవితాలలో జరుగబోయే విశేషాలకు తొలి బీజాలు నాటబడుతాయి. వారెలా రూపొందేదీ, ఏం చేసేదీ, సంక్షేమ రాజ్యంలో యెలాంటి పాత్ర వహించేదీ, బాల్యంనుండి యౌవ్వనం వరకు గల మధ్య కాలంపై యెక్కువగా ఆధారపడి వుంటుంది. ఆ పిమ్మట వారిలో అధికంగా మార్పురావడానికి అవకాశం లేదు ఏ సమయంలోనైనా, ఏజాతిలోనైనా, యువకులందరి సమిష్టి శక్తిని జాతీయ శక్తిగా పరిగణింపవచ్చు. అనుభవజ్ఞులైన పెద్దలు తమ అనుభూతులకు అనుగుణంగా పురోగమన మార్గాలను సూచిస్తుంటారు. వాటిని ఆచరణలో పెట్టవలసినది కార్యశూరులైన యువకులే. ఇలాంటి యువకులు భారత దేశంలో ఆయువుపట్టుగా వ్యవహరించి రూపొందగల వారు సుమారు 10 కోట్లమంది వున్నారు. వారి వూహలను సరియైన మార్గంలో నడిపి వారిశక్తి స్తోమతలను ప్రయోజనకరంగా వినియోగించుకో వలసిన బాధ్యత సమాజానిదే. స్వాతంత్ర్య పోరాటంలో భారత యువకులు నిర్వహించిన పాత్ర చరిత్రప్రసిద్ధమైనది. గాంధీజీ పిలుపు నందుకొని యెంతో మంది తమ తమ రంగాలను వదలి స్వాతంత్ర్యోద్యమంలోకి దూకారు. జాతీయ నాయకులని గౌరవింపబడిన వారందరు ఆనాటి యువకులే. త్యాగానికి మారు పేరైన యువకులు తమ సర్వస్వాన్ని త్యజించి సాహసోపేతంగా సమరరంగంలోకి దూకి ఉరి కంబాలకు సహితం బెదరక, వీరోచితంగా పోరాడిన గాథలు మనం మరచిపోలేం. వారందరి త్యాగ ఫలితంగానే మనకు స్వరాజ్యం లభించింది.

స్వరాజ్యానంతరం దేశచరిత్ర మారిపోయింది. ఒక కొత్త తరహా పోరాటం ప్రారంభమైంది, పరదేశపాలకుల మీదకాదు; స్వదేశంలోనే వున్న దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం వంటి సాంఘిక పరిస్థితుల మీద. జాతీయ పునర్నిర్మాణోద్యమం ప్రారంభమైంది. ఆసేతుహిమాచలం దేశమంతా కలిసి పని చేయవలసి వచ్చింది. నిర్మాణకార్యక్రమం మన ఆయుధంగా, సాంఘిక అసమానతలు అన్యాయాల తొలగింపు మన లక్ష్యంగా యీ ఉద్యమాన్ని ప్రారంభించాం. స్వాతంత్ర్య పోరాటకాలంలో దేశంలోని కోట్లాది యువకుల కోర్కెలు తీరడానికి వీలుగా నిర్మాణాత్మకమైన ప్రజాహిత కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. ప్రజాస్వామ్యభావాలు పోషిస్తూ సమాజ లక్ష్యం గ్రామ గ్రామాలకు ప్రయాణం కట్టింది. వీటిని దేశం నలుమూలలా వ్యాపింపజేయగల వారు యువకులే. ఉడుకు రక్తం వుప్పొంగే యువకుల వుపన్యాసాలు, చర్చలు సంవిధానాలద్వారా యీ లక్ష్యాలు పల్లెప్రజానీకానికి దగ్గరగా వచ్చాయి. సమాజాభివృద్ధి కార్యక్రమం గ్రామాలలోని యువక వర్గాలలో నూతనోత్సాహాన్ని రేకెత్తించింది. వారి కార్య సూరతకు కొత్త కవాటాలు తెరచినది. ప్రజలలో గర్భితంగా వున్న చైతన్యం పైకి పొంగడానికి యువకుల కృషి యెంతో దోహదం చేసింది. ఈనాడు ప్రతి పల్లెలో ప్రజాహిత చైతన్యం వెల్లివిరిసిందంటే దీనికి యువక వర్గాలు నిర్వహించిన పాత్రయే ముఖ్య కారణం.

పంచాయతీరాజ్య వ్యవస్థ ఏర్పడడంతో నిజమైన ప్రజారాజ్యానికి అంకురార్పణ జరిగింది. ఈ దశలో యువకులు నిర్వహించవలసినపాత్ర ఏమిటి? గ్రామప్రజలలో నాయకత్వ లక్షణాలను పెంపొందింప జేసి ప్రజలకు లభించిన అధికారాలు సద్వినియోగం కావడానికి దోహదం చేయడమెలా? — యిటువంటి అనేక ప్రశ్నలకు సమాధానం చెప్పుకొని సరియైన కార్యక్రమాలను ఏర్పాటు చేసుకోవలసిన అవసరం వుంది. మన కండ్లముందే ఒకతరం గడచిపోతుంటుంది. ఒక కొత్త తరం తయారవుతూంటుంది. ఈ మార్పు సృష్టిలో నిరంతరం జరుగుతూవుండే సహజలక్షణం. అయితే తయారవుతున్న కొత్త తరం వారు గడచిపోతున్న తరం వారి స్థానాన్ని ఆక్రమించడానికి తగిన జవసత్వాలు, శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు, ప్రజ్ఞావిశేషాలు కలిగి వున్నారా? వారికి సరియైన నాయకత్వ లక్షణాలు సిద్ధించాయా? అని ఆలోచించవలసిన బాధ్యత సమాజం మీద వుంటుంది. కొత్త తరం వారంటే యువకులు. యువకులు సహజంగా వుత్సాహవంతులు. వారికి జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలలో తగు

శిక్షణ కలుగచేసినట్లయితే ఉద్యమాన్ని సరియైన మార్గంలో నడపడానికి సమర్థులవుతారు. పంచాయితీ రాజ్యవ్యవస్థ ఏర్పడిన తర్వాత జిల్లా, బ్లాకు, గ్రామస్థాయీలలో ప్రజల పరం చేయబడిన అధికారాలను చలాయించడానికి ప్రజాక్షేమ కార్యక్రమాలు అమలు పరచడానికి నీతి, నిజాయితీ కలిగి పరిపాలనాదక్షులైన ప్రజాప్రతినిధులు యెక్కువగా కావలసి వచ్చింది. వీరందరూ యువక వర్గాలనుండి రావలసిందే. గ్రామాలలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమానికి ప్రజోద్యమ స్వరూపం వస్తేనే పనులు సునాయాసంగా చేసుకునే వీలుంటుంది ఆ స్వరూపం రావాలంటే గ్రామసీమలలోనే యువకులు నడుంకట్టి నిలవాలి. స్థానిక కారణాలవల్ల యువక వర్గం వీటిపట్ల నిర్లక్ష్యం వహిస్తే అక్కడి కార్యక్రమాలు చప్పచప్పగానే వుంటాయి. గ్రామ పంచాయితీలు, పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తుల వంటి ప్రజాసంస్థలలో యెంత యెక్కువ మంది యువకులు సభ్యత్వం కలిగియుంటే అంత ఎక్కువగా ప్రజాక్షేమానికి సంబంధించిన కార్యక్రమాలు అమలు జరుగుతాయి. ఎందుకంటే యువకులకు స్వార్థమనేది చాల తక్కువగా వుంటుంది. పెద్దలలో నైనా యేవైనా కొద్దికొద్ది లోపాలు వుంటాయేమో కాని, యువకులు నిప్పుకడ్డీల వంటివారు. వారిని ఆశ, స్వార్థం, సామాన్యంగా అంటలేవు. అందువల్ల ప్రజాసంస్థల నిర్వహణలో యెక్కువగా యువకుల ప్రమేయం వుండడం చాల అవసరం.

యువజనుల నసికావసరములు గ్రామం సంబంధించిన వరకే పరిమితియై వుండక, జీవించుటలో, పనిచేయుటలో, శాస్త్రీయమైన ఆధునిక పద్ధతులు అనుసరించుటకు కావలసిన విజ్ఞాన సముపార్జనకై ప్రయత్నించేదిగా వుండాలి. యువకులలో వుత్తేజము పెంపొంది, వ్యక్తిత్వము అభివృద్ధిచెంది వున్నతాశయములు అలవడాలి. ఈ నూతన వ్యక్తిత్వం సాంఘికంగా మంచి మార్పులు కలుగజేయుట ద్వారా వెల్లడవుతుంది. పూర్వం నుండి వస్తున్న మూఢనమ్మకాలు, అర్థంలేని ఆచారాలు, అంతస్థులు పోయి సంఘజీవనం మెరుగు దిద్దుటకు ప్రయత్నించాలి యువకుల ఆశయములు స్థానికస్థాయిలో మాత్రమే కాక జాతీయంగా కూడ వుండాలి. సాంఘిక మానసికావసరముల తదుపరి ఆర్థికావసరముల విషయమై ఆలోచించవలసి యున్నది. గ్రామీణ యువజనులు సుఖప్రదమైన పరిపూర్ణ జీవితం గడుపుటకు వివిధ అవకాశములకై ప్రయత్నము జరపాలి.

యువజనులు గ్రామాలలో నాలుగు రకములైన కార్యక్రమాలలో పాల్గొనవచ్చును. ఒకటి ఆర్థిక కార్యక్రమములు రెండు విద్యావిషయక కార్యక్రమములు మూడు వైజ్ఞానిక కార్యక్రమములు నాలుగు సామాజికసేవ లేక నిర్మాణాత్మక కార్యక్రమములు. ఆర్థిక కార్యక్రమాలలో ముఖ్యమైనవి ప్రదర్శనాత్మకమైన సేద్య కేంద్రాలను నెలకొల్పడం, కొద్ది స్థలాలలో కాయగూరలను, పండ్ల చెట్లను పెంచడం, యింటి వాడకం నిమిత్తం కాయగూరలు పైరుచెయ్యడం, కోళ్ళను, గొర్రెలను, బాతలను పెంచడం, గుంటలలో చేపలు పెంచడం, తేనెటీగలు పెంచడం, చిన్నతరహా పరిశ్రమలు నెలకొల్పడం. విద్యావిషయక కార్యక్రమాలలో గ్రంథాలయాలు నడపడం, ప్రతిరోజూ గోడమీద వార్తలు ప్రకటించడం, తాత్కాలిక ప్రాముఖ్యతగల సమస్యలపై వుపన్యాసాలిప్పించడం, చర్చలు ఏర్పాటు చేయడం, బడిపిల్లల కార్యక్రమాలను ఏర్పాటు చేయడం ముఖ్యమైనవి. 6–14 సంవత్సరములు వయస్సుగల పిల్లలంతా పాఠశాలలలోచేరి ప్రతిరోజూ తప్పక బడులకు వెళ్ళడం చాల అవసరం. యువకులు దీనిని గురించి శ్రద్ధచేయాలి. వైజ్ఞానిక కార్యక్రమాలలో భజనలేర్పాటు చేయటం, నాటకాలు, బుర్రకథలు, పల్లెపాటలు వగైరా కొనసాగించడం, జాతీయ దినోత్సవాలు, తదితర వుత్సవాలను జరపడం, వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేయుట ముఖ్యమైనవి. నిర్మాణాత్మక కార్యక్రమాలలో – గ్రామశిక్షణ, రోడ్లువేయటం, పాఠశాలలు మొదలైన భవనములకు వెల్లవేయటం, మంచినీటి జలాశయాలను శుభ్రపరచడం, వీధి దీపాలు సిద్ధపరచటం, చెత్తను కుళ్ళింపజేసే గోతులను త్రవ్వడం, దుర్గంధ భూయిష్టమైన గోతులు పూడ్చటం, యిండ్లలో డి.డి.టి వగైరా "స్ప్రే" చేయడం, గ్రామపారిశుధ్యం కాపాడడం ముఖ్యమైనవి.

సమాజాభివృద్ధి కార్యక్రమాలలో అమలుపరచే సందర్భంలో మనము రూపొందించుకున్న ఒక విశిష్ట సాధనం శ్రమదానోద్యమం. గ్రామీణ ప్రజల శక్తిని దేశహిత కార్యాలకు వినియోగించడానికి యిది చక్కగా ఉపకరిస్తుంది. నిరుపేద వర్గాల ప్రజలుకూడ దేశభక్తిని చేతులతో ప్రదర్శించేఅవకాశాన్ని శ్రమదానోద్యమం కల్పించింది. ప్రజలసహకారానికి రాజబాట ఏర్పరచి ప్రజాశికా కార్యక్రమాల అభివృద్ధికి దోహదంచేసే యీ శ్రమదానోద్యమంలో యువకులు ముందంజ వేసి పనిచేయడానికి చాల అవకాశముంది. ప్రజలందరికీ దీనిప్రాముఖ్యాన్ని ప్రచారంచేసి చెప్పడం, తాము స్వయంగా అగ్రశ్రేణిలో నిలచి మార్గదర్శకులుకావడం, యువకులు తప్పనిసరిగా చేయవలసిన

పనులు. గ్రామాల్లో అంటరానితనం యింకా పూర్తిగా పోలేదు. దానిని నిర్మూలన చేయాలంటే యువకులు దీక్షవహించాలి. హరిజనులు, గిరిజనుల తదితర బీదల పురోభివృద్ధికి పాటు పడాలి.

ఇటీవల జరిగిన కొన్ని సంఘటనలవల్ల ప్రజారాజ్యంలో యువకుల పాత్రను గురించి ప్రతివారు శ్రద్ధగా యోచించవలసివచ్చింది. చైనా మనమీద నిష్కారణంగా కయ్యానికి కాలు దువ్వింది. దేశంలో అత్యవసర పరిస్థితి ప్రకటించబడింది. తాత్కాలికంగా యుద్ధం ఆగిపోయినా దేశరక్షణకు సర్వసన్నాహాలు చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. దేశంలోని యువజనులందరినీ, దేశరక్షణ కృషిలో సమీకరించవలసిన ఆవశ్యకత కలిగింది. ఒకవైపు మన సైనిక దళాలు వీరోచితంగా పోరాడుతుంటాయి. మరొకవైపు ప్రజలందరి సహాయ సహకారాలు వారికి అందాలి ఇంటింటా ప్రజలు సైనికులవలె పని చెయ్యాలి. దేశరక్షణ నిధికి వసూళ్లు, రక్తదానం మొదలగు కార్యక్రమాలలో ప్రజలు చైతన్య సముద్రంలా వుప్పొంగి పనిచేశారు. ఇందులో భారత యువకులు నిర్వహించినపాత్ర అద్వితీయం. అయితే యింతమాత్రం చాలదు. సైనికులకు తోడుగా యువకులందరూ మాతృదేశ రక్షణకై ద్వితీయ సైనిక శ్రేణిగా నిలబడాలి. దానికి తగిన శిక్షణ పొందాలి. ఈనాడు ప్రభుత్వం కళాశాలలన్నింటిలో యన్. సి. సి. శిక్షణ నిర్బంధం చేసింది. నగరాలలోను, పట్టణాలలోను విద్యార్థులను దేశరక్షణ కృషిలో తయారు చేయడానికి యీ పథకం వుపయోగ పడుతుంది. అలాగే పల్లె ప్రాంతాలలో గ్రామీణ స్వచ్ఛంద సేవాదళాలు ఏర్పాటుచేయ బడినవి. గ్రామీణ ప్రాంతాలలోని యువకులు వీటిలో అధికసంఖ్యలో చేరి యీ పథకాన్ని జయప్రదం చేస్తున్నారు. ఈ స్వచ్ఛంద సేవాదళంలోని సభ్యులు చేయవలసిన కార్యక్రిమాలలో యే పనులను ముందుగా ప్రారంభించ వలెనన్న విషయం గ్రామ అత్యవసర సంఘంవారి బాధ్యత. ఆ ఎన్నిక చేసుకొనుటలో గ్రామంలోని అవసరములను, గ్రామీణ స్వచ్ఛంద సేవాదళము, రక్షణ బ్యాంకు సభ్యుల ప్రత్యేక నేర్పులను (special skills) గుర్తించుకోవాలి. జిల్లా, బ్లాకులలోని అధికారుల సలహాలుకూడ యెప్పుడూ లభ్యమవుతాయి. అన్నిపనులు ఒకేసారి ప్రారంభించి ఏ పనీ పూర్తి చేయకుండుటకంటే ఏదోకొన్ని నిర్ణీతములైన పనులను ప్రారంభించి పూర్తి చేసికొనిన తరువాత మిగతా పనులకు పోవుట మంచిది. స్వచ్ఛంద దళములలోని సభ్యులను కొన్ని వుపసంఘములుగా విభజించి వాటికి నిర్దుష్ట కార్యములను అప్పగించుట యుక్తము. ఈ కార్యక్రమములను కొంతకాలం చేసి మానివేయటం కాదు. ఈ పనులను సదా చేయించుచూ, గ్రామానికి సామూహిక, వ్యక్తిగత లాభములను అందించుటలో అత్యవసర సంఘము ప్రయత్నించునని ప్రభుత్వమువారు నమ్ముచున్నారు. ప్రజారాజ్యములో యువకులు వహించవలసిన పాత్రలో యిదొక ముఖ్య భాగము. ప్రజారాజ్యమంటే సర్వసత్తాక ప్రతిపత్తిగల రాజ్యము మన సార్వభౌమాధికారానికి యే మాత్రం భంగం వాటిల్లినా మనయువకులు సహించరాదు. ఎంతత్యాగానికైనా సిద్ధపడి మాతృదేశ రక్షణకు బద్ధకంకణులు కావాలి. అటు శాంతికాలంలోను యిటు యుద్ధకాలంలోకూడ యువకులు ముందుండి పనిచేయ వలసిందే. "ఇదం బ్రాంహ్యమిదంక్షాత్ర" మన్నట్లు రెండంచుల పదును కత్తుల లాగా యువకులు దూసుకుపోవాలి.

యువకులు నిర్వహించవలసిన పాత్రలో అన్నింటికంటే ముఖ్యమైనది ఐకమత్య సాధన. అందుకే సమాజాభివృద్ధి కార్యక్రమాలు, అందుకే ప్రణాళికలు. ఇవన్నీ సఫలమయితేనే కాని గ్రామప్రజల జీవన ప్రమాణం వృద్ధికాదు. ప్రజల్లో ఐకమత్యం పెంపొందించడానికి, జాతీయ సమైక్యతా భావం వృద్ధి పొందించడానికి యువకులు కృషిచేయాలి.

> "నాకు యీనాటి యువతరం వారిలోనే విశ్వాసంవుంది. కార్యకర్తలందరు వారినుండే వస్తారనే నమ్మకంవుంది. సమస్యలనే మదగజాలమీదికి వారు సింహకిశోరాలవలె లంఘిస్తారు" అనే ఆశాభావం వెలిబుచ్చారు వివేకానందస్వామి. ఆయన కాలంలోనేకాదు, యిప్పుడైనా, యికముందైనా బాధ్యతంతాయువకులదే.



# ఆంధ్రభాష - హకారాది పదములు

— తూమాటి దొణప్ప

(గత సంచిక తరువాయి)

IV. *అన్యదేశ్యములు*[28] : నవీనోత్తరాహ భాషలనుండియు, భారతీయేతర భాషలనుండియు ఎరవుతెచ్చిన పదములు ఇట ఉద్దిష్టము తిక్కన్న చివరిరోజులలో గాలివాన చినుకుపాటుగా అక్కడొకటి యిక్కడొకటి చెదరు చెదరుగా పడి చెమ్మగిల్లి, శ్రీనాథుని హయామునకు చేరేడు చెలమగా రూపొందిన అన్యదేశ్య బిందురాశి, ప్రబంధ యుగము నాటికి ఆంధ్రభాషా స్రవంతిలో చిఱుపాయగా పెంపొందుట వారిత్రక సత్యము[29]. క్రీ.శ పదునెనిమిదవ శతాబ్దాంతమునకు ఆంధ్రకావ్య ప్రయుక్తములగు ఇట్టి అన్యదేశ్యములు వేయికి పైమాట యని ఈ పాయ ఆట్టు పుట్టాన వాళ్ళ నెఱుఁగ కృషి సేయుచున్న మా పరిశోధక విద్యార్థి లకంసాని చక్రధరరావు అంచనా. కావ్య ప్రయోగ సహితముగా మదీయ పరిశీలనమున నిర్ధారితమయిన హకారాది పదజాలము ఈ శీర్షిక క్రింద సంగ్రథితము. 'హసనల్లిఖానుండు' (రంగా. 2_248), 'హసను బేగు' (పద్మనాభ యుద్ధము, 117), 'హిరాయత మొహదీన్ ఖాను' (రంగరాట్. పీఠిక, 106), 'హుమామియా' (యయా, 1_16), 'హుసేన్ దాసవర్య' (గంగనపల్లి హుసేన్‌దాసు శతకము), 'హైదరుజంగు' (రంగా. 1_142) మొదలగు వ్యక్తినామ వాచకము లిందు పరిహృతము.

*1. హజరతి* : పూజనీయుఁడు, మాన్యుఁడు. 'హజరతి మోఖిదుంజి ఖాదిరి' (యయా. 1_67), 'హజరతి శేఖు బుదురుదిఖాదిరిని మదిందలంచు శేఖిభరాముండును..' (పైది)

మరాఠీ హజరత : పవిత్రత, శ్రేష్ఠత; పూజ్యతావాచకము.

పారసి. హజ్‌రత్ : ధర్మదేశికులు, దైవభక్తులు, చక్రవర్తులు మొదలగువారి నామములకు పూర్వము చేర్చు పూజ్య వాచకము.

*2. హజారము* : రూ. హజ్జారము, హాజారము. కొలువుకూటము, ఆస్థాన మంటపము. 'ఇంద్రుని హజారపుమేడ...' (కాశీ. 1_125), 'వాఁడును హజారంబు వాకిట నిలిచి...' (వరాహ. 11_57), 'హజారపుఁ ద్రోవ' (కళా. 2_16), '...హజారమునందు భేరి...చఱపించె...' (విజయ. 3_160); 'కొలువు హజారమై' (రామా. 1_4).

పా. హాజిర్ : సన్నిధినుండు, సేవకు సిద్ధముగానుండు; హాజిరాన్ : సభాస్తారులు; హాజిరీ = ఓలగము వారు, సభ్యులు.

హజ్జారము : చూ. హజారము. 'నగరి హజ్జారము స వాహనంబు డిగ్గి' (కకు. 3_16).

*3. హద్దు* : అవధి, మేర. 'ఉభయ పక్షంబుల ఒప్పైనబలము _ నివసించి యున్నది నిశ్చలమతిని _ హద్దులుచెప్పెద నవి చిత్తగింపు...దక్షిణదిశ హద్దుతగ వివరింతు...పడమటికిని హద్దు బాల చంద్రుండ కొదమగుండ్లయనెడి గురిగ్రామ మొకటి' (పల్నాటి. పు. 87), 'హద్దు ముద్దు మీఱి' (రాధికా, 3_47), 'పెద్దలికంబులు ప్రియములు_హద్దుగ..' (శేష పీఠిక, 48), 'వచ్చెను హద్దుతప్పిబలవర్గము...' (రంగా. 3_62), 'హద్దుపత్రికె' (నెల్లూరు శాసనావళి)

మరాఠీ. హద్, హద్ద: మితి, మేర, సీమ.

గుజరాతి. హద, హద్ద : మేర. అవధి; అంచు.

పారసి, హద్, హద్ద్ : మేర, పొలిమేర, అవధి; వేర్పాటు; అంచు; లక్ష్యము; హుదూద్ : హద్దులు.

అరబ్బీ. హద్ : మితి, మేర.

*4. హబిశీ* : అబిసీనియా దేశీయుఁడు, 'హబిశీ రౌతులనంగఁ దుమ్మెదలు సొంపారెన్' (చారుచంద్రో. 4_46, బ్రౌణ్యమున ఉట్టంకితము, పు. 1123); 'హాజీఁగు బల్ పదాణి హబిసీల మదంబులు దీఱఁగా...' (పెద్దగిరి విజయము[30], పు. 59). 'హబిసీలకు లెక్కలుచూచి' (పైది. పు. 58).

మరాఠీ. హప్శీ, హబ్శీ: అబి

28. అన్యదేశ్యములనుగూర్చి ప్రత్యేక పరిశ్రమ చేసినవారు: ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను, మిశ్ర బ్రౌణ్యము 1854; డా. చిలుకూరి నారాయణరావు, ఆంధ్రభాషా చరిత్రము, 'తెనుఁగునఁ జేరిన యన్యదేశీయ శబ్దజాలము, పుటలు 575_621; నిడుదవోలు వేంకటరావు, శ. ర., అనుబంధము, 1958, పుటలు 98_111.

29. 'శ్రీనాథయుగము: అన్యదేశ్యములు', 'ఆంధ్ర ప్రదేశ్' పత్రిక, 1963, మార్చి, ఏప్రిల్, మే, జూన్, జూలై సంచికలు.

30. మల్లంపల్లి శరభేశ్వరశర్మ సంపాదితము, Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, 1952, Vol. V. No.2.

సీనియా దేశీయుఁడు; హప్ (బ్) సాణ : అబిసీనియా దేశసంబంధి.

గుజరాతి. హప (బ) శీ: అబిసీనియా దేశీయుఁడు; హప (బ) సణ : అబిసీనియా స్త్రీ. పారసి. హబ్శ్ = అబిసీనియా వ్యక్తి; హబశీ; అబిసీనియా (ఎథియోపియా) దేశమునకు సంబంధించిన; నల్లబాసిన.

అరబీ. హబ్శ్.

*5*. హుమరావు : చూ. హుమ్మరావు: అంగరక్షకుఁడు; సహచరుఁడు. 'అమిత విక్రములైన హమరావు లొక చోట' (రంగ రాట్. పీఠిక, 14). 'పౌజుదార్లు హుమరావులును కిలాదారులు' (పైది. 112). పారసి. హమ్‌రవ్ : సహయాత్రికుఁడు; హమ్‌రాహీ : సహచరుఁడు, మిత్రుఁడు; హమ్‌రూ : ముఖాముఖి; హమ్ ; సమత; అన్యోన్యము; రవ్ : ప్రయాణము, దారి; ఉమరా ? : అమీర్ అనుదాని బహువచనము, రాజకుమారులు అని యర్థము. 'ఉమరా ?'ను మూలముగా భావించినచో ప్రస్తుతారోపము 'హుమరావు' అని యుండనగు; ఈ పక్షమున 'హుమరావు' కృతక ప్రామాణికము (hyper form) 'హదురావు', 'హుదురావు' అని రంగరాట్. ముద్రిత ప్రతులు - ఇంకను విచార్యము.

*6*. హమా : అన్ని, ఎల్ల. 'హమాదినుసు మేలుసరకు గలిగి' (హంస. 2-232).

పారసి. హమా : పూర్ణము, సమస్తము; హమ్ జిన్సి : సజాతీయ వస్తురాశి; హమ్ జిన్స్ : అన్ని దినుసులు.

*6 a* హమాము: స్నానద్రోణి, మణికర్ణికా తీర్థ మజ్జనంబా ! నీకు-మొనసి హమాములో మునుఁగుటరయ' (వేల్పూరి విస్సనకృత పగు విశ్వేశ్వరశతకము, పు 89).

పారసి. హమామ్ : ఉడుకు నీటితోచేయు స్నానము; హమ్మామీ : స్నాపకుఁడు.

*7*. హరకాలా : వేగులవాఁడు. 'హరకాలాలిటు వచ్చినారు భవదీయా లోకనేచ్ఛారతిన్....' (రంగా. 2-143). 'హరకాలాల్గాని వచ్చిన పరవానా చూచి...' (పైది, 2-144).

మరాఠీ. హర్కారా : రాయబారి, దూత, సందేశహారి.

పారసి. హర్‌కార్ : సర్వకార్యములు ; హర్‌కార : వార్తాహరుఁడు ; నియోగి, ఆజ్ఞప్తికారుఁడు 31.

*8*. హరబ్బీ : అరబ్బీదేశము; ఆ దేశపు గుఱ్ఱము. 'దేశభేద హయాభిధలు హరబ్బి తురికి' (ఆం. భా. 2-196); అరబ్బీ దేశపుభాష. 'ప్రాన్సు పుడతకీసు హరబ్బి పార్సి తెనుఁగు... మొదలయిన భాషాంతరముల' (రంగరాట్. పీఠిక, 81).

పారసి. హర్బీ : వీరుఁడు ; విరోధము ; హర్బ్ : యుద్ధము ; జరగడము ; హరూబ్ దోఁపిడి ; కొల్లవెట్టుట (ఈ వ్యుత్పత్తియింకను విచార్యము).

*9*. హరాంకోరు : కృతఘ్నుఁడు ; దుర్జనుఁడు : పోకిరి 'దగులుబాజి హరాంకోరు వాజు...' (హంస. 5-117); హరాంఖోరైన' (ద. హిం - శా. X. No.751 ; క్రీ. శ. 1592.

మరాఠీ. హరాంఖోర : కృతఘ్నుఁడు ; నీచుఁడు.

పారసి. హరామ్ ఖ్వార్. హరామ్ ఖ్వుర్ : లంచగొండి ; హరామ్‌కార్ : జారుఁడు.

*10*. హల్లా : కోటను ముట్టడించుట, లగ్గపట్టుట. 'హల్లా సేయుదు బొబ్బలి కిల్లా...' (రంగా. 2-54). '...కించిన్మాత్రన్ హల్లాకు నూలుకొలుపుచుఁ జెల్లాకుం జెదరఁజేతు...' (రంగా. 2-247).

మరాఠీ. హల్లా : అల్లరి, సందడి (ధ్వన్యనుకరణము).

*10 a*. హవా : బైబిలు పూర్వనిబంధన ప్రకారము ఆదిమ స్త్రీ ; మానవుల మొదటితల్లి. 'అఖిల జగదంబ యన్న పూర్ణాంబకిలను - వ్యర్థమగు పేరు మామా హవాయనంగ - విజిత పరయూధ కాశికా విశ్వనాథ !' (విశ్వేశ్వర శతకము).

పారసి. హౌవా : మానవమాత ; మామీ: తల్లి.

హవుసు : చూ. హౌసు. 'హవుసుగఁ బూరేడు వేఁటలాడెడు సామీ, (పార్వతీ. షష్ఠా. పు. 121).

*11*. హసము : దండుకూచి చేయునపుడు రస్తు సరంజామును మోసితెచ్చెడి పరివారకులు _ 'జతనంబుతోఁదేఁటి సంచిణీ హసము భిన్నీదుము దారుగా నిగుడి నడువ...' (అనిరుద్ధ. 3-19).

మరాఠీ. హశమ్: అనుయాయి; తైనాతి, నౌకరు;

పారసి. హశమ్ : సామగ్రి; హశమత్ = సేవకులు.

అరబ్బీ. హశమ్: సరంజాము, సామగ్రి; హశ్మత్ : పరివారము.

*12*. హాకీము : ఏలిక, ప్రభువు. '...భయోక్తులు పల్కు- మీరు హాకీము లొకించు కేని పరికింపక...' (రంగా. 2-151), 'హాకీముల్ దమ రిట్లు పల్కుటకు సర్వాంబే విమర్శింపకన్' (పైది. 2-218).

మరాఠీ. హాకిమ : పాలకుడు; రాజప్రతినిధి; యజమాని, అధికారి.

---

31. పారసి. 'హర్‌కార్'కు సంస్కృతము నందలి 'సర్వకార్య' జ్ఞాతిపదము. జెంద్‌భాషలో 'హౌర్వ' = సంస్కృత, సర్వ —.

పారసి. హాకీమ్: న్యాయాధికారి; సేనాని; పాలకుఁడు; హాకిమీ :పాలన; ప్రభుత్వము: హాకీమ్ : పదాధికారి; శాసకుఁడు; స్వామి.

*13*. *హాజరు* : రూ. హాజీరు (రాజ) సన్నిధినుండుట. '...ఆరంగావనీ భర్తదాఁ బంచెన్వీడె వకీలు హాజరుగ...' (రంగా. 2_86). '...శ్రీకృష్ణ చంద్రదేవు మహారాజులుం గారు అనే మేము హాజరులమై శేవిస్తిమి' (శ్రీ కూర్మశాసనము, నెం. 1192, ద. హిం. శాసనావళి 5వ సం; క్రీ శ. 1866).

మరాఠీ. హాజర, హాజరి : సమ్ముఖమున నుండుట, సమక్షము.

పారసి. హాజిర్ : సన్నిధినుండుట; సన్నద్ధ మగుట.

*హాజారము* : చూ. హజారము. 'యోజింపు మనుచుఁ బంచిన హాజారంబునకు వచ్చి యమ్మంత్రివరుం డేజాడ...' (రామా. 2_75), 'వారిఁ బిలిపించి కవుఁగిట గారవించి హాజారమునన్ వసించి...' (పెదఘిరి విజయము, పు. 53), 'హాజారము హజారమను నివి...ముఖశాల కలరు...' (అం. భా. 2_14).

*హాజీరు*: చూ. హాజరు. 'హాజీరయనెదొ నౌరోజర్సు మేజువాణి విల్కారావంతి నిలఁగ, (విశ్వేశ్వర శతకము).

*14*. *హాజీలు* : చూ. హాజరు ఎడబాయకుండుట. 'లోలాక్షియుఁ దోడనె హాజీలై రా నారగించి చేఁదొలఁచి...' (సత్యభామా. ద్వితీ,); అంగరక్షకులు. ఇరుపక్కియల బవిరిగాఁ గ్రిక్కిరిసి హాజీలై తేజీల నెక్కి కుమారలోకమ్ము నల్లుంద్రు క్రమ్ముకొని రాఁగ...' (పైది). 'హాజీలగు బల్షరాణి హబిసీలమదంబులు దీటఁగాఁ బిరంగిలఁ దెంల్చికాల్చి...' (పెద్దఘిరి విజయము, పు. 59).

మరాఠీ హాజీర్ : సమ్ముఖము.

*15*. *హాలుసాలు* : వర్తమాన సంవత్సరము. 'చేవెత్తిపోకుండ నాలవవాయిదా హాలుసాలునకు కాపయ్యేనందు' (చాటరాతి లక్ష్మీనరసకవి పద్మనాభ యుద్ధము, పద్య. 42).

మరాఠీ. హాల్‌సాల్ : నడచుచున్న యేఁడు.

పారసి. హాల్‌సాల్ = ఈయేఁడు; వర్తమాన సంవత్సరము; హాల్ : వర్తమాన కాలము; హాలా : ప్రస్తుతము.

*16*. *హిజుగు* : చిక్కు, బంధము. 'మరు హిజుగులు విచ్చఁగ' (సత్యభామా. చతుర్థా).

పారసి. హజ్‌క్ : త్రాటితో బంధించుట; నొక్కుట; అదుముట

*17*. *హిందూ* : ఆర్ష (వైదిక) ధర్మానుసారి. 'హిందూరావు సురథాణి...తిమ్మారెడ్డిం గారు' (3వ పంక్తి, A. R. No. 469 of 1915; క్రీ. శ. 1496); 'హిందూ రాజ్యరమా ధురంధర...' (మను. 3_142); 'హిందూరాజ్య సంస్థాపనా' (కావ్యా. సం. 5_243); హిందుఖానునిబలావళి' (కువల. 1_32) తురక దొరలము మాకు హిందువులు భరమె' (రంగా. 2_39), మా కలక్ష్యములుగా హిందూల దోర్దర్పముల్' (పైది. 2_44), 'హిందూ ముసల్మాను లేకమై భుజియింపఁగా నిచ్చఁగనె జగన్నాయకుండు' (30వ పద్య. వేల్పూరి విస్సనకృత మగు విశ్వేశ్వర శతకము), 'శ్రీమదఖిల భువన భూషణంబగు చెన్నపురంబున నున్న వివేక గుణసమృద్ధిగల శ్రీమంతుల చేత నిర్మితంబైన హిందూ విద్యాసభలో సంస్కృత పండితుండైన పుదూరి సీతారామశాస్త్రిచేత..' (బాలవివేక కల్పతరు_నేఁటి పెద్దబాల శిక్షకు పూర్వరూపము _ పీఠిక, క్రీ. శ. 1853), 'హిందూ నరేంద్రులు నందఱు సభఁజేసి...' (చెన్నపురీ, పు. 5), 'హిందువులను పగనాపురమందలరున మంద విభ్రమాస్పందములై హిందూ విద్యానిలయము...' (పైది, పు. 66), 'హిందువులు నిల్పు షాపులు నందలరున్...' (పైది, పు. 67).

మరాఠీ. హిందవీ, హిందీ, హిందూ: హిందువులకు సంబంధించిన; హిందూస్తానీ: హిందూస్తానీభాష;

గుజరాతి. హిందవాని:హిందూస్త్రీ; హిందవీ, హిందీ: హిందువుల భాష; హిందూస్తానీ: నర్మదానది కుత్తరము నుండు దేశభాగమునకు చెందిన సిపాయి.

పారసి. హిందూ: హిందువు, భారతీయుఁడు; గస్తి తిరురువాఁడు; బానిస, సేవకుఁడు; విగ్రహారాధకుఁడు; హిందవానీ, హిందువానీ: హిందూదేశపు ఉక్కుతో తయారుచేసిన; హిందువీ, హిందూవీ: భారతీయభాష: హిందీ: హిందూదేశమునకు సంబంధించిన [32].

*18*. *హుకుము* : రూ. హుక్కుమ్ము. ఆజ్ఞ: శాసనము. 'హుకుము చొప్పున నడవక వికటమతినిఁ దిరుగఁబడి...' (రంగా. 2_258), 'భూజనులలరారఁగా హుకుమొసంగిరి క్రమ్మఱ రాజ్యమీయఁగాన్' (చెన్నపురీ. పు. 7), 'కొత్వాలుఖానా హుకుం ఖరారైయుండ ప్రహరి తిర్గుటమానె భైరవుండు' (వేల్పూరి విస్సనకృతమగు విశ్వేశ్వర శతకము)

32. 'హీనందూషయతి హిందూ' అనువ్యుత్పత్తి అర్వాచీనము, అశాస్త్రీయము. సంస్కృతేతర పదములను ఏదోయొక సంస్కృత మూలధాతువుతో ముడిపెట్టనెంచురీతి నిరాకరమను కుమారిలభట్టు ఎచ్చటితను వీరు పాటించినట్టు కన్పట్టదు.

మరాఠీ. హుకుమ, హుక్మ: ఆనతి; శాసనము; గుజరాతి. హుకామ.

పారసి. హుక్‌మ్: అనుమతి; తీర్పు; న్యాయాధికారము; శాసనము: అరబ్బీ. హుకమ్.

*19.* హుక్కా : పొగాకు పొగను పీల్చెడి సాధనము.

'నీరు హుక్కా ఒకటొరె గద్దయని యా హితాగ్నుల నెత్తు లణచకుండ' (సింహాద్రి నారసింహ శతకము, పు. 15). 'హుక్కాల' (భద్రగిరి శతకము, 50.ప).

మరాఠీ. హుక్కా.

పారసి. హుక్క: నగలుగాని మందులు గాని ఉంచెడి గుండ్రని సందుకాపెట్టె; పొగ పీల్చెడి గొట్టము.

హుక్కుమ్ము: చూ. హుకుము. 'ఇమ్మహిఁ బ్రబలిన ఢిల్లి యహమ్మదుషా పాదుషా ధరాధీశ్వరు హుక్కుమ్మున. .' (రంగరాట్. పీఠిక, 105).

*20.* హుజుత్తు : మోసము; వృథా కలహము '...పట్టిణిత్తులు సేయురి త్తముడి కాండ్ర హుజు త్తనిపించక వి త్తహాని సేసితి వని...' (నిరంకుశో. 2_139, సరస్వత్యనుబంధము, 22, కాకినాడ, 1913). '...హుజి త్తనిపించక. .'అని(ఆంధ్రశిల్పకళాపరిషత్తు సత్తెనపల్లి వారి ప్రతి, 1951, పు. 188) ఒక పాఠము

మరాఠీ. హుజత్, హుజ్జత్: వ్యర్థముగా వివదించుట, పేచీపెట్టుట; జగడము.

పారసి హుజ్జత్. వాగ్వివాదము; వ్యర్థ: కలహము; సాకు, నెపము; సాక్ష్యము. ప్రమాణము; తీర్పు, తీర్మానము

హుజూరు : చూ. హుజూరు. కొలువు కూటము. 'మహందుదమీను హుజూరుకు వచ్చి' (ద. హిం. శా. X No. 759; క్రీ. శ. 1663 'ఒనరు నిభరాము పాదుషా హుజూరునందు' (యయా 1_57). హుజూరుపాటకు రాకయున్న జక్కులు వేరు' (సత్యభామా. చతుర్థా.), 'పెంపుమీఱు వసంత షేషువాహుజూరుననుండి చెలావణి హొనరు దెలుప' (అనిరుద్ధ. 3_19); 'హుజూరు కొలువులు' )కువల. 1_38)

*21.* హుజూరు : రూ. హుజూరు. ఆస్థానము, కొలువుకూటము. '...అవసర సచివుల్ చెచ్చెర హుజూరునకుఁ బిలవచ్చిన..' (రాజవా. 5_37).

మరాఠీ. హుజూర: ఆస్థానము; అధిపతి, ఏలిక, యజమాని

పారసి. హుజూర్: సమక్షము, సమ్ముఖము;

అరబ్బీ. హుజూర్: అస్తిత్వము; సమ్ముఖము.

*22.* హుమా : రూ. హుమాయి, హుమాయీ, హుమావు, వాహనము. 'కొక్కు హుమాజోదు' (అచ్చ. రా. పీఠిక, 21), 'చిలుక హుమావజీరు' (గోగులపాటి కూర్మకవి సుందరీమణి శతకము, పద్య. 42). 'చిల్కహుమా' కృ. శకుం. 2_174). 'సిరిగుల్కెడి చిల్కహుమా' (యామినీ. 4_71). మరాఠీనుండి వచ్చిన పదమని బ్రౌణ్యము రివైజెడ్, 1397; ఆం. భా. చ. 620.

మరాఠీ. హుమ్మా: గరుడపక్షి.

పారసి. హుమా: భూమిపై వ్రాలకుండ నిరంతరము ఎగిరెడి ఒక పక్షి; హుమాయ్: హుమా పక్షి కెక్కెను.

హుమాయి : చూ. హుమా. 'కాయజారాతిగిబ్బ హుమాయినెక్కి' (పరతత్త్వరసాయనము, 1_111), 'పదార్వన్నెయంచ హుమాయి వడిగనెక్కి' (ఉ. రా. 2_178). 'పులుగుహుమాయి జోదు' (అచ్చ. రా. పీఠిక, 4). 'చిల్కహుమాయితేజి' (హంస, 4_86). '...ఘోడాన హుమాయి...' (చాటుపద్యసీసములు, 7).

హుమాయీ : చూ. హుమా. 'ఎలమిన్ బంగరుతెక్కపక్కెర హుమాయీతేజి...' (దశా. 2_67).

హుమావు : చూ. హుమా. 'మలయు వెలిగిబ్బనీలా హుమావునెక్కి' (విశ్వేశ్వర శతకము, 43 ప.).

హుమ్మరావు : చూ. హమరావూ. '...గోలకొండకు పోయి....అక్కడ ఉండే అమీర్లు హుమ్మరావులు దివానులు మొదలయిన గొప్ప గొప్ప వారిని దర్శనం చేసుకొని...' (దూపాటి కైఫియతు; శ్రీధర మూర్తి, సర్వేశ్వరరావు గారలచే సంపాదితము)[33].

హురుమంజి : చూ. హురుముంజి. 'హురుమంజి ముత్యాల యొరగు పాగమెఱుంగు' (సారంగ. 1_79). 'గొప్ప హురుమంజి సుప్పాణికూర్ప దంపు' (కృష్ణరా. 3_75). 'హురుమంజి ముత్యాల కుతికంటు......' (కవిరాజ మనో. 2_190). 'హురుమంజి పూసల' (హంస. 4_109); 'హురుమంజి పల్లము' (రాజవా. 2_46).

హురుమంజీ : చూ. హురుముంజి. 'చెలువంబై కళలన్వెలుంగు హురుమంజీ దేశపున్ ముత్తియంబులతోఁ గూర్చిన చేరు చుక్క...' (అనిరుద్ధ. 5_72).

*23.* హురుమత్తు : గొప్ప, పెద్ద (శ ర.). 'ఒక్క నిబ్బరముగా హురుమత్తు పరువెత్తు సళ్ళించు కళ్ళెముల్ ఘల్లనంగ' (కృష్ణరా. 1_53), 'ఒక్క హురుమత్తు నను

33. Bulletin of the Govt. Oriental Mss. Library, Madras, Vols. xiii & xiv.

మ్మత్తూరు.....నోడించి' (ప్రైది. 3_6), 'హురుమత్తు వేళల' (పార్వతీ. ప్రథమా. పు. 10), 'సరిఖేలు హురుమత్తు సాపు బాగీలకై మఱచెనప్పటి వృత్తిమాధవుండు' (విశ్వేశ్వర శతకము)

మరాఠీ. హుర్మత్ : ప్రతిష్ఠ : గోరవము; గొప్పదనము.

పారసి. హుర్మత్: సచ్ఛీలము; మర్యాద.

24. *హురుముంజి* : రూ. హురుమంజి. పారసీక జలసంధి చేరువలో క్రీ. పూ. నాలుగవు శతాబ్దినుండియు ప్రసిద్ధి కెక్కిన ఒకానొక రేవు పట్టణము. క్రిందటి దినముల లోపల గుఱ్ఱముల, ముత్యముల ఎగుమతికి ప్రసిద్ధి. 'హురుముంజి బలుతేజి హరులు దెచ్చె' (హర. పీఠిక. 26).

పారసి. హర్ముజ్, హుర్మ్యజ్, హోర్ముజ్ : పారసీక జలసంధిలో ఈ పేరుగలదీవి; ఈ పేరుగల రేవుపట్టణము.

25. *హుశారు* : చూ. హుషారు. హుసారు. చలాకీతనము, చురుకుదనము. 'చిగురాకు తెగసారు వగరాజిలు హుశారు వగమీఱు రత్నాల వహిగుడార్లు' (కృష్ణరా. 3_75), 'నిశ్శంక నలంకరించుక హుశారున వీథికివచ్చుచుండి...? (హంస. 4_85).

మరాఠీ. హుశారీ : చలాకీతనము.

పారసి. హుశ్యార్, హోశ్యార్ : జాగరూకత; జాణతనము; హుశ్యారీ : ఎచ్చరిక; హుశివార్; వివేకము; హోశ్యారీ : నేర్పు, తెలివి.

*హుషారు* : చూ. హుశారు. 'మనసున హుషారు చెందదామరుని దంతి' (రాధికా. 3_130) 'వెల్పటికి హుషారునంజని' (హంస. 5_164)[34].

*హుసారు* : చూ. హుశారు. 'అలివేణి సీ పల్కు లాలకించినగాని రాచిల్కల హుసారు సైచ(జాల' (భోజసుతా. 3_64), 'హుసారున' (పార్వతీ. షష్ఠా. పు. 120).

26. *హేజీబు* : ప్రతినిధి; మంత్రి; సలహాదారు. 'హేజీబులపుడు వచ్చి రగణిత స్థితి' (రాజవా. 5_36), 'హితులున్ రాజుల మాత్యులాదిగములున్ హేజీబులార్యుల్...' (సత్యభామా. ప్రథమా. పు. 11) 'హేబీబునను తురు' (శువల. 1_33); కుతుపనమలకవారి హేజీబుల రాయవాచకము, పు. 46).

మరాఠీ. హేజీబ: దూత, రాయబారి; పరిచారకుడు.

ఉర్దూ. హాజిబ్ : కంచుకి; ప్రతీహారి.

పారసి. హాజిబ్ : ద్వారపాలకుడు; కంచుకి; మంత్రి: హాజిబీ : ప్రతీహారి పదవి.

అరబ్బీ. హాజిబ్ : చోపుదారుడు.

27. *హేజుబారి* : రాయబారి. 'ఇట్లు కనుగొన్న మన్నీని హేజుబారి కప్పురాసుల యెకిమీడు చెప్పరాని మెప్పురా...' (రంగా. 2_115) చూ. హేజీబు.

28. *హేరామి* : హింస, బాధ. 'విలువిద్యనేర్చి హేరాముల దండ్రినాటి రిపులన్ దునుమాడిన యట్టి రాముడో' (భల్లా. 2_, శ. ర. ఉట్టంకితము).

మరాఠీ. హరామీ : వంచన, దుష్టబుద్ధి; క్రూరత, నిర్దయ.

పారసి. హరామ్ : పాపకృత్యము, నిషిద్ధము, న్యాయ విరుద్ధము; హరామీ : ద్రోహచింతనగల; హంత; దోపిడికాడు.

29. *హోదా* : పదవి; స్థితి. 'మామా హోదాలో మమ్మును వుండుమని మాకు సమ్మతులుచెప్పి...' (రమణప్ప జమీదారీ గ్రామాదుల కరణముకాపుల అర్జీ)[35].

మరాఠీ. హోదా :

పారసి. హోద : వాస్తవస్థితి: సత్యము; మూలము, ప్రాచీనము.

మూలఘటిక కేతన గ్రామ్యము నకు లక్ష్యముగా నుదహరించిన '...యేగ గొంటూరమ్మ యేదాలు వోదాలు.....' (ఆం. భా. భూ. 126) అను పద్యభాగము నందలి 'హోదాలు' కు 'హోదాలు' గ్రాంథిక రూపమను దివ్య ప్రభా వివరణము విచార్యము.

30. *హౌదా* : ఏనుగు మీద కూర్చుండుట కనువుగా కట్టిన పీఠము, అంబారీ — 'విలాతి సకలాతి హౌదాల సామజములు' (రంగా. 1_156)

మరాఠీ. హౌదా : ఏనుగుమీది గద్దె.

పారసి. హౌజ : ఏనుగు మొదలగు వానిపై పయనించుటకు నిర్మించెడి తొట్టె వంటి పల్లకి ; హౌదజ్ : పయనపు ఒంటెలమీద కూర్చుండుట కనువుగా నిర్మించిన కొయ్య చట్రముతోడి గుడారము.

అరబ్బీ. హవద : ఒంటెమూపు.

31. *హౌదుఖానా* : మాడువుపై నీటి తొట్టెకల భవనము. 'హౌదుఖానా సిడులాయెగా యుత్తుంగ సౌధగోపుర బహుస్తంభ వితతి' (వేల్పూరి విస్సనకృతమగు విశ్వేశ్వర శతకము).

పారసి. హౌజ్ ఖాన : నీటి తొట్లుగల భవనము ; హౌజ్ = జలాశయము

32. *హౌసు* : రూ. హవుసు. ఒయ్యారము, సొగసు — 'కోటలా తెలుగంటి పాటలాధరలెల్ల నాటలాడదలంచ హౌసు

34. 'హుషారునంజని' అని శృంగార గ్రంథమండలి, మచిలీపట్టణమువారి ప్రతి; 'హుసారునం జని' అని వావిళ్ళవారి ప్రతి.

35. Telugu Documents, Ed. by Prof. G. J. Somayaji, Published on behalf of the National Archives of India by the Andhra University, Waltair 1957, pp. 10, 11.

మించ' (కృష్ణరా. 2_34), 'ఔరా చక్క దనంబు హౌసు...' (తారా. 3_23), 'హౌసుగా స్వారి వెడలు నవసరమున' (రంగరాట్. పీఠిక, 92), 'హౌసుమించి' (సత్యభామా. తృతీ.), 'హౌసుమించె నటంచు' (పార్వతీ. ద్వితీ. పుట 24), 'హౌసుతోఁట సింగారపుఁదోఁట...అనంగ నుపవనమొప్పు' (సాంబ. స్థా. 68), 'హౌసుకాఁడనఁగను నగు భోగి' ఆం. భా. 3_10) 'హౌసుకళ' (హంస. 2_45); ప్రేమ. 'హౌసు చెల్లించిన యందగత్తె' (తారా. 4_59).

మరాఠీ. హౌస: ఔత్సుక్యము; హవస్, హౌస్ (స): ఉత్కంఠ, పబలేచ్ఛ; విలాసము; మోహము.

పారసి. హవస్, హివాస్, హోస్, హౌస్: కామము; తీవ్రవాంఛ; ఆకాంక్ష.

అరబ్బీ హవస్: ఉబలాటము: అన్వేషణము.[36]

V. ఆంగ్లపదములు : ఆంగ్లభాషతో మనకుఁగల సహవాసము మూఁడున్నర శతాబ్దుల నాఁటిది. ఆంగ్లము ఆసరాలేనిదే శిష్టసమాజమున పెక్కుర వ్యవహారము అరగడియ సేపు గడవదు. తెలుగుల పలుకుబడిలో అడుగడుగున చెలామణియగు ఆంగ్లపదములు వేయాఱులు. కాని, కావ్యప్రయుక్తములయినవి మిగుల పరిమితము. కథావస్తువులు ఆంగ్ల సమాజముతో ప్రత్యక్ష సంబంధము కలవి యగుటచే పద్మనాభ యుద్ధము,[37] చెన్నపురీ విలాసము[38] వంటి ఆధునిక కృతులలో ఆంగ్లపదములు విరివిగా ఉపయుక్తము. హకారాది పదములు కొన్ని క్రింద ప్రదర్శితము.

*1.* హీజు : His. 'హీజు హైనెస్ దీ మహారాజా మీర్జా విజయరామ గజపతి రాజు...' (మార్కండేయ పురాణ[39]పీఠిక, పుట, 25).

*2.* హెర్ : Her, 'హెర్ హైనెస్ శ్రీమదలక రాజాంబా మహారాణీ సాహేబా వారు...' (పైది).

*3.* హేడ్డు : Head, ముఖ్యము, ప్రధానము. '...సదర్కోర్టును హేడ్డు పోలీసును' చెన్నపురీ. పు. 27), 'పేటలకు నెల్ల హేడ్డగు మాంత్రోడ్డు...' (పైది. పు. 28).

*4.* హైస్కూలు ; ఉన్నత పాఠశాల. '...విచారింప హైస్కూలున్ లోనగు స్కూలు లప్పురి సిరుల్ గుల్కన్...' (పైది, పు. 66).

*5.* హౌసు : House, బంగళా, కార్యాలయము. 'అలయార్బత్నెటు హౌసు బెన్నిహవు సొప్పారన్ లయన్ హౌసునా బలుహౌసుల్ మఱిషాపులున్...' (పైది, పు. 66), 'హూణులునుచు హౌసులకు ననుంగుం దమ్ముల హౌసులను...' (పైది, పు. 67).

VI. *కృతక ప్రామాణికములు* (Hyper forms) : హకారాది పదముల తొలివర్ణము లోపించి అజాది రూపములగుట (Deaspiration) సాధారణమగు ధ్వని పరిణామము _ హజారము > అజారము ; హజ్జ > అజ్జ ; హత్తు > అత్తు ; హదను > అదను ; హనుమ > అనుమ_; హరిగ > అరిగ ; హరివాణము > అరివాణము ; హరుసము > అరుసము; హళది > అళది ; హసాదు > అసాదు ; హావడి > ఆవడి ; హితవు > ఇతవు ; హురుముంజి > ఉరుముంజి ; హెచ్చు > ఎచ్చు; హొమ్ము > ఒమ్ము; హొసపరి > ఒసపరి ; హోళిగ > ఓళిగ _ మొదలగునవి ఈ ధ్వని సూత్రమునకు లక్ష్యములు. మీఁది జంటనుడులలో హకారాదులు ప్రాథమికములని పూర్వ ప్రకరణముల నిర్ధారితము. ఇట్టి కొన్ని అజాది రూపములకు హకారాది మాతృకలుండు సాదృశ్యము వలన, నిసర్గముగా అజాదులగు రూపములకును హకారాది మూర్తులు సృష్టింపఁబడుటయే కృతక ప్రామాణికమని ఇట వ్యవహృతము. ఇట్టి పదజాలము, వ్యుత్పత్తి స్వభావము ననుసరించి తత్సమములు, తద్భవములు, దేశ్యములు, కన్నడపదములు అన్యదేశ్యములు, ఆంగ్లపదములు అనుఆఱు ఉపశీర్షికల క్రింద వివృతము.

I. *తత్సమములు* : వీనికి కావ్య ప్రయోగములు మృగ్యము. వ్యవహారాంధ్ర పద ప్రదర్శినియగు బ్రౌణ్యమునుండి ఒకకొన్ని మాటలు.

*1.* హంశ : < అంశ (బ్రౌణ్యము, పు. 1121).

---

36. అరబ్బీనుండి యని బ్రౌణ్యము, పు. 1137.

37. వత్సవాయి రాయగజపతి వర్మగారిచే ప్రకాశితము, రాజమండ్రి. 1934.

38. మతుకుమల్లి నృసింహశాస్త్రి కృతము, చెన్ననగరము ఆదిసరస్వతీ నిలయ వివేకరత్నాకర ముద్రాక్షర శాలలలో వావిళ్ళ రామస్వామి శాస్త్రులచే దుందుభి, శ్రావణము (క్రీ. శ. 1862) న ముద్రితము.

39. మండ చిట్టి కామేశ్వరశాస్త్రి తెలుఁగుసేఁత, వైశాఖపట్టణము గరుడా సుందరరామయ్యగారి స్వకీయ శ్రీ వేణుగోపాల ముద్రాక్షరశాలా ప్రచురితము, 1866.

*2.* హంశము : < **అంశము** (మిశ్ర బ్రౌణ్యము, పు. 128).

*3.* హాశ్చర్యము : < ఆశ్చర్యము (బ్రౌణ్యము, - పు. 1129).

*4.* హీర్ష్య < **ఈర్ష్య** (పైడి. పు. 1131)

II. తద్భవములు : *1.* హక్కసు : పగ. **ఈర్ష్య** < అక్కసము, అక్కసు : **కోపము**

ప్రాకృత. అక్కోస:- కటువచనము, భర్త్సనము.

సంస్కృత, ఆక్రోశ :- ఆక్షేపము, తిట్టు శాపము : అపవాదము. అపదాది 'ఒ' 'అ' గా మాఱుట ధ్వని పరిణామ సూత్ర బద్ధము. తెలుఁగు. సంతసము, సంతోసము, **సంతొసము** < ప్రాకృత. సంతోస - < సంస్కృత. సంతోష - ; తెలుఁగు, అందలము < ప్రాకృత. అందోల- < సంస్కృత అందోల - ఆందోల - 'హక్కసు' హిందీ పదమను పూర్వ పరిశీలకుల నిర్ణయము (మిశ్రబ్రౌణ్యము, పు. 128, శ. ర. (1912), పు. 1123 ; డా. చిలుకూరి, ఆంధ్ర భాషా చరిత్రము, పు. 598, ది. వేం. శివరావు, వ్యవహారకోశము, పు. 268) చింత్యము.

*2.* హారతి : < ఆరతి. 'వరవిప్ర కాంతలు వడితోడవచ్చి - హారతులిచ్చి నారానంద మొదవ' (పల్నాటి. పు. 71). 'నిశాసతి హారతింబట్టు' (రాజశే. విలాస, 1-132). 'హారతి పళ్ళెరంబుల మృగాక్షులు...' (కకు. 4-5), 'నైమిశ పుణ్య వనంబునఁ బొందిన హరికిని మంగళ హారతులెత్తును' (హంస, 4-214).

ప్రాకృత. ఆరత్తియ -

సంస్కృత. ఆరాత్రిక -

'హారతి' ఆరతికి మొదటి రూప'మను శ. ర వ్రాఁత అగ్రాహ్యము 40.

III. దేశ్యములు : *1.* హడలు : బెదరు, భీతి < అడలు : బాధ ; భయము ; శోకము.

*2.* హౌర : < ఔర (బ్రౌణ్యము, పు. 1137).

IV. కన్నడము : హెచ్చరిక : ప్రభువుల యవధానమునకై వేత్రధరులుపయోగించు మాట. 'హెచ్చరికయ్య స్వామి ధరణీశ పరాకు' (కృష్ణలా. 2-110), 'హెచ్చరిక దెలుపు' (తారా శ. 3-26), 'స్వామి పరాకవధారుదేవ హెచ్చరిక' (దశా. 1-234) ; అవధానము, జాగ్రత్త 'తెచ్చు కోలగు హెచ్చరికన్' (శుక. 3-304).

కన్నడ. ఎచ్చఱికె : జాగ్రత్త ; ప్రబోధము ; ఎచ్చరిసు : ఎచ్చఱించు, ప్రబోధించు ; ఎచ్చఱు, కన్నడమున దీని హకారాది రూపములేదు.

హెచ్చు (< క. హెచ్చు. పెచ్చు. పెర్చు), హెచ్చరిక (< క. ఎచ్చఱికె, ఎచ్చఱు)లు ఏకధాతు జన్యములు కావునట స్పష్టము. 'హెచ్చరిక' 'హెచ్చరించు' -లు క్రమముగా 'ఎచ్చరిక.' 'ఎచ్చరించు' -లకు మొదటి రూపము'లను శ. ర. నిర్ణయము ప్రామాదికము. వ్యుత్పత్తిపరముగా శకట రేఫఘటిత మగునది సాధురూపము.

V. అన్యదేశ్యములు: *1.* హంవీరుఁడు శూరుఁడు. '...సమర హంవీరుఁడు...' (తారాశ. 5-72), 'దండ హంవీర తల గుండు గండ...' (శుక. 3-158). 'మంచి హంవీరితాయెతులు...' (హంస. 5-360), 'అచ్చన హంవీరుఁడు' (ఆం. భా. 1-17), 'మన్నె హంవీర పెరమన్నె మదవిభాళ' (రంగా. 1-130), 'మన్నె హంవీరులు' (పద్మనాభ యుద్ధము. 26), '...హంవీరుఁ డితండు నాఁజనుము విష్ణుపురానకు...' (పైడి, 177); 'కౌమార హంవీర మహా పాత్రుని' (ద. హిం. శా. vi. 248; క్రీ. శ. 1515).

మరాఠీ. అమీర్ : ముఖ్యుఁడు; శాసకుఁడు.

పారసి. అమీర్ : కులీనుఁడు; రాష్ట్రాధికారి; శాసకుఁడు; రాజులు మంత్రులకు ప్రసాదించు ఒక బిరుదము; ఆమిర్ : శాసకుఁడు; అమారత్ : అమీర్ పదవి; ప్రభుత్వము; పరిపాలనము.

'హంవీర' -సంస్కృత మను శబ్దరత్నాకరాదుల నిర్ణయము అగ్రాహ్యము.

*2.* హస్తిభారము: పునాది. '...మేరువు లెత్తి హత్తి బలిమిం గడపారల హస్తిభారమున్ - దీరిన జంగరాళ్ళు పడఁదీసి...' (పెదక్గిరి విజయము, పు. 54).

లస్తిభారము, ఆస్థిభారము : అడుగు మట్టు, పునాది. సంస్కృత. 'హస్తిభార-'కు వికృతి యని బ్రౌణ్యము-హస్తిభారము అను ఆరోపమును బ్రౌణ్యమున ఉట్టంకితము41. సంస్కృతమున నిది మృగ్యము.

పారసి. ఉస్తువార్ : దృఢము, స్థిరము, బలిష్ఠము; పరిపూర్ణత; ఉస్తువారీ: బలము; స్థిరము స్థైర్యము; దృఢీకరణము, సమర్థనము.

---

40. బ. సీతారామాచార్యుల వైకృత దీపిక (1900) యందు 'ఆరతి' (పు. 16), 'హారతి' (పు. 116) రెండును ఆరాత్రిక పదభవములుగా నిరూపితము లగుట గమనార్హము.

41. బ్రౌణ్యము ప్రథమ ముద్రణము (1852)న అస్తిభారము, అస్థిభారము (పు. 54) హస్తిభారము, హస్థిభారము, హస్తివారము (పు. 1128) లు సంస్కృత పదములను సూచనలేదు. బ్రౌణ్యము పరిష్కృత ముద్రణమున 'హస్తి' (=ఏనుఁగు) అను ప్రధానారోపము (Main entry) క్రింద ఉపారోపము (Sub entry) గా 'హస్తిభారము' ప్రదర్శిత మగుటను బట్టి చూడఁగా నిది పరిష్కర్తల (మల్లాది వెంకటరత్నము, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారల) దృష్టిలో (చూ., పు. 1393) సంస్కృత మనుట స్పష్టము.

తమిళాది ద్రావిడభాషా నిఘంటువులయం దీ పదము విజాతీయముగా పరిగణితము.

తమిళ. అస్తిపారం, అస్తివారం < ఉర్దూ. ఉస్తువార్ : బునాది (Tamil Lex. p. 200).

కన్నడ. అస్తిభార, అస్తివార : బునాది (కిట్టెల్, పు 132).

*3. హిజారు* : కాలికి తొడిగికొను చట్ట. 'పసరు పట్టు హిజారు మిసమిసలు ఉత క్షామ్మెఱుఁగుటంగికి వింత యొఱపునింప' (శుక. 1-249). 'బంగరు వ్రాఁతల పట్టు హిజారు' (వైది. 2-427). 'సాలవదిండ్లు పావలు హిజారులు కత్తులునే జలాయుధాల్ వేలకొలంది...' (పెదగిరి విజయము, పు. 63). 'పొగడ హిజారు చెంగలువ బొందలము' (హంస. 4-86); 'జఘన దేశముల హిజారులమర' (కువల. 1-86).

పారసి. ఇజార్: మోకాళ్ళదాఁక నరపదు నట్లు లినెన్, మజ్లిన్ గుడ్డతో తయారు చేసిన ముసుగు; ఇజారత్ : లోపావడ; ఇజార్ బంద్ : పంట్లాము, గుడిగి; దేరాగుడారపు టంచు.

'హిజారు,' ఇజారునకు మొదటి రూప మను వ్రాఁత అగ్రాహ్యము.

*4. హిరాకి* : వాహనము, గుఱ్ఱము, ఇరాకీ సీమనుండి కొనితెచ్చిన గుఱ్ఱము. 'రహిగ నటియించు చిలుక హిరాకి నెక్కి-మదన పాదుశహా దండు గదలె నపుడు' అనిరుద్ధ. 3-19).

పారసి. ఈరాక్ : యూఫ్రటిస్ టైగ్రిస్ నదుల మధ్య, సౌఉదీ అరేబియాకు ఉత్తర ముగా, ఇరాన్‌కు పడమరగాఁ గల దేశము; ఈరాకీ : ఇరాక్ దేశమునకు సంబంధించిన.

*5. హిరాణీ* : ఈరానీ జాతీయుఁడు, ఈరానీ దేశ సంబంధి. '...మహా కాలుం డైనను గాలుఁడైన నెదురంగా నో పరిచోఁట మన్నీలంచున్ బలుకంగ నేటికి పఠాణీలన్ హిరాణీ తురాణీలన్ గోటను జిమ్మలేదె మును...' (రంగా. 2-38).

పారసి. ఈరానీ : ఇరాను దేశసంబంధి.

*6. హుజుబెక్* : ఉజ్‌బేక్ (గ్) దేశ సంబంధి; ఉజ్‌బేక్ జాతీయుఁడు. 'హుజు బెక్కొమారునియోజహిజారును బుడమి జారెడు నగల్ దొడిగినాడు' (జగన్నా. 1-90, బ్రౌణ్యము ప్ర. ము. పు 1132 న ఉట్టంకితము). మన సాహిత్యమున ప్రసిద్ధ మగు సామ్రాణిదేశ మిదియే. అర్వాచీన కోశముల నీ యారోపము పరిహృతమగుట చింత్యము.

పారసి. ఉజ్‌బేక్ : అఫ్ఘన్ స్థాన మునకు ఉత్తర దిశను సోవియెట్ రష్యా లోని ఒక రాష్ట్రము; ఉజ్‌బేక్ జాతి.

VI. *ఆంగ్లపదము*: *హింగ్లీజు*: ఇంగ్లీషు. 'ప్రాంసు హింగ్లీజు దినమార్గయొలందా...' (రంగరాట్. పీఠిక, 58).

VII. *ధ్వన్యనుకరణములు*:[42] *1. హా* : ఆశ్చర్యాది సూచకము. 'హాయనుచుం బది నోళ్ళుఁ దెఱచి యఱచెం బెలుచన్' (అరణ్య. 7-136). 'హా తెలిసికొంటిన్' (ఉ. రా. 2-205). 'వైభవముగాంచి హాయంచు వడిఁదపించు' (హంస. 3-205). 'హా య టంచుసుమ శయ్యన్ వ్రాలె' (విజయనందన విలాసము, ద్వితీయా. పు 60).

*హా హా* : 'హా'కు ద్విరుక్తి. 'హాహాధ్వను లెసంగ' (ఆది. 6-86). 'హాహాస్వనము లెసఁగ' (అరణ్య. 1-162). 'హాహారవంబు లెసఁగ' (మౌసల. 145). 'అవ్వీరుండు... హాహాయనుటయు...' (ఉ. హరి. 3-64).

*3. హాహూ* : గుఱ్ఱముల నదల్చుటయం దుపయుక్తము. 'హాహూ యననిల్చు' (సిరి ప్రగడ ధర్మయ కృతమగు నలచరిత్రము. 3-21).

*4. హుమ్ము* : హుంకారము. 'కాగి హుమ్మని యసుర యంగంబు వడఁక' (నృసిం. 4-130). 'హుమ్మని యదలించు నొక్కయింతి' (కాశ. 2-18).

*హుమ్మురు*: చూ. హుమ్ము. 'పరువంపుఁ జిగురాకు బాఁకుఁజేకొని లేచి హుమ్మురంచు నురమ్ముఁ గ్రుమ్మదాన' (కృ. శకుం. 2-227).

*5. హూ* : అపులించుటయందగు ధ్వన్యనుకరణము. 'ఒదిఁగిలి కనువిచ్చి హూయని బిట్టావులించి' (అరణ్య. 7-94).

*6. హూత్* : 'వుడత వుడత హూత్' (చిన్న పిల్లల గేయము).

*7. హూహూ* : చలియందగు ధ్వన్యను కరణము. 'జనులు హూహూ యను చలి వేళఁ గుత్తుకబంటితోయముల లోపల వసించి' (భాగ. 4-648).

*8. హే*: ప్రభువులకు ఎచ్చరికఁ దెలుపు పట్ల వేత్రధరులు వాడునది. 'ఎచ్చరిక పరాకు హేయనుచు వేత్రధరాలి వల్క...' (సిరి ప్రగడ ధర్మయ కృతమగు నల చరిత్రము, 2-84).

*9. హో* : ఆశ్చర్యాది సూచకము. 'అలఘు నిశాత శస్త్రమున నంగములెల్లను నిర్వికారుఁడై యొలువఁ దొడంగె నట్టియెడ హోయని కిన్నర యక్షసిద్ధ సాధ్యులు... పుష్ప వృష్టిఁ గురియించిరి కర్ణుపయిన్...' (అరణ్య. 7-374). 'ఎంత దయగలవాఁడు

(మిగతా 21 వ పేజీలో)

42. ఈ ధ్వన్యనుకరణములు కొన్ని సంస్కృతాది భాషలయందును ఉపయుక్తము. ధ్వన్యనుకరణ శబ్దములు ఏదోయొక భాషకు పరిమితమనుట సత్యదూరము.

# హెచ్చరిక

చిటిప్రోలు కృష్ణమూర్తి

ఛీఁ! ప్రపంచమంతయు
చీనా నిసుమంతయైన సిగ్గిలవౌరా!
ఛీ! నా భారతభువిపై
నా నీ దురహంకరణ దురాక్రమణమ్ముల్?

కల్లోలముల నుర్విఁ గబళింపవచ్చు సా
            గరమందు రతనాలె కాంతుమేము
కారొ్కన్న కల్పాంత కాలాంబుదము నందు
            సొగసైన మెఱపులే చూతుమేము
భయదఘీంకృతులఁ బైఁబడు నేనుగుకుంభంబు
            నందు మౌక్తికములే కందు మేము
హాలాహలజ్వాల లడరించు ఫణిరాజు
            శిరమందు మణినె వీక్షింతుమేము

మంచితనమున కెల్ల జన్మస్థలముగఁ
బరిఢవిల్లిన జాతి మా భరతజాతి
యిట్టి మాపట్ల నకట! నిర్హేతుకముగఁ
గంటగించితి వెంతటి కలుషమతివో!

అనుపమ శాంతికాంతి నిలయంబయి స్నేహ సుధాభిషిక్తమై
తనరి విశాలవిశ్వజనతా పరమాదర గౌరవమ్ములన్
గనుటకుఁ గన్నుగుట్టినది కావలె భారతభూమి నంటితో
దనుజుఁడ! ధర్మదేవతను దాఁకిన పాదము లూడిపోవవో!

ఒరులు శుభమ్ముఁగోరి వెతలోర్చి యెడంద మరందనిర్ఝరుల్
పొరలఁగ నుల్లసిల్లు నొక మూర్ఖత మా కతిమాత్ర మాటచే
ధరణి జనమ్ములెల్లరు నదల్చిన నీ కయి పోరుచున్న వేఁ
దురులకుమాకుఁజక్క నిబదుల్ ఘటియించితి వేమనందురా?

మున్నటిరక్కసుల్ సయితమున్ దమకెగ్గుఁ దలంపఁ
                                        బోక యే
బన్నను వెట్టఁజూడ కొకపట్టున లగ్గొనరించు వారిపై
నెన్నఁడు శాత్రవమ్ము వహియింపరు, నమ్మిన మిత్రునింటికే
కన్నము వేసి రక్కసులు గాంచని కీర్తిఁ గాంచితీవహో!

ఒకనికి నెగ్గుసేయు వెడయూహాలు మాహృద
                                        యాంతరమ్మునం
దొకతఱి నుప్పతిల్ల, వెదియో యపకార మొకండు
                                        సేయుఁగా
క కలుషబుద్ధివైఁ గినుకనంటక యల్లనఁ జెప్పిచూతు, మెం
తకువినకున్నఁ జూపెద మతంద్రత సాంద్రతర ప్రతాపమున్.

పరమశాంత స్వభావుఁడీ భారతీయుఁ
డాహవంబన్న నడలి యేపటు నటంచుఁ
దలఁచితివో! సాదు రేగినఁ దలపొలానఁ
గాని నిలఁడన్న విబుధవాక్యమ్ము వినవో!

తీయతీయని తేటతేనియల్ గురియింప
            ఘోరకాకోలంబుఁ గ్రుమ్మరింప
కమ్మ కమ్మని పిల్లతెమ్మెరల్ వొలయింపఁ
            జటులఝంఝా ప్రభంజనము రేఁప
పొలుపొందు నెత్తావి బొండుమల్లెలు చల్ల
            గాఢానల స్ఫులింగములు చిమ్మ
కటికిరాలును బూచు కలికిపాటలు పాడఁ
            జండప్రచండ గర్జనలు సేయ
వలఁతి హైందవుఁడేమని తలఁచినావో!
యొకట నచ్చంపు నెయ్యంబు నూనువాని

కోకటఁ బోచ్చెంపుఁగయ్యంబు నూనువాని
కోఱపు చూపింపఁ గలఁడంచు నెఱిఁగికొమ్ము !

గుణరత్నాకరమై యెడంద బలునిగ్గుల్ చిందఁ
బెంపొందు ధో
రణిఁ బోనాడి యసంగతప్రచుర చౌర్యక్రౌర్యముల్
మీఱ మా
రణ హోమమ్మున కుద్యమించి తటరా ? రక్షోఽధమా !
ఘోర దా
రుణ దావానలమున్ రగిల్చినసురారుల్ తొల్లి యేమైరిరా?

ప్రారంభమ్మననే జయోదయము సంప్రాప్తించె నం
చుబ్బకో
వీరమ్మన్య ! ప్రపంచ యుద్ధచరితల్ వీక్షించి యోచించినన్
బ్రారంభమ్మున గెల్పు గొన్నయతఁడే యంత్యమ్మునం దోడిని
స్సారుండై గతియించి తీఱుననివిస్పష్టమ్ముగాఁ దోఁచెడిన్.

అరువది కోట్లమంది మొకఁడై రణభూమిని నిల్తుమేని మ
మ్మెవ్వరు లెవరోర్వ నేర్తురని యుద్ధతిఁ జూపితివో యధర్మసం
గరమునఁ గోటికోట్లయినఁ గాని జయించుటకల్ల, క్రీడి యొ
క్కరున కడంగవే పసులకయ్యమునన్ గురురాజు
సైన్యముల్
ఒక్కొక భారతీయుఁడు నొకొక్క మహోగ్రమహేశ
మూర్తియై
చిక్కని ధర్మవీరములు చిందఁగఁ జెండము నూఁది నిల్చినన్
బిక్కబలమ్ముఁజూపి పరువెత్తక నిల్వఁదరంబె ? ధర్మవుల్
దక్కిన దుర్వినీతులు కృతఘ్నత రూపముఁగొన్న
దుర్మతుల్.

అంతకు మించివచ్చి భరతాంబిక గౌరవలక్ష్మి నాశమౌ
నంతటి ముప్పువచ్చి పడెనా ? యపుడింక వచింపనేల ? లో
కాంతము సర్వసిద్ధము సుమా! సముదంచిత సత్యధర్మ సం
క్రాంతికిఁ దావొకింత గనరాని జగమ్మెట నిల్వనేర్చెడిన్ ?

(19 వ పేజీ తరువాయి)

సర్వేశ్వరుండు హోయటంచును విష్ణుతో నుండునంత' (దశా. 1-170).

*10*. హోరు : గాలి, వాన, సముద్రము మొదలగు వాని కదలికకు సంబంధించిన ధ్వన్యనుకరణము. 'కడవ వంచినట్లు హోరని ధారౌఘమైక్యమొంది' (ఆము. 4-91). 'మహాగిరుల్ హోరన' (పైది 6-47). 'ఘన ఘనా ఘన సంఘ మవ్విధమునఁ బూని హోరున బెడిదంపు వాన గురియ' (కళా. 4-88).

మందకు మందను అమ్మగా మిలిగిన మేఁకవంటిది 'హైసరే.' ఇది మెచ్చికోలుమ దెలుపుమాట: 'మందహాసంబుల యంపంబు హైసరే...' (వాల్మీకి. ద్వితీయా పు. 50). 'మైసిరి హైసరే' (తారా. 3-23). 'హైసరే యతని పేరవిన మాత్రముననే కురుదేశ మేల్రాజు గుండె లదరె' (కృష్ణరా. 2-45). 'హైసరే హృదయాపహారమో మౌక్తిక హారమో యెలనాగ యలఁతి నవ్వు' (పైది 4-64). 'హైసరే సరే యటం చనంగ యథార్థము గను' (ఆం. భా. 3-75). 'హై + సరే యని విడదీసి, 'హై,' 'హే' వలె సంబుద్ధి వాచకమన నగునా? ఇంతకును ఇది అనుకల్పవ్యుత్పత్తి. యథార్థవ్యుత్పత్తి యింకను విచార్యము. హైసరుబొజ్జ (ఆం. వాచా, 2835) అను గోదావరి మాండలికము 'హైసరేమజ్జా'కు వికృతి. ★

ప్రజల ఉపయోగంకోసం పనిచేయునది పౌరగ్రంథాలయం. దీనినే సార్వజనీన గ్రంథాలయమనీ, మంది గ్రంథాలయమనీ అంటారు. పౌర గ్రంథాలయం అనగానే మనకు కొన్ని ప్రధాన అంశాలు స్ఫురణకు వస్తాయి.

1. పౌరులందరికి ఉచితంగా ప్రవేశం ఉండాలి.
2. జాతి, మత, కుల, వర్గాల భేదం ఏ మాత్రం పాటించరాదు.
3. గ్రంథాలయ ఆవరణలో చదువుకొనడానికి, ఆరువుగా పుస్తకాలను యిండ్లకు తీసుకుపోవడానికి అవకాశం ఉండాలి.
4. గ్రంథాలయ సేవనిమిత్తం దానిని ఉపయోగించుకొనే చదువరులనుండి యెలాటి రుసుము ప్రత్యక్షముగా వసూలు చేయరాదు.

అయితే గ్రంథాలయ నిర్వహణ యెలా జరుగుతుందనే ప్రసక్తి రావచ్చును. ఈ పని చట్టపరంగా ప్రభుత్వం ద్వారానే జరగడం మంచిది. పన్నులరూపంలో ప్రభుత్వం వసూలుచేసి గ్రంథాలయ సేవను ప్రజలకు అందించాలి. నేడు దాదాపు గ్రంథాలయసేవ ప్రపంచమంతటా యిదే విధానంపై ఆధారపడి జరుగుతుంది.

పౌర గ్రంథాలయం ఒక సాంఘికసంస్థ. బహుళార్థ ప్రయోజనాలుగల సాంఘిక సంస్థ. ప్రజానీకంలో విజ్ఞానాన్ని పెంపొందించి, చైతన్య వంతులుగా చేయడమే యీ సంస్థయొక్క ప్రధాన ఆశయం. ఈ సదాశయ సిద్ధికోసం యీ సంస్థలో పుస్తకాలు, పత్రికలేగాక పటాలు, ఫిల్ములు, పిల్లలఆటల పరికరాలు, గ్రామఫోన్, రేడియో మొదలయిన విజ్ఞానదాయకమైన పరికరాలు ఉంచబడుతున్నవి. వాస్తవానికి నేటి గ్రంథాలయం ఒక మ్యూజియంగా రూపొందుతున్నది.

నేటి ప్రజాస్వామ్యయుగంలో గ్రంథాలయానికి విశేష ప్రాధాన్యత ఉన్నది. ప్రజల అవసరాలను గుర్తించ నవసరం లేని పరాయి పాలనలో ప్రభుత్వ విధానం, కార్యకలాపాలు తెలిసిన ప్రమాదాలకు దారితీయ వచ్చును. కాని ప్రజా శ్రేయస్సే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్న ప్రజాప్రభుత్వాలు తమ కార్యక్రమాలను, విధానాలను ప్రజలకు తెలియపరచినట్లయితే వారు మరింత సహకరించటానికి అవకాశం ఉంటుంది. ఈ పని పౌర గ్రంథాలయం ద్వారా ఎంతో సులువుగా సాధ్యమవుతుంది.

ప్రజాస్వామ్య భావన విజయవంతం కావడానికి ప్రధానంగా ప్రజలు విజ్ఞానవంతులై ఉండాలి. ఇందుకోసం యితర ప్రజాస్వామ్య ప్రభుత్వాల వలె భారత ప్రభుత్వం గూడ పౌరులందరికి ప్రాథమిక విద్యను ఉచితంగా అందజేయడానికి నిశ్చయించింది. ఇది కార్యరూపంధరించి



వెలగా వెంకటప్పయ్య

నేడు పల్లెలలో, పట్నాలలో విద్యాబోధన నిరంతరాయంగా జరుగుతూంది. వీటికి తోడుగా చదువుకోని పెద్దలనిమిత్తం వయోజనవిద్యా పాఠశాలలు నిర్వహింపబడుతూనే ఉన్నవి. ఈ పనులకు అనుబంధంగా క్రొత్తగా అక్షరాశ్యులైన వారికోసం సులభశైలిలో గ్రంథాలను ప్రభుత్వం ప్రచురిస్తున్నది ఇతరులు ప్రచురించేవాటి విషయంలో సహకరిస్తున్నది. కనుక యీ విధంగా విద్యకోసం ప్రభుత్వం కోట్లకొలది రూపాయలు ఖర్చు పెడుతున్నది. ఈ ఖర్చు ముందు ముందు మరింత పెరగటంలో ఆశ్చర్యం లేదు. పాఠశాలలో చదువుకొన్న విద్యను మరింత అభివృద్ధి చేసుకోడానికి గ్రంథాలయం ఎంతో ఉపకరిస్తున్నది. సమగ్రమయిన గ్రంథాలయ వ్యవస్థలేని విద్యావిధానం పైకప్పులేని సౌధంలాగా ఉంటుంది.

సమాజ వికాసానికి పౌరగ్రంథాలయ అవసరం ఎంతో ఉన్నది. విద్య, సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలలో సహకరించడమేగాక గ్రంథాలయం సమాజానికి ఒక సమాచార కేంద్రంగా పనిచేస్తుంది. ఒక తరాన్నుంచి మరొక తరానికి ప్రోదిచేయబడిన విజ్ఞాన సంపదను అందిస్తూ తన విధిని విజయవంతంగా నిర్వహిస్తుంది.

ఈ పనులతో బాటు వ్యక్తిగతంగాగూడ గ్రంథాలయం ఎంతో ఉపకరిస్తుంది. సద్గ్రంథ పఠనంద్వారా తీరిక సమయాన్ని సద్వినియోగ పరుస్తుంది. గ్రంథాలయం ఖర్చులేని సత్కాలక్షేపం. దురలవాట్లకు లోనుకావడానికి వీలులేని ఉత్తమ విజ్ఞానకేంద్రం.

పై విధంగా ప్రజల అభ్యున్నతికి ఉపకరించే గ్రంథాలయాలు మన దేశంలో గురుకుల కాలంనుంచీ లేవు. ఇటీవల 19వ శతాబ్దంలోనే వచ్చినవి. ఉదారవంతులైన కొందరు ఆంగ్లేయులు తొలిసారిగా గత శతాబ్ది ఆరంభంలో బొంబాయి, కలకత్తా, మద్రాస్ నగరాలలో గ్రంథాలయాలు స్థాపించారు. తొలి దినాలలో యీ గ్రంథాలయాలను ఆంగ్లేయులు, వారి ప్రాపకం సంపాదించిన కొందరికి మాత్రం వీటి ఉపయోగం లభించేది. కాని ఆ తర్వాత కొంతకాలానికి అంటే 19వ. శతాబ్దం రెండవ భాగంలో వీటిని అందరూ ఉపయోగించుకొనే అవకాశంకలిగింది. వీటి ఉపయోగాన్ని గమనించి

చిన్న చిన్న నగరాలలోనూ, పల్లెలలోనూ దేశమంతటా గ్రంథాలయాలు స్థాపించటం ప్రజలే ప్రారంభించారు. గత శతాబ్ది అంతానికి దాదాపు అన్ని ప్రాంతాలలోనూ చెదురు మదురుగా పౌర గ్రంథాలయాలు వెలిసినవి. ఆంధ్ర ప్రాంతంలో తొలిసారిగా మంతిన ఆదినారాయణ మూర్తిగారు ప్రాథమిక ఉపాధ్యాయుడుగాపనిజేస్తూ పౌర గ్రంథాలయాన్ని విశాఖపట్నంలో 1886 సంవత్సరంలో స్థాపించారు. ప్రజా సేవయందు ఉత్సాహం, సేవాపరతత్త్వం వారినీ పవిత్ర కార్యానికి పురిగొల్పింది. ఆ తర్వాత 1905 బెంగాలు విభజన ఉద్యమంనాటికి విశాలాంధ్రావనిలో పాతిక గ్రంథాలయాల వరకు వెలసినట్లు తెలుస్తుంది. బెంగాలు విభజన ప్రజలలో చైతన్యం కలుగజేసింది. రాజకీయంగా ఉద్ధృతం కలిగించింది. సుషుప్తావస్థనుండి ప్రజలను మేల్కొల్ప డానికి విజ్ఞానం అవసరమని పలువురు నాయకులు గుర్తించి దేశమంతటా గ్రంథాలయాలు వాడవాడలా గ్రంథాలయాలు స్థాపించటం ప్రారంభించారు. ఈ విధంగా స్థాపించిన గ్రంథాలయాలు ప్రజలను వివేకవంతులను చేస్తూ ఆంధ్ర దేశంలో వెలసిన వివిధ ఉద్యమాలకు చేయూత నిచ్చినవి. ముఖ్యంగా అనిబీసెంటు, బాలగంగాధర తిలక్ సాగించిన హోంరూల్ ఉద్యమం, జాతిపిత మహాత్మాగాంధీజీ స్థాపించి నడపించిన సహాయనిరాకరణలు, సత్యాగ్రహాలు, క్విట్ యిండియా — మొదలయిన మహోద్యమాలకు, ఆంధ్రుల వ్యక్తిత్వానికి, ఆంధ్రుల ఔన్నత్యానికి, ఆంధ్రుల సర్వతోముఖ వికాసానికి తోడ్పడుటకు ఉద్దేశించిన ఆంధ్రోద్యమానికి బహు విధాలుగా తెలుగు దేశంలోని గ్రంథాలయ ఉద్యమం దోహదం చేసింది. తాను బాగుపడి యితరులను బాగుపరచాలనే పవిత్ర దృక్పథాన్ని మన ఉద్యమం నెరవేర్చు కొన్నది.

స్వాతంత్ర్యభానుడుదయించేనాటికి ఆంధ్ర దేశంలో దాదాపు వెయ్యివరకు పౌర గ్రంథాలయాలున్నట్లు తెలుస్తోంది. ఈ గ్రంథాలయాల నిర్వహణను క్రమబద్ధం చేసేందుకు, గ్రంథాలయ ఉద్యమాన్ని మరింత విస్తృత పరచేందుకు అవిభక్త మద్రాసు ప్రభుత్వం 1948 సంవత్సరంలో మద్రాసు పౌర గ్రంథాలయాల చట్టాన్ని రూపొందించి 1950 సంవత్సరము నుండి అమలు పరిచింది. దాదాపు యిదే చట్టాన్ని 1955 సంవత్సరంలో హైదరాబాదు ప్రభుత్వం తయారుచేసింది. ఈ రెండు శాసనాలవలన తెలుగు నాటక గ్రంథాలయ ఉద్యమం కొత్త పుంతలు త్రొక్కింది.

ఆంధ్రుల చిరకాలవాంఛ, నాలుగు దశాబ్దాల అవిరళకృషి ఫలించి ఆంధ్ర ప్రదేశ్ అవతరించింది. తెలుగునాడు ఏకమయింది. ఈ సందర్భంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం పై రెండుశాసనాలను ఏకీకరణచేసి, సమన్వయపరచి, అనుభవరీత్యా యిదివరలో కనుపించిన లోటుపాట్లను సవరించి 1960 సంవత్సరంలో ఆంధ్ర ప్రదేశ్ పౌరగ్రంథాలయాల చట్టమును రూపొందించింది. ఈ చట్టమువలన ఆంధ్రావనిలో గ్రంథాలయ సేవ విస్తృతంగా అభివృద్ధిచెందటానికి అవకాశం కలిగిందనటంలో సందేహంలేదు.

భారతదేశంలో తొలిసారిగా ఏర్పడిన యీ పౌరగ్రంథాలయాల శాఖ పరంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తాను కొన్ని గ్రంథాలయాలను స్థాపించి నిర్వహిస్తున్నది. కొన్ని గ్రంథాలయాల నిర్వహణకు సహకరిస్తూ పరిపరి విధాల గ్రంథాలయ ఉద్యమానికి తోడ్పడుచున్నది.

స్థూలంగా చెప్పాలంటే ఆంధ్రప్రదేశ్‌లో మూడు తరగతుల పౌరగ్రంథాలయాలున్నవి.

1. ప్రభుత్వ గ్రంథాలయాలు.
2. స్థానిక గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు.
3. సహాయక (ఎయిడెడ్) గ్రంథాలయాలు.

పైన వివరించిన యీ మూడు తరగతుల గ్రంథాలయాలను గురించి కొన్ని విషయాలు యిప్పుడు తెలుసుకొందాం.

ప్రభుత్వ గ్రంథాలయాలు: పౌర గ్రంథాలయాలశాఖ నేడు స్వయంగా యీ క్రింది గ్రంథాలయాలను నిర్వహిస్తున్నది.

1. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, హైదరాబాదు.
2. రాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయం, గుంటూరు.
3. రాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయం, తిరుపతి.
4. రాష్ట్ర ప్రాంతీయ గ్రంథాలయం, వరంగల్.
5. బాలల గ్రంథాలయం, హైదరాబాదు.
6. సంచార గ్రంథాలయం, ఏలూరు.

వీటికి తోడుగా హైదరాబాదులో ప్రాచ్య లిఖిత గ్రంథాలయం, విజనగరంలో మరొక ప్రాంతీయ గ్రంథాలయం నెలకొల్పేందుకు ప్రభుత్వం పరిశీలన చేస్తోంది. పై గ్రంథాలయాలను ఆధునిక పద్ధతులపై నిర్వహించడమేగాక గ్రంథాలయ వాఙ్మయ ప్రచురణకు కూడ పూనుకొన్నది. ప్రతి సంవత్సరము తెలుగులో ప్రచురింపబడు వాఙ్మయమును వివరించు "జాతీయ గ్రంథ సూచి — తెలుగు విభాగము"ను 1958, 1959, 1960 సంవత్సరాలలో సంబంధించి యింతవరకు ప్రచురించింది. ఇంతవరకు వెలువడిన పిల్లల పుస్తకాలను "బాలసాహితీ మాల" పేరున వర్ణనాత్మక సూచీని ప్రచురించింది. ఆంధ్రదేశంలో గల ప్రసిద్ధ గ్రంథాలయాల సమీకృతసూచి (యూనియన్

కేటలాగ్) గుంటూరులోని గ్రంథాలయ పరంగా సమీకృత సూచీని తయారు చేస్తున్నది. ఇది బృహత్కార కార్యము ఈ పని పూర్తి అయిననాడు ఆంధ్రదేశంలోని వివిధ గ్రంథాలయాలు పరస్పరము గ్రంథాలను యిచ్చి పుచ్చుకొనే సహకార విధానము పెంపొందటానికి అవకాశం ఉంటుంది. స్వచ్ఛంద సంస్థలు, వ్యాపార సంస్థలు చేయ లేని, చేయజాలని యీ మహత్తర కార్యాన్ని ప్రభుత్వం చేపట్టినందుకు ఎంతో అభినందించాలి. నేడు ఉన్న పళంగా యీ సూచీ విలువను ప్రజలుగాని, గ్రంథాలయ ఉద్యమంలో పనిచేసే పెక్కుమంది కార్యకర్తలు సహితం గుర్తింపకపోవచ్చును. కాని యిది సఫలవంతమై ఉపయోగంలోకి వచ్చినపుడు యీ సత్కార్యానికి ప్రజానీకం ప్రభుత్వ కృషిని అభినందింపక తప్పదు.

స్థానిక గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు : పౌర గ్రంథాలయాల చట్టపరంగా రాష్ట్రమంతటా గ్రామ, పట్టణ, నగర, జిల్లా స్థాయిలో గ్రంథాలయ సేవ చేయుటకు ప్రతి జిల్లాలోనూ స్థానిక గ్రంథాలయ సంస్థ (లోకల్ లైబ్రరీ అథారిటీ) ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ యిరవై జిల్లా కేంద్రముల లోనేగాక, హైదరాబాదు—సికింద్రాబాదు జంట నగరాలకు కలిపి ఒక ప్రత్యేక సంస్థ ఏర్పడింది. వివిధ జిల్లాలలో యీ సంస్థలు యీ క్రింది గ్రంథాలయాలు స్థాపించి, నిర్వహిస్తున్నది.

1. జిల్లా కేంద్ర గ్రంథాలయం.
2. నగర కేంద్ర గ్రంథాలయం.
3. శాఖా గ్రంథాలయం.
4. మహిళా గ్రంథాలయం.
5. బాల గ్రంథాలయం.
6. సంచార గ్రంథాలయం.

ఈ గ్రంథాలయాలన్ని ఆధునిక పద్ధతులపై నిర్వహించుటకు ప్రయత్నాలు జరుగు చున్నవి. పంచాయితీ, పురపాలక, నగర పాలక సంఘము — మొదలయిన స్థానిక సంస్థలు తమ అధికార ప్రాంతములో గల యింటి పన్ను, ఆస్తి పన్నుకు అదనంగా నూటికి నాలుగు నయాపైసలు చొప్పున గ్రంథాలయపు సెస్సు వసూలు చేసి స్థానిక గ్రంథాలయ సంస్థకు జమకడతారు. ఈ విధంగా వసూలయిన సొమ్ముకు సమానమయిన మొత్తాన్ని గ్రాంటు రూపంలో ప్రభుత్వం యిస్తుంది. ఈ విధంగా దాదాపు హెచ్చు జిల్లాలలో లక్షరూపాయలకు పైగా డబ్బు చేకూరుతుంది. దీనినే గ్రంథాలయనిధి (లైబ్రరీ ఫండ్) అంటారు. జిల్లాలో అవసరమగు గ్రంథాలయ సేవకు యీ నిధినుంచి ఖర్చుచేయడం జరుగుతుంది. అయితే తెలంగాణా ప్రాంతం కొంచెం వెనుకబడి ఉన్న కారణం చేత అచట వసూలయిన సొమ్ము గ్రంథాలయ నిర్వహణకు సరిపోదు. అందుచేత ప్రభుత్వం తన గ్రాంటుకు తోడుగా ప్రత్యేకంగా కొంత మొత్తాన్ని వారి అభివృద్ధి కోసం మంజూరు చేస్తున్నది.

ఈ కార్యక్రమాలకు తోడుగా ప్రభుత్వం గ్రంథపాలకులకు గ్రంథాలయ శాస్త్రంలో శిక్షణ యిప్పిస్తున్నది. బాలసాహిత్యం ప్రచురించేందుకు స్థానిక గ్రంథాలయ సంస్థలకు గ్రాంటు యిస్తోంది. పౌరగ్రంథాలయాభివృద్ధికి అన్నివిధాల సహకరిస్తున్నది.

సహాయక (ఎయిడెడ్) గ్రంథాలయాలు : ఈ తరగతికి చెందిన గ్రంథాలయాలు తెలుగు దేశంలో వేల సంఖ్యలో ఉన్నవి. స్థానిక ప్రజల ప్రోత్సాహమువలనే దాదాపు యీ గ్రంథాలయాలుస్థాపించబడుతున్నవి. ఇంతకు ముందు మనం చెప్పుకొన్నంత ఆధునికంగా ఆర్థికలోటువలన యీ గ్రంథాలయాలు నిర్వహింపలేక పోయినా ప్రజలకు ఉపయోగ పడటంలో వెనుకబడి లేవు. వివిధ రకాల సంస్థలు యీ తరగతికి చెందిన పౌరగ్రంథాలయాలను నిర్వహిస్తున్నవి.

1. పంచాయితీలు.
2. పురపాలక సంఘాలు.
3. నగరపాలక సంస్థలు.
4. సహకార సంఘాలు.
5. ధర్మ సంస్థలు.
6. గ్రామ సంఘాలు.
7. స్వచ్ఛంద సంస్థలు - మొదలయినవి.

పై విధంగా వివిధ సంస్థల యాజమాన్యంలో పనిచేసే పౌరగ్రంథాలయాలకు దాదాపు నాలుగు దశాబ్దాలనుంచీ ఏటేటా ప్రభుత్వం కొంత గ్రాంటు యిస్తున్నది. ఈ గ్రాంటు పుస్తకాలు, పత్రికలు కొనడానికి ఉపయోగించబడు తున్నది. అయితే యీ విధంగా యిచ్చే గ్రాంటును క్రమబద్ధం చేసేందుకు సంకల్పించి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల శాఖవారు సహాయక గ్రంథాలయాల నిమిత్తము యిటీవల "గ్రాంటు యిన్ ఎయిడ్ కోడ్" ముసాయిదాను తయారు చేసి ప్రజాభిప్రాయ నిమిత్తం ప్రకటించింది. ఈ కోడ్ త్వరలో అమలులోకి వస్తుంది. అప్పుడు నేటివలె పుస్తకాలు, పత్రికలు మొదలయిన వాటికేగాక భీమాలు, పరికరాలు మొదలయిన వాటికి గూడ గ్రాంటు తెచ్చుకో డానికి అవకాశం ఉన్నది.

ఈ విధంగా ప్రభుత్వం గ్రంథాలయ సేవ అవసరాన్ని గుర్తించి పౌరులందరకు అందజేయడానికి యితోధికంగా కృషి చేస్తుంది. ఈ సేవను మరింతగా ముందు ముందు విస్తృతం చేయగలదని ఆశించుదాం.

# ఆదర్శగ్రామం ఊటుకూరు

కె. నాగభూషణరెడ్డి

కృష్ణా జిల్లాలోని ఒక చిన్న గ్రామం ఊటుకూరు. ఈ గ్రామంలో 2785 మంది వ్యక్తులతో కూడిన 520 కుటుంబాలు నివసిస్తున్నాయి. అనేకవిషయాలలో ఈ గ్రామం ఇతరగ్రామాలకు భిన్నమైనది. ఇది ఒక ఆదర్శప్రాయమైన గ్రామం. ఈ గ్రామంలో ఒక దశాబ్దం క్రిందట వున్న పరిస్థితికంటే ఇప్పుడు ఎంతో మార్పు వచ్చింది ఈ ఘనతఅంతా సమాజాభివృద్ధి కార్యక్రమాలకూ, ప్రజాసీకంపై ఇవి పడవేసిన ప్రభావానికీ దక్కుతుంది. ఈ కార్యక్రమాలు తమ గ్రామాన్ని అభివృద్ధి పరచుకోవడంలోనూ, తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకోవడంలోనూ ఈ గ్రామస్థుల ఉత్సాహాన్ని ద్విగుణీకృతం చేశాయి. దీనికి తోడుగా ఊటుకూరు గ్రామాన్ని "ప్రతి కుటుంబానికీ ఒక ప్రణాళిక" అనే పథకాన్ని అమలు పరిచేందుకు ఎన్నిక చేయడంకూడా జరిగింది. దీనితో ఊటుకూరు గ్రామానికి కృష్ణా జిల్లా పటంలో ఉన్నతస్థానం సంక్రమించింది.

బ్లాకు, తాలూకా కేంద్ర కార్యస్థానమైన తిరువూరుకు ఊటుకూరు 20 మైళ్ళ దూరంలో వుంది. ఈ గ్రామానికి దగ్గరలో వున్న రైలుస్టేషను మధిర. ఇది ఊటుకూరుకు 10 మైళ్ళ దూరంలో వుంది. ఈ గ్రామ పంచాయతీ 1951 మార్చి 31 వ తేదీనుంచి పని చేస్తున్నది. ఇక్కడ ఒక బ్రాంచ్ పోస్టాఫీసు కూడా వుంది.

సమాజాభివృద్ధి కార్యక్రమం ఆరంభించినప్పటినుంచీఊటుకూరు గ్రామస్థులు సమస్త అభివృద్ధి కార్యకలాపాలలోనూ బ్లాకు సిబ్బందితో సహకరిస్తున్నారు. వారు ఒక ప్రాథమిక పాఠశాలా భవనాన్ని నిర్మించారు. సమష్టి చర్చావేదికను కట్టారు. గ్రామీణ రోడ్లు వేశారు. గ్రామస్థుల సహాయ సహకారాలతో ఒక ప్రసూతి కేంద్రాన్ని, గ్రంథాలయాన్ని, సాముదాయిక రేడియోను నెలకొల్పారు. స్త్రీలు, పురుషులకొరకు మనోల్లాస కేంద్రాలను కూడా ప్రారంభించారు కమ్మరిపని నిమిత్తం ఒక సమష్టిసార్వ కేంద్రాన్ని తెరిచారు. గ్రామస్థులు స్వచ్ఛందంగా రెండు పఠనాలయాలను కూడా నిర్మించారు. వీటికి ఒక్కొక్క దానికి రూ. 800/- లు ఖర్చయింది. ఇవన్నీ కూడా తిరువూరులో బ్లాకు ఏర్పడిన పిమ్మటనే జరిగాయి. ఇక్కడి ప్రజల ఉత్సాహాన్ని, కార్యదీక్షనూ, సహకార భావాన్నీ పురస్కరించుకొని "ప్రతి కుటుంబానికీ ఒక ప్రణాళిక" పథకాన్ని అమలు పరచడానికి ఊటుకూరు గ్రామాన్ని ఎన్నికచేశారు. 1958 ఏప్రిల్ నుంచి ఈ పథకాన్ని అమలు పరుస్తున్నారు.

ప్రతి కుటుంబం నిమిత్తం ఒక ప్రణాళికను రూపొందించడం ద్వారా గ్రామీణులలో స్వయంకృషి భావాన్ని కలిగించి ప్రతి కుటుంబ ఆదాయాన్నీ పెంపొందించేందుకు ఈ పథకాన్ని ఉద్దేశించారు. ఉత్తమ జీవనానికై ప్రజల మనోవాంఛలకు కార్యరూపమివ్వడం, వారి కుటుంబ జీవనస్థాయిని వాస్తవంగా పెంచగల మార్గాలలో వారి ఆదాయాన్ని పెంపొందించడమే ప్రతి కుటుంబానికీ ఒక ప్రణాళికను రూపొందించడంలోగల ఉద్దేశం.

ఈ పథకాన్ని అమలు పరచేందుకు అనుభవజ్ఞుడూ, సుశిక్షితుడూ అయిన ఒక గ్రామ సేవకుడిని ఇక్కడ ప్రత్యేకంగా నియమించారు. కుటుంబసభ్యులు, గ్రామపెద్దలు, బ్లాకు విస్తరణాధికార్లతో సంప్రదించి గ్రామంలోని కుటుంబాలన్నిటికీ ప్రణాళికలు రూపొందించారు. ఈ గ్రామంలోని 520 కుటుంబాల వర్గీకరణ ఈ విధంగా వుంది :

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయ దార్లు | ... 194 |
| 2. | వృత్తి పనివారలు | ... 101 |
| 3. | భూవసతిలేని వ్యవసాయ దార్లు, వ్యవసాయేతర కార్మికులు | ... 174 |
| 4. | ఇతరులు | ... 51 |
| | మొత్తం కుటుంబాలు | ... 520 |

ఈ పథకం అమలు ఫలితంగా వివిధ రంగాలలో సాధించిన ప్రగతిని గురించి ఇప్పుడు తెలుసుకుందాం :

## వ్యవసాయం

వరి, చోళ్లు ఈ గ్రామంలో పండించే ప్రధాన ధాన్యాలు. వరి ఎకరానగటు దిగుబడి 8 బస్తాలు, చోళ్ళు ఎకరానగటు దిగుబడి 3 బస్తాలువుండేది. పచ్చి ఎరువులు, రసాయనిక ఎరువులు, మేలురకంవిత్తనాలు వాడటం ద్వారా, సేద్యభూమి విస్తీర్ణాన్ని పెంపొందించడం ద్వారా, నీటివసరుల సౌకర్యాలను పెంపొందించటంద్వారా వ్యవసాయోత్పత్తిని 50 శాతానికి పెంచడానికి పథకాలు రూపొందించారు.

ఈ పథకం అమలు పరచబడడానికి పూర్వం కంపోస్టు పద్ధతిద్వారా ఎరువులు తయారు చేయడంలోనూ, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారక ద్రవ్యాలు

ఉపయోగించడంలోనూ రైతులకు ఆసక్తి లేకుండేదిది. ఈ పథకాన్ని ప్రారంభించిన తరువాత విస్తృతంగా ప్రచారం జరిపిన ఫలితంగా, ప్రత్యేక శిక్షణా శిబిరాలను నిర్వహించిన ఫలితంగా గ్రామంలోని ఎరువుకు ఉపయోగపడే పదార్థాలను జాగ్రత్త పరచడంలోనూ, రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక ద్రవ్యాలు ఉపయోగించడంలోనూ రైతులు చాలా ఆసక్తి చూపుతున్నారు. వ్యవసాయశాఖ, సహకార సంఘాల ద్వారా వీటిని రైతులకు సరఫరా చేశారు.

ఈ పథకాన్ని అమలుపరిచిన కాలంలో 280 ఎకరాల విస్తీర్ణాన్ని సేద్యయోగ్యం చేశారు. 90 ఎకరాల బంజరు భూములను సేద్యం చేశారు. ఈ మొత్తం విస్తీర్ణంలో మేలురకం విత్తనాలు వేశారు. రైతులు 12 పంపుసెట్లు నెలకొల్పి 36 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించారు. దీనివల్ల వారికి రెండుపైర్లు పండించడానికి సాధ్యపడింది. పచ్చి ఎరువుల పెంపకాన్ని ప్రవేశపెట్టారు. 195 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కలుగజేశారు. 109 టన్నుల రసాయనిక ఎరువులు సరఫరా చేశారు. 1710 ఎకరాల విస్తీర్ణంలో ఈ ఎరువులు వాడారు. ఎరువుల నిమిత్తం రూ. 4460 ల మేరకు ఋణాలు ఇచ్చారు. భూములను సేద్య యోగ్యం చేసేందుకు కూడా రూ. 44570 వరకుఋణాలు పంపిణీచేశారు. ఈచర్యలన్నింటి ఫలితంగా వరిఎకరాసగటు దిగుబడి 8 బస్తాలనుంచి 11 బస్తాలకు, చోళ్ల ఎకరా సగటు దిగుబడి 3 బస్తాల నుంచి 4 బస్తాలకు పెరిగింది. ఈ పథకం అమలు జరిగిన కాలంలో వరి, మిరప, కూరగాయలు మొదలైన పంటలలో రూ. 140000 ల మేరకు అధికోత్పత్తిని సాధించారు.

## పశు పోషణ

ఊటుకూరులో పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రాన్ని ప్రారంభించారు. స్థానిక పశు జాతులను అభివృద్ధి పరిచేనిమిత్తం ఒక ముర్రా కోడెను, ఒంగోలు కోడెను సరఫరా చేశారు. సగం ఖర్చు భరించే పద్ధతిపై 6 నెల్లూరు పొట్టేళ్ళను, 90 ఆర్. ఐ. ఆర్. పుంజులను, 1216 మేలురకం గ్రుడ్లను, 2 మేలుజాతి పందులను సరఫరా చేశారు. ఆర్.ఐ.ఆర్. పుంజులను సరఫరా చేయడం ద్వారా స్థానిక కోళ్ళజాతిని పెంపొందించారు. రెండవ మూడవ సంతతిజాతి పెట్టలు సంవత్సరానికి దాదాపు 150 గ్రుడ్లు పెడుతున్నాయి. ఒంగోలు, ముర్రాజాతి కోడెల వినియోగం వల్ల గ్రామస్థులు దిగువ పేర్కొన్న విధంగా రూ. 25275 ల మేరకు ఆర్థిక ప్రయోజనం పొందారు :-

| | ఒంగోలు | | ముర్రా | |
|---|---|---|---|---|
| | కోడెలు | పెయ్యలు | కోడెలు | పెయ్యలు |
| జాతి దూడలు | 87 | 47 | 63 | 79 |
| ఒక్కొక్క దూడకు లభించే అదనపు ధర రు. | 200 | 50 | 25 | 50 |
| మొత్తంధర రు. | 17400 | 2350 | 1575 | 3950 |

వీటివల్ల రూ. 25275 ల మేరకు ఆర్థిక ప్రయోజనం చేకూరింది.

## విద్య

ఈ పథకం అమలు జరపడానికి పూర్వం గ్రామంలో 3 ఎలిమెంటరీ పాఠశాలలు ఉన్నాయి. 335 మంది బాలబాలికలు వీటిలో చదువుతున్నారు. ఈ పథకం ప్రకారం గడువుకాలంలో పాఠశాలకు వెళ్ళే వయసుగల 790 మంది బాలబాలికలకు పాఠశాలలో ప్రవేశం కల్పించాల్సి ఉంది. అందువల్ల అదనంగా 455 మంది బాలబాలికలను చేర్చుకోవాల్సి ఉంటుంది. యీ లక్ష్యాన్ని సాధించడానికి హరిజనవాడలో ప్రత్యేకంగా ఒక ఏకోపాధ్యాయ పాఠశాలను ప్రారంభించారు. తల్లి దండ్రుల, ఉపాధ్యాయుల సంఘాన్ని ఏర్పాటుచేసి తీవ్రంగా ప్రచారంచేయడం జరుగుతున్నది. దీని ఫలితంగా లోగా ఉన్న 335 మంది విద్యార్థులకుతోడు అదనంగా 413 మంది బాలబాలికలను పాఠశాలలో చేర్చుకోవడం జరిగింది.

రెండు మధ్యాహ్న భోజన కేంద్రాలను ప్రారంభించారు. ప్రతి పాఠశాలకు రు. 50-00 విలువచేసే బాలసాహిత్యాన్ని, గ్రామీణ గ్రంథాలయానికి రు. 40-00 విలువ చేసే పుస్తకాలను సరఫరా చేయడం జరిగింది. 4 బాలసభ గ్రంథాలయాలను నెలకొల్పారు. ఈ కాలంలో అన్ని పాఠశాలలను బేసిక్ పాఠశాలలుగా మార్చడం జరిగింది. పాఠశాలలో పెరటితోటల పెంపకాన్ని ప్రోత్సహించడానికై తోట పనిముట్లను పాఠశాలలకు సరఫరా చేశారు.

## సాంఘిక విద్య

ఈ గ్రామంలో మంచి నాటక సమాజం ఉంది. మొత్తం రు. 170/- ల ఖర్చుతో బుర్రకథ పరికరాలు, నాటక సరంజామాను యీ సమాజానికి సరఫరా చేశారు. ఈ కాలంలో నాటకబృందం 15 నాటకాలను ప్రదర్శించింది. ఇక్కడ యువజన క్లబ్ కూడా ఉంది. పాఠశాలలో బాలబాలికలను చేర్చడంలోనూ, పాఠశాలల బాలబాలికల కొరకు మధ్యాహ్న భోజన కేంద్రాలను నిర్వహించడంలోనూ, శ్రమదానంద్వారా రోడ్డు నిర్మించడంలోనూ, ఆధునిక వ్యవసాయపద్ధతులను ప్రచారం చేయడంలోనూ యీ యువజనక్లబ్ సభ్యులు ఉత్సాహంతో పాల్గొన్నారు. యీ క్లబ్ ఆధ్వర్యాన

వయోజన విద్యా కేంద్రం నిర్వహించబడుతున్నది.

గ్రామంలోని మహిళామండలి బాగా పనిచేస్తున్నది. గ్రామంలో కుట్టుమిషన్ కేంద్రం కూడా ఉంది. ఈ కేంద్రం ఉపాధ్యాయిని వేతనం సగం ఖర్చును పంచాయతీ భరిస్తున్నది. సగం విరాళం ప్రాతిపదికపై సభ్యురాండ్రకు కుట్టుపని వస్తువులను సరఫరా చేయడం జరిగింది.

## ఆరోగ్యం - పారిశుధ్యం

మూడు మంచినీటి బావులనూ, 4 పబ్లిక్ పాయిఖానాలనూ, 520 ఎరువు గుంటలను నిర్మించడం జరిగింది. 245 పొగలేని పొయిలను నిర్మించారు.

*సహకారం:—* ఈ పథకం అమలు కాలంలో క్షీనదశలో ఉన్న సహకార పరపతి సంఘాన్ని పునః ప్రారంభించబడింది. ఈ పథకం అమలుకుపూర్వం గ్రామస్థులు ప్రైవేటు వ్యక్తులనుంచి అధిక వడ్డీలకు మొత్తం రు. 2026800/—ల(వ్యక్తి కుటుంబ ప్రణాళికలను అనుసరించి) మేరకు రుణం తీసుకునేవారు. యీ పథకం అమలుకు పూర్వం యీ పరపతి సంఘం నుంచి దాదాపు రు 16000/ల మేరకు మాత్రమే రుణాలు జారీ చేశారు. ఇతర సంస్థల ద్వారా దాదాపు లక్షరూపాయల మేరకు రుణాలు లభించాయి. ఇప్పుడు యీ పరపతి సంఘం 6½ శాతం వడ్డీపై లక్ష రూపాయల మేరకు రుణాలు మంజూరు చేస్తున్నది.

ఈ సహకారసంఘం, రసాయనిక ఎరువులు, మందులు, మేలురకంవిత్తనాలు మొదలైనవాటిని సరఫరా చేస్తుంది. 1959-61 వ సంవత్సరాలకాలంలో రు 20000 విలువ చేసే రసాయనికఎరువులు, మందులూ రు. 7600 ల విలువ జేసే మేలురకం విత్తనాలనూ ఈ సంఘం సరఫరా చేసింది. ఈ సంఘం ఇద్దరుసభ్యులకు రెండు ఎలక్ట్రిక్ మోటారు పంపులను సరఫరా చేసింది.

49 మంది సభ్యులతో సహకార పాల సరఫరా సంఘాన్ని నెలకొల్పారు. పాడి పశువుల కొనుగోలుకై 38 మంది సభ్యులకు రు 5600 లను అడ్వాన్సుగా ఇవ్వడం జరిగింది. బెస్తల సహకార సంఘం, వడ్రంగం, కమ్మరి సహకార కుటీరపరిశ్రమ సంఘం, కుటీర పరిశ్రమ సంఘం మొదలైన వాటిని నిర్వహించడం జరుగుతున్నది.

## పొదుపు ఉద్యమం

367 కుటుంబాలకు హుండీ డబ్బాలు, 153 కుటుంబాలకు సేవింగ్ కార్డులను సరఫరా చేయడం జరిగింది. రు 8247/—ల విలువచేసే జాతీయపొదుపు సర్టిఫికెట్లను విక్రయించడం జరిగింది. సహకార పరపతి సంఘంలో సేవింగ్స్ అకౌంటును ప్రవేశపెట్టారు. 41 సేవింగ్స్ అకౌంట్లను ప్రారంభించారు. 1960-61 వ సంవత్సరంలో సేవింగ్స్ డిపాజిటు పద్దుక్రింద రు 8898లు అందాయి.

## గిడ్డంగులు, మార్కెటింగ్ సౌకర్యాలు

రు 20000 అంచనా ఖర్చుతో ఒక గోదామును నిర్మించారు. దీనివల్ల గరిష్ఠధరలు లభించేవరకు రైతులు తమ ఉత్పత్తులను యీ గిడ్డంగిలో భద్రపరచుకునే సౌకర్యం లభించడమే గాక అవసరమైన సమయంలో ఋణాలుకూడా లభిస్తాయి.

520 కుటుంబాలలో 515 కుటుంబాలు సహకార పరిధిలోకి తేబడ్డాయి సహకార రంగంలో వివిధ పథకాలను అమలుచేసిన ఫలితంగా వ్యవసాయదారుల ఆర్థిక పరిస్థితి మెరుగుపడింది. మేలురకం విత్తనాలు, రసాయనిక ఎరువులు, మొదలైన వాటి పంపిణీల వల్ల రైతులు ఎక్కువపంట తీయగలుగు తున్నారు.

## పరిశ్రమలు

గ్రామంలో 31 మంది వృత్తిపని వారలకు రు. 3620ల మేరకు ఋణాలు ఇవ్వడం జరిగింది

## హరిజన సంక్షేమం

హరిజనుల నివాసానికై 13 ఇండ్లుగల ఒక కాలనీని మంజూరు చేశారు. హరిజన కాలనీలో మంచినీటిబావి, చిన్న పంతెన, కమ్యూనిటీహాలు నిర్మించ బడ్డాయి.

## గృహనిర్మాణ పథకం

29 క్రొత్త గృహాలను నిర్మించడానికి, 29 గృహాలను పునర్నిర్మించడానికీ ఋణంగా రు. 66000ల మొత్తాన్ని మంజూరు చేశారు.

ఊటుకూరు ఇప్పుడు స్వయం పోషకమైన గ్రామం. బియ్యం మొదలు కూరగాయలు, పాలు మొదలు గ్రుడ్లు యీ గ్రామంలో ఉత్పత్తి చేయడం జరుగుతున్నది. ఇప్పుడు రైతులు ఋణాలకై ప్రైవేటు వ్యక్తుల వద్దకు వెళ్ళాల్సిన అవసరంలేదు. సహకార పరపతి సంఘంవారి అవసరాలను తీరుస్తుంది పాలు, గ్రుడ్లకోసం వారు దగ్గరిలోని మార్కెటుకు వెళ్లాల్సిన పనిలేదు. వారికి అన్నిరకాల కూరగాయలు, స్వచ్ఛమైన పాలు, మంచి గ్రుడ్లు వారి గ్రామంలోనే లభిస్తాయి. దగ్గరి మార్కెటులో పాలు, గ్రుడ్లు, కూరగాయలు విక్రయించి వారు అదనపు రాబడి పొందవచ్చు. వారికి మంచి పాడి పశువులు ఉన్నాయి. వారివద్దఉన్న స్థానిక జాతికోళ్ళ స్థానంలో మంచిరకం కోళ్ళను సరఫరా చేయడం జరిగింది. అవి ఎక్కువ గ్రుడ్లను ఇస్తాయి. వారి గ్రామంలో ఉన్న పశువుల ప్రథమచికిత్స కేంద్రం వారి పశువుల సంక్షేమాన్ని చూస్తుంది. వారి పిల్లలందరు పాఠశాలకు వెళ్తున్నారు.

1958-59 వ సం॥లో రాష్ట్రం మొత్తంలో ఊటుకూరు ఉత్తమ గ్రామంగా ఎన్నికైంది రు. 1000/-ల బహుమతి లభించింది. 1959-60 వ సం॥లో యీగ్రామం జిల్లాలో ఉత్తమ గ్రామంగా సెలెక్టు అయింది.

1960-61 వ సం॥ లో తిరువూరు బ్లాకులో ఉత్తమ గ్రామంగా ఎన్నికై వరుసగా రు 250/- లు, రు. 1000/- ల బహుమతి పొందింది.








వడ్లమూడి గోపాలకృష్ణయ్య

(అరుణి పాట పాడుతుంది)

స్వార్థమా ? పరపీడనమా ?
మారణహోమమా ? దారుణమా ?
మనిషె మనుషుల మ్రింగు
దనుజ మనుజులతోటి
లోక కంటకమైన
చీకటిలో...బ్రతుకే ॥స్వార్థ॥

ప్రగతి శీలము విరిచి
జగతిసౌఖ్యము చెరిచి
శాంతి భావము కలచి
వంత మనుగడ మలచు ॥స్వార్థ॥

ధ్యాన బుద్ధుని కరుణ
జ్ఞానబుద్ధుని చరణ
క్రాంతి బోధల తెరువు
శాంత్య హింసలు కరువ ? ॥స్వార్థ॥

**కృష్ణకుమార్ :** అరుణా ! ఏమి టింతగా అంతులేని ఆలోచనలతో ఆవేదన పడతా వెందుకు ?

........

**కృష్ణ :** ఇక్కడ పుల్లతీసి అక్కడ పెట్టకుండా కాలుమీద కాలు వేసుకు కూర్చుంటే హాయిగా గడిచిపోతుంది. ఇట్లా ఎందుకు చేశావనికానీ, ఇదెందుకు చెయ్యలేదనిగాని అడిగే వారు లేరు.

**అరుణి :** అవును మరి—నేను కాదన్నానా? హాయిగా జీవించడానికి ఏ అడ్డంకిలేదు.

**కృ :** అప్పుడప్పుడు ఏదో నిర్వేదం ఆవరించిన మూర్తిలా కనపడతా వెందుకు అరుణీ !

**అ :** ఈ ప్రపంచంలో మంచికి స్థానంలేదు. అన్యాయానికి, ద్రోహానికి, వంచనకి లాభిస్తున్న గౌరవం మరిదేనికీ లభించడంలేదు.

**కృ :** పొరపాటు అరుణీ ! నువ్వన్నట్లు అన్యాయానికి, ద్రోహానికి, వంచనకి తాత్కాలికగా బలమున్నట్లు కనబడుతుందంతే. వాస్తవానికి ఆ బలం పేక మేడలాగా కూలిపోవడానికీ, దూది పింజల్లా ఎగిరిపోవడానికి ఎంతసేపు పడుతుందంటావు అరుణీ !

**అ :** ఏమిటో కృష్ణా ! సహకార వ్యవసాయ క్షేత్రమంటూ పెట్టారు. ఆకుకూ పోకకూ అందకుండా వుండే వాళ్ళల్లో ఐకమత్యంవచ్చిందిగదా అని సంతోషిస్తుంటే వాళ్ళల్లో వచ్చిన అభిప్రాయ భేదాన్ని సర్దబోయి

మొన్న దెబ్బలుతిని తలచిట్లించుకొచ్చావు. ఇవాళేమో....!

కృ : ఇందుకేనా ఇంత నిర్వేదం. హు.... పిచ్చిదానా. దానివల్ల మన గౌరవానికేం లోపం వచ్చింది ? వాళ్ళలో వాళ్ళే ఆలోచించుకుని చేసిన తప్పు తెల్సుకుని పశ్చాత్తాపడి, వాళ్ళకై వాళ్ళేవచ్చి క్షమార్పణ కోరుకున్నారుగా....

అ : అంతమాత్రంచేత ఏమయింది? ఇల్లలగ్గానే పండగవుతుందా? పోనీ యీ వాళేం జరిగింది చెప్పండి? స్వచ్ఛంద సేవా దళాలు — గ్రామ సేవ సంఘాలు ఎందుకు చెప్పండి. ఎవరెట్లా పోతే మనకేం? కృష్ణా రామా అంటూ హాయిగా కూర్చునేదానికి.

కృ : అన్నీ తెల్సినదానివి నువ్వే ఇట్లా మాట్లాడితే ఎలా అరుణీ! నిజంగా చెప్పు — నువ్విప్పుడన్న మాటలన్నీ అరుణోదయకాలంలో స్వచ్ఛమై, శుభ్రమై — సాయంసంధ్యా కాలంలో ప్రశాంతమై గంభీరమైన నీహృదయం నుంచే వస్తున్నాయంటావా ? అరుణీ!

అ : అబ్బ! నీ హృదయం ఎంత కరుణామయమైంది. నీ బుద్ధి ఎంత నిశితమైంది కృష్ణా!

కృ : అదికాదు అరుణీ! అటు సహకార వ్యవసాయ క్షేత్రాన్ని నెలకొల్పడానికీ ఇటు సంఘసేవ, దేశ సేవ చెయ్యడానికీ అన్నిటికీ నన్ను పురికొల్పినదానివేమో నువ్వేనాయె — తీరా ఆచరణపూర్వకంగా రంగంలోకి దిగిన తర్వాత —

అ : ఇతరులకు మేలుచెయ్యడం — దేశ సేవ చెయ్యడం—మన స్వాతంత్ర్యాన్ని మనం రక్షించుకోవడం నేనేమీ పొరపాటనలేదే— సేవ పేరుతో మనం కష్టనష్టాలు పాలుకావడమే —

కృ : అవును అరుణీ! — ఎటువంటి జీవితంలోనైనా వెలుగు చీకట్లు తప్పవు. అసలు సుఖ దుఃఖాలు పడుగుపేకల్లా పెనవేసుకుంటేనే జీవిత మవుతుంది అరుణీ! చేదురుచి తగిల్తేనే తీపి తియ్యదనం....

అ : నీ సిద్ధాంతాలనూ తర్కవితర్కాలనూ నేను వినలేను. ఇవాళ నా మనస్సేమీ బాగాలేదు కృష్ణా!

కృ : మధ్యాహ్నం నేను వచ్చినప్పటినుంచీ చూస్తూన్నాను. ఏదో పరధ్యానంగా, ఆందోళనగా — బెంగగా ఉన్నట్లు కనిపిస్తున్నావు. నీ మనసులో ఏముందో చెప్పవా అరుణీ! మీవాళ్ళ మీదేమైనా గాలిమళ్ళిందా! అరుణీ చెప్పవూ?

అ : గాలీలేదు ధూళీలేదు. ఈవేళ పొద్దున్నుంచీ నా మనస్సు ఏదో వికలమై పోయినట్లు-ఎడారిలా అయిపోయింది. ఎప్పుడూ లేదు. 'శాంతి' ఇంతకుముందుదాకా నా దగ్గరే ఉంది. తక్కిన హంసలన్నీ దానికోసం చూచి చూచి ఇక్కడిక్కడే తిరుగాడాయి.

కృ శాంతిరాణి కేమైనా తెలియకుండా లోపల జబ్బుచేసిందేమో !

అ : ఉన్నట్లుండి హఠాత్తుగా భయం భయంగా అరిచిందీ మధ్యాహ్నం. తక్కిన హంసలన్నీ బిత్తరపోయి చూచాయి. గంటతర్వాత నువ్వేమో నుదుటిమీద దెబ్బతో వచ్చావు.

కృ : నా దెబ్బకేం వచ్చిందిగాని హంసలన్నీ ఎక్కడున్నాయి ?

అ : అరగంటకిందటే ఇటుఅటు తిరగడానికి వెళ్ళినట్లున్నాయి.

కృ : 'శాంతి' రాణి కూడా వెళ్ళిందా

అ : వెళ్ళింది. నా ఒళ్ళోనే ఉంచుకుని చేత్తో కొంచెంసేపు ఆప్యాయతతో నిమిరితే ఏదో సంతృప్తిపడినట్లుంది. మెల్లిగా వాటిల్లో కలిసిపోయి వెళ్ళింది.

కృ : ఉదాసంగతి. ఇందాకటి నుంచీ చెప్పవేం. నీచేతి మహత్యమున్నమాట.

అ : అవునుగాని ఇంతకీ వాళ్ళేమంటారు? మంచితనానికి పోతే మందుతో పని పడినట్లే అయ్యిందే.

కృ : ఏమంటారు ? ఎవరికి వాళ్ళుగా స్వంతలాభాలు దృష్టిలో ఇంతవరకూ జీవించారాయే. సంఘందృష్టితో — దేశం క్షేమందృష్టితో విశాలహృదయంతో త్యాగపూరితంగా వ్యవహరించాలని వాళ్ళకిప్పుడిప్పుడే మిడిమిడిగా అర్థమవు తున్నది.

శ్రవణం : (హడావుడిగా ప్రవేశిస్తూ) అరుణమ్మా అరుణమ్మా! కృష్ణా!! మన శాంతిరాణిని ఎవరో బాణంపెట్టి కొట్టారు. దెబ్బతిని వళ్ళంతా నెత్తురై కార్ కార్ మని అరుస్తూ ఎగిరివచ్చి దొడ్డివైపున సంపెంగ చెట్టుదగ్గర పడిపోయింది.

అరుణీ, కృష్ణ } : (ఒక్కసారిగా ఇద్దరూ ఉద్వేగంతో) ఆఁ........ ఆఁ........ మన శాంతిని బాణంతో కొట్టారా ?

కృ : ఎవరు కొట్టారు శ్రవణం ? ఎవరు కొట్టారు ?

అ : ఏది ? ఎక్కడుంది శాంతి? అతిథిగతీ- అవన్నీ ఎక్కడున్నాయి ? వాటిని కూడా కొట్టలేదుగదా !

శ్ర : ఏమో ఎట్లా తెలుస్తుంది ? ఎవరు కొట్టారో! ముందర శాంతి గాయానికి మందెయ్యాలి.

కృ : రా అరుణీ! - త్వరగా రా - మందులుపెట్టి, దూది, తెల్లగుడ్డ కావాలి. గబగబా తెప్పించు. నేను సంపెంగ చెట్టుదగ్గరుంటాను. వెళ్ళు శ్రవణం, నువు అరుణితో వెళ్ళు. త్వరగా తేవాలి.

(ఇద్దరు ముగ్గురు పరుగెత్తిన చప్పుడు)

కృ : హారి దుర్మార్గుడా! నవనీతంలాంటి రాజహంస యీ 'శాంతి'ని ఇంత క్రూరంగా ఇనుపనారాచంతో కొట్ట డానికి నీకు చేతులెట్లా వచ్చాయి. భగవంతుడు నిన్నెట్లా శిక్షిస్తాడు? అబ్బ! ఎంతరక్తం కారుతోంది? అరుణీ! అరుణీ! శ్రవణం! త్వరగా రండి. త్వరగా ఆ మందులపెట్టె తెండి.

శ్ర : వచ్చేశాను కృష్ణా! అరుణమ్మ తెల్ల పంచె తేసోయింది ముందు మందు వెయ్యి ఇదిగో దూదికట్ట.

కృ : వెళ్ళు - నువ్వెళ్ళు - ఇక్కడ నే చూచుకుంటాగాని ఆగ్లాస్కోపంచి పట్టా వెంటనే. వెళ్ళు పరుగెత్తు.

శ్ర : బంగారుపడకు కృష్ణా! అదిగో అరుణమ్మే తెస్తోంది - రండమ్మా త్వరగారండి. అయ్యయ్యయ్యో ఎంతరక్తం కారిపోయింది!

అ : శాంతీ శాంతీ ఎవరుకృష్ణా ఇంతదారుణంగా కొట్టింది? ప్రాణాపాయమేమీ లేదుగా -

శ్ర : బంగారుపడకమ్మా నీశాంతి చచ్చి పోదులే. పిచ్చితల్లీ ఎందుకమ్మా ఏడుస్తావ్. కళ్ళనీళ్ళు పెట్టకు -

కృ : ఇదుగో ఎందుకట్లా కళ్ళనీళ్ళు పెడతావు అరుణీ! ఏమీ ఫర్వాలేదు. శాంతి బ్రతుకుతుంది. చూడు. దీని పీలికచింపు. కట్టుకట్టాలి.

అ : ప్రొద్దున్నుంచీ ఇంత ఇదిగా ఉంది ఇందుకే కాబోలు కృష్ణా నా మనస్సంతా ...

కృ : అవును అరుణీ! ఇవాళ ఇటువంటి దుర్ఘటన జరగాల్సి ఉంది కాబట్టే నీ మనస్సంతా వ్యాకులమయమై పోయింది. పోనీలే మరేచెడూ జరక్కుండా ఇంతటితోనే సరిపోయింది. మన శాంతి మనకు దక్కింది. ఇదేపదివేలు. శ్రవణం! అరెరె అరె.... కొంచెం దీన్ని పట్టుకో అరుణీ! మొహం మీద నీళ్ళు కొడతాను.

శ్ర : నేకొట్టనా కృష్ణా!

కృ : ఈ శాంతి సంగతి మేం చూచుకుంటాంగాని తక్కిన హంసలన్నీ ఎక్కడున్నాయో చూడిరా, వెళ్లు - త్వరగా వెళ్ళు శ్రవణం!

అ : దీన్ని కొట్టడంచూచి అవన్నీ బెదరి ఏపొదరిళ్ళల్లోనో దూరి బిక్కుబిక్కుమంటూ ఉంటాయి. వెళ్ళి త్వరగా తోలుకురా. దుర్మార్గులు - దీన్ని కొట్టడంతోనే సరిపెట్టార నేమిటి? ఎన్నిటిని కొట్టారో ఏమో ....

కృ : తొందరగా వెళ్ళు శ్రవణం -

శ్ర : ఇదిగో ఇప్పుడే పోతున్నా - అన్నింటిని తోలుకొస్తాను. మరేమీ బంగారుపడకు అరుణమ్మగారు దొరకాలే గాని అసలు ఆకొట్టిన సన్నాసెవడో వాణ్ణికూడా మెడలు విరిచి లాక్కొస్తాను

కృ : సరే ఇక నువ్వువెళ్లు శ్రవణం - అరుణీ! నేను శాంతిని ఇంట్లోకి తీసుకెళ్తాను. బాగా చలేస్తున్నట్లున్నది. ఒణికిపోతోంది. నువ్వు మందులుపెట్టె, దూది అన్నీ పట్టా.

అ : తీసుకుపద త్వరగా - లోపల పెట్టె మీద కాశ్మీర్ శాలువా ఉంది. అది చుట్టువెచ్చగాఉంటుంది. జగన్నాథ్‌ను పిల్చి తానురతూడుబు లాక్కురమ్మని చెప్తాను. మళ్ళీ రాత్రికి కావాల్సొస్తే ఇబ్బందనకుండా -

కృ : త్వరగా రా అరుణీ! నువ్వు దగ్గర ఉండకపోతే శాంతి మరీ ఇదవుతుంది.

[విరామం]

శ్రవణం : అబ్బబ్బ తిరిగి తిరిగి దుంపతెగిపోతుంది. ఎక్కడా చీమ చిటుక్కుమన్నా చప్పుడైనా వినపడ్డం లేదే — ఈ హంసలన్నీ బెదిరి ఎంతదూరం పారిపోయాయే యేమో -

మంచు మలల ఉత్తరాన ఎత్తుచరియల్లో
పొంచుండిరి వంచకులు లేలేలే లిల్లేలే ॥మం॥
పాలనురుగు మీగడల మేలి బ్రతుకులో
కాలకూట విషం చిలుకు కాళనాగులు ॥మం॥
రక్కసి మూకలకు చిక్కి...
రాజహంస 'శాంతి' రాణి
తెలి వెన్నెల వెలికాంతులు
సంజరీతి కంజాయలు
గా — మారెను గాయాలై ॥మం॥
విరికన్నెల చిరుగుజ్జెల
పరువంతో మురిపెంతో
విహరించే హంసలార
బెదరకండి చెదరకండి
రండమ్మా! హంసలార! రండమ్మా!
రండి రండి రండమ్మా ॥మం॥
ఎక్కడ? మీ ఉనికెక్కడ?
అతిజగతీ...ట...గతి సుగతీ
ఎక్కడ మీ ఉనికెక్కడ?
అక్కడనా? ఇక్కడనా?
రండమ్మా! రండమ్మా! హంసలార!
రండి రండి రండమ్మా!
త్వర త్వరగా రండమ్మా! ॥మం॥

శ్రవణం : ఓసి మీ కుంపతెగ. చడీచప్పుడూ లేకుండా కుక్కిన పేనుల్లా ఇక్కడే

ఉన్నారా ? ఎవరో కాదులే సుగతీ మెల్లిగా తలబైటికెట్టి చూస్తున్నావ్ - రా ఇటు రా నేనే శ్రవణాన్ని — (హంసను చేతిలోకి తీసుకున్న చప్పుడు) అరె ఇంతా అయితే నువ్వు ఒక్కదానివే ఉన్నావా ? ఏం భయం లేదు - నే నున్నానుగా-భయపడకు- అరుణమ్మ దగ్గరకు తీసుకుపోతాలే. యేదీ జగతీ ఎక్కడికి పోయినిద్యో ఏమో (హంస సంతోషంతో నాలుగైదు సార్లు అరుస్తుంది. హంస లన్నీ నాలుగు వైపుల్నుంచీ సంతో షంతో ఎగిరివచ్చిన చప్పుడవుతుంది) ఆఁ ఆఁ వచ్చేశారు సంతోషం - చాలా సంతోషం-అరె ఏదీ పద్మేదీ - పద్మా? (రెండు మూడు హంసల కూతలు వినిపిస్తాయి. ఒక హంస పరుగెత్తుకుని వచ్చిన చప్పుడు) ఆఁ ఇదిగో వస్తోంది. ఇంతదగ్గర్లో ఉండేనా ఇంతసేపూ రాకుండా దాక్కున్నావ్, ఏం ? ఎందుకట్లా బిక్కు బిక్కుమంటూ ఒక దాని మొహం ఒకటి చూచుకుంటారు? శాంతిరాణి లేదనా ? ఇంట్లో ఉంది పదండి. అరుణమ్మ ఒళ్లో హాయిగా ఉంది. పదండి పోదాం.

(రెండు గొంతుకలు)

(1. ఇస్తావా లేదా ? 2 ఇవ్వను ఎందు కివ్వాలి ? 1. వాటి నిక్కడ వదలి పెడతావా లేదా ? 2. ఎందుకు వదలి పెట్టాలి ? నీ తాతగారి సొమ్మే మైనా దాచావా? - మా శాంతిరాణిని అన్యాయంగా కొట్టి...అంటూ రెండు గొంతులు కొన్ని మాటలు సన్నగా ప్రారంభమై క్రమంగా బిగ్గరగా విన బడతాయి.)

శ్రవణం : కృష్ణకుమార్ ! అరుణమ్మా ! ఒరేయ్ జగన్నాథం ! రండి రండి తొందరగా రండి వీడెవడో మతిమంతు డంట. మన శాంతిరాణిని కొట్టాడే వాడే వీడు - హంస లన్నిటినీ ఇమ్మని బెదిరిస్తున్నాడు. లేకపోతే నన్నే చంపుతా నంటున్నాడు. త్వరగా రండి. కృష్ణా ! రావాలి త్వరగా -

(ఇద్దరు ముగ్గురు పరుగెత్తుకొచ్చిన చప్పుడు)

కృష్ణ: ఏయ్ ఎవరు నువ్వు? నీ కిక్కడేం పని ?

మతిమంతుడు : నేనా మతిమంతుణ్ణి -

శ్రవణం : ఎవరో మతిమంతుటండ, ఏం మతిమంతుడో ఆ మొహం చూడు ! ఎట్లా ఉందో చూడ్డానికే ఇదిగా.

మతి : ఏయ్ ! వాడు వీడు అనబాకు జాగ్రత్త -

శ్రవణం : ఏం అంటే ఏంచేస్తా వేమిటి ? అన్యాయంగా మా శాంతిరాణిని గాయపరచింది కాక పైగా మాట్లాడు తున్నావ్ !

మతి : అన్యాయం-గిన్యాయం అనబాకు- నాకు హక్కువుంది నేను కొట్టాను. మర్యాదగా ఆ హంసను తెచ్చివ్వండి ఎక్కడుందో.

కృష్ణ :: తొందరపడి అతిగా మాట్లాడు తున్నారు. మీ రెవ్వ రసలు ?

మతి : నా పేరు మతిమంతుడు — మేం ఆ కొండకవతల ఉంటాం -

శ్రవణం : హూ - మతిమంతుడంట మతి మంతుడు ! జీడిగింజల పొగేస్తే బొబ్బ లెక్కినట్లున్న మొహం వీడూను.

అరుణి : అవును ! మతిమంతుల్లాగా నే ఉన్నాడు-దుర్మతిమంతుడు.

మతి : ఆ ఏమిటన్నావు ? మళ్ళీ అను దుర్మతిమంతుడా ?

అరుణి : అవును. కాక

కృష్ణ : మా అరుణి అన్నమాట అక్షరాలా నిజం. హంసలేమీ ఒకరికి అపకారం చేసే విష జంతువులు కావే. ఎంతటి విషహృదయమైనా ఎటువంటి విషాద పరిస్థితుల్లో నైనా — ప్రశాంత ఆకా రంతో శరత్కాల మేఘంలాగా తెల్లగా స్వచ్ఛంగా ఉండే హంసల్ని చూస్తే శాంతిభావం కలుగుతుంది. హాయిగా ఉంటుంది. అనిర్వచనీయ మైనఆహ్లాదం కలుగుతుంది. అటువంటి హంసల్ని ఆ కర్కశమైన బాణంతో కొట్టాలన్న కోర్కె మీ కెట్లా పుట్టింది? మీ హృదయం ఎంతపాషాణం!

మ : యేయ్ పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. ముందు ఆ హంసను తెచ్చియిస్తావా ? యివ్వు. లేదా వాటిట్లో ఒకటో రెండో యివ్వు. శాంతిరాణో గింతి రాణోమాకు తెలియదు. మే కొట్టాం- ఆ హంస మాది -

శ్ర : ఏయ్ జాగ్రత్తగా మాట్లాడు.

జగన్నాధ్ : అవును. మా కృష్ణకుమార్ ఎంత మర్యాదగా మాట్లాడారు. మీరెట్లా మాట్లాడుతున్నారు. కొంచెం మర్యాదగా మాట్లాడండి. లేకపోతే -

మ : లేకపోతే—ఏం చేస్తావేంటి ? మర్యా దంట మర్యాద.

అ : అవును. మతితోపాటు మర్యాద కూడా లేనట్లే ఉంది. ఈ అమ్మాయి లెవరో అడుగు కృష్ణా ! ఇందాకటి నుంచి చూస్తున్నాను. అదేపనిగా నీవంక చూస్తున్నారు.

జ : మీ ప్రవర్తన బాగుండ్లేదమ్మా.

కృ : వారిద్దరూ ఎవరు ?

సురస : (మెల్లిగా తనలో) అబ్బ ! రూపా నికి తగ్గట్లు కంఠస్వరం ఎంత గంభీ రంగా హుందాతనంగా ఉంది.

**పింగళ :** (మెల్లిగా తనలో) మమ్మల్ని ఇక్కడ కొన్నిరోజులు ఉంచుకున్నా బాగుండును.

**మ :** నా భార్యలు - యీామె సురస - యీామె పింగళ -

**శ్ర :** బాగానే ఉన్నాయి పేర్లు - బుద్ధులకు తగ్గట్లుగానే ఉన్నాయి - మా పురాణాల్లో ఉన్నారులెండి వీళ్ళిద్దరూ -

**మ :** పురాణాలు గిరాణాలు మాదగ్గర పనికిరావు.

**శ్ర :** అవునవును మీకు పనికిరానివే లే యీ పురాణాలు. ఒకత్తేమో ఉన్న భర్తనున్నవాణ్ణున్నట్లుగానే ఉంచి రాత్రికి రాత్రే స్వేచ్ఛావిహారం చేసేది. దానిపేరే పింగళ. ఇంకో టేమో రాక్షసమాయల్తో టక్కుల్తో నీతివంతుడూ మహా శక్తివంతుడూ ఐన ప్రాణవాయువులాంటి వాయుపుత్రుణ్ణే స్వాహాచెయ్యాలనుకుంది. ఎన్ని ఉపాయాలు చూచినా అన్ని అపాయాలూ తలపెట్టింది. ఎంత శక్తివంతుడుగా పెరిగినా అంతకంత దుష్ట శక్తిగా ప్రపంచాన్నే మింగివేద్దామన్నంత భయంకర రూపం దాల్చి నాలుకలు చాపింది. ఐనా నీతివంతమైన శాంతి శక్తులు జయించనూ జయించారు. అశాంతికరమైన హింసామయమైన దాని జీవితం చివరికి ముక్కలు చెక్కలు అయ్యింది. అదే సురస.

**అ :** బాగా గుర్తుచేశావ్ శ్రవణం - కృష్ణా ! మనం అవతలకి పోదాంరా. వాళ్ళ చూపులు చూస్తూంటేనే అసహ్యాం వేస్తోంది.

**మ :** ఎక్కడికి వెళ్తాడు ? ముందు నే కొట్టిన రాజహంసను తెచ్చి ఇక్కడ పెట్టనన్నా పెట్టాలి, లేకపోతే ఇంకో హంసనన్నా ఇవ్వాలి. ఇచ్చిగాని ఇవతల అడుగుతీసి అవతల పెట్టడానికి వీల్లేదు.

**కృ :** ఆఁ ఏమిటి ? ఆటకాటకి మీ ధోరణి మితిమీరి పోతోందే ! మేం పెంచుకుంటున్న మా హంసనుకొట్టి శాంతి జీవితాన్ని ప్రశాంతమైన మా మనసుల్ని అశాంతిమయం చేసిందికాక పైగా - మా శాంతి మీద మీ కేదో హక్కున్నట్లు మాట్లాడుతున్నారే -

**శ్ర:** వీడబ్బగాడి సొమ్ముం దిక్కడ - హక్కుట హక్కు -

*(అయిదారుగురు ప్రవేశించిన చప్పుడు)*

**మిత్రుడు :** ఏమిటి కృష్ణకుమార్ గారూ : ఏమిటీ గొడవ ?

**కృ :** అరె ! ఏమిటి వీళ్ళందర్నీ తీసుకుని మీరే వచ్చారు మిత్రుడుగారూ !

**శ్ర :** మన హంసలు విహారంకోసం అటు కొండకోనలు దాకా వెళ్ళాయి మిత్రుడుగారూ! ఈయన ఆ కొండల కవతల పక్కనుంటూడంట. అవతల నుంచి ఇవతలకి హద్దుమీరి మన భూమిలో ప్రవేశించింది కాకుండా మన రాజహంసలేదూ 'శాంతి' రాణి- బాణంతో దాని ప్రాణాలు తీద్దామనుకొని కొట్టిందికాకుండా "ఆ హంస నాదే, దాకమీద నాకు హక్కుంది, నా కిస్తారా చస్తారా" అని బెదిరిస్తున్నాడు.

**మి :** శాంతి చనిపోయిందా ! ఎక్కడుంది.

**అ :** లేదు. బాగా గాయమయ్యింది. మందువేసి కట్టుకట్టాం. ఇంట్లోఉంది.

**కృ :** వీళ్ళకొక నీతినియమం ఉన్నట్లు కనపడదు మిత్రా.

**మ :** నీతిలేదు నియమంలేదు. ముందు నా కా హంస నివ్వండి.

**మి :** మా హంసను కొట్టింది కాకుండా పైగా హంసనే ఇమ్మంటున్నావే.

**మ :** మీ హంస అని దానిమొహాన ఎక్కడైనా వ్రాసి పెట్టుందా ?

**నాగేశ్ :** ఏయ్ మతిమంతా ! జాగ్రత్తగా మాట్లాడు. కృష్ణకుమార్ అంటే మిత్రుడంటే ఎవరనుకుంటున్నావ్. వీ రిద్దరూ నిప్పులాంటి మనుషులు. నిప్పుకైనా చెదలు పడుతుందేమోగాని వీరి నీతినిజాయితీలకు, న్యాయానికి, శాంతి ధర్మపరతత్వానికి చలనంలేదు. ఎంత దుష్ట రాక్షస పైచాచికతత్వం కలవాళ్ళైనా యీ అహింసా మూర్తులముందు మోకరిల్ల వలసిందే -

**మ :** ఊఁ ఉ. అహింస-ధర్మం - నీతి - న్యాయం - ఓహోహో ఏం ధర్మపన్నాలు. ఇవి మాముందా ? హంస మీదైతే కాపచ్చు - దాన్ని నాకు స్వాధీనం చేస్తారా చెయ్యరా?

**నాగేశ్ :** ఇటువంటి వాళ్ళదగ్గర నీతి, న్యాయం, ధర్మం. పనిచెయ్యవు కృష్ణకుమార్ ! గరళం ముందు పూ తేనే పనిచేస్తుందా? వెంకటేశం! రామ్మూర్తి! ఒరేయ్ రంగా! రండిరా వీణ్ణి ఆ ఆడవాళ్ళిద్దర్ని చెట్లకట్టెయ్యండి.

**మ :** ఏయ్ ! ఎవరు నువ్వు చేతులు పట్టుకుంటావ్ ! అరె విల్లులాగబాకు మాట దక్కదు.

**జగన్నాథ్ :** నీ దుర్మార్గానికి ఊరూ వాడా ఏకమై ఊస్తున్నది. ఊఁ. మళ్ళీ మాట్లాడకు. నో రెత్తావా ?

**పింగళ / సురస :** అయ్యో ! అయ్యో !! ఎంత అన్యాయం -

**అరుణ :** ఇదిగో వెంకటేశూ! రామ్మూర్తీ! ఆడవాళ్ళ నేమీ చెయ్యకండి. వాళ్ళ దుర్బుద్ధులు అగ్నిశిఖలై వాళ్ళనే దహిస్తాయి. ఎంతదుష్టులనైనా స్త్రీలను మగవాళ్ళు చెయ్యి చేసుకోవడం మన పవిత్రభారత ధర్మానికి విరుద్ధం. వాళ్ళిద్దర్నీ వదిలెయ్యండి.

**వెంక :** వదిలెయ్యరా రామ్మూర్తీ! బ్రతికి పోయారు చల్లనితల్లి అరుణమ్మగారు చెప్పింది. ఆమె మాట తోసెయ్య కూడదు.

**కృష్ణ :** జగన్నాధం అతని భార్యలు చూస్తూ వుండగానే వాళ్ళ వాళ్ళెదటే అతన్ని చేతులువిరిచి చెట్టుకు కట్టేశారు. చాలు. ఏ మాత్రం మానవత్వమున్నవాడికైనా యీ మాత్రం అవమానంచాలు. జీవిత కాలం క్రుంగదీయడానికి—అతన్ని కొట్టకండి — హింసించడం మన పని కాదు. అన్యాయంగా శాంతిని హింసించినందుకుభగవంతుడేఅతన్నిశిక్షిస్తాడు.

**మిత్రుడు :** అవును. జగన్నాధం! నిజం చెప్పారు. కృష్ణకుమార్! అతని మొహం చూడు ఎంత అవమానంతో కుంచించుకు పోతోందో!

**శ్రవణం :** ఐనా పళ్ళుకొరుకు తున్నాడు కృష్ణా! సిగ్గు లేకపోతే సరి. వీళ్ళను నమ్మడమే ప్రమాదం.

**పింగళి :** అరుణమ్మా! నీ పాదాలకు నమస్కారం పెడతాం. మీ హంసను కొట్టడం మా వారిదే తప్పే.

**సురస :** ఆయన్ని వదలి పెట్టించండి. మా దారిని మేం వెళ్తాం.

**పింగళి :** మాకు పతిభిక్ష పెట్టండి. ఇప్పటికింతమంది ముందు జరిగిన అవమానం చాలు.

**శ్ర :** పతిభిక్షట పతిభిక్ష — యెన్ని టక్కులు. మా కృష్ణకుమార్ వంక చూచిన మీవిషపు చూపులు యెవరిభిక్షో — నీతుంటేగా —

**సు :** అమ్మా! అరుణమ్మా! మా ప్రార్థన వినవమ్మా!! మా భర్తను విడిచి పెట్టించావా మళ్ళీ మీ హంసలజోలికి రాము. యీ ప్రాంతాలకే రాము.

**అ :** కృష్ణా! మిత్రుడుగారూ! అతణ్ణి విడిచి పెట్టండి. జరిగిన అవమానం చాలు వాళ్ళ జీవితానికి.

**కృ :** కట్లు విప్పండి. శ్రవణం! జగన్నాధం! విప్పి మళ్ళీ యీ ప్రాంతాలకి రాకుండా పొమ్మనండి.

**మ :** క్షమించండి కృష్ణకుమార్! కృతజ్ఞతలు అరుణమ్మగారూ! మీ ఉదాత్త విశాల హృదయంతో మా కళ్ళు తెరిపించారు. తల్లీ! యికమళ్ళీయెప్పుడూ యిటువంటి పనిచెయ్యను.

**మి :** ఇప్పటికైనా జ్ఞానోదయమైనందుకు సంతోషం —

**కృ :** అతని ధనస్సు బాణాలు అతని కిచ్చెయ్యండి. శ్రవణం! మీ ఆయుధాలు మీరు తీసికొని వెళ్ళిపోండి. అసలుప్రాణి హింసే అన్యాయమైంది. నోరు లేని యిటువంటి జీవాలను హింసించడం మరీ అన్యాయం — మానవత్వం ఉన్న మనకూ క్రూర మృగాలకూ తేడా యేముంది?

**మ :** మీరు నా కళ్ళు తెరిపించారు కృష్ణకుమార్! నాకా బాణాలు వద్దు ఏమీవద్దు. కాదు కాదు కావాలి — యిటు తీసుకురండి శ్రవణంగారూ! (ధనుర్బాణాలు తీసుకుని విరుస్తున్న చప్పుడు)

**శ్ర :** అరరె. విరుస్తున్నాడే —

**మ :** అవును. వీటితో ప్రయోజన మేముంది? ఒక ప్రాణిని హింసించడానికేగా ఉపయోగపడేది. యికముందు నేను ఏ ప్రాణినీ హింసించను. అరుణమ్మా కృష్ణ కుమార్‌లు నాకు జ్ఞానభిక్ష పెట్టారు. మిమ్మల్నెప్పటికీ మరిచిపోము. వెళ్ళొస్తాం. అరుణమ్మా!

**కృ :** ఎంత పరిణామం. ఎంత చీకట్లో యెంత వెలుగు? జరిగిం దేదో జరిగింది. చీకటి పడబోతోంది. ఈ పూట కిక్కడే వుండండి. భోం చేసి పడుకుని ప్రొద్దున్నే వెళ్ళిపోదురుగాని —

**మతి :** ఆఁ మీదెంత అమృత హృదయం — అవునుగాని —

**కృ :** మిత్రా! అనుకోకుండా సమయానికి మీరంతా వచ్చారే ఎందుకు వీళ్ళందర్నీ తీసుకు వచ్చారు? రామ్మూర్తిని కూడా తీసుకొచ్చారే.

**రామ్మూర్తి :** నన్ను క్షమించండి కృష్ణకుమార్ గారూ. ఆవేశంలో తప్పు చేశాను.

**మిత్ర :** అవును వాళ్లల్లో వాళ్లు స్వలాభాపేక్షతో పోట్లాడుకుంటే మధ్యలోసర్దబోయినందుకుఆవేశంలోనిన్ను నుదిటి మీదకొట్టానని రామ్మూర్తిక్షమార్పణ కోరడానికిన్నూడా మొహం చెల్లక వాళ్ళందర్నీ తీసుకుని నాదగ్గరకొచ్చారు. నీదగ్గరకు తీసుకెళ్ళి తనచేత క్షమార్పణ చెప్పించమని వచ్చాడు. నువ్వు చెప్పినట్లుగానే ధాన్యమూ, డబ్బూ పంచుకున్నారు.

**కృ :** దీనికి క్షమార్పణెందుకు? ఇర్వాతైనా తన తప్పు తను తెల్సుకుంటాడని నేను ముందే అనుకున్నాను అందరూ కలిసిమెలిసి హాయిగా ఒక మాటమీద జీవించడమే గదా మనకావలసింది.

**అ :** మిత్రన్నా! నాగేశ్! మీరంతా యీ పూట యిక్కడే వుండండి. వంట లవుతున్నాయ్. భోం చేసి సరదాగా కాసేపు మాట్లాడుకున్నాక వెళ్లొచ్చు.

**మిత్ర :** భోజనానికేముందిలే అమ్మా! అందరం పూళ్ళో వాళ్ళమేగా.

**శ్రవ :** ఈ భోజనం మీ కోసం కాదు

మిత్రుడుగారూ! రామ్మూర్తి కోసం.

జగ : అయ్యగార్ని కొట్టినందుకు భోజనమా.

శ్రవ : కాదు కాదు. కొట్టి తప్పు తెలుసుకున్నందుకు -

అ: సరే కట్టిపెట్టు ప్రసంగం!

(అని అంటూవుండగా అందరూ నవ్వుతారు)

[బృందగానం]

కొంపగోడులు కాల్చి
గుడ్డ గుడుసులు వ్రేల్చి
నిలువెల్ల కాల్చినా
ఆరిపోతుందిరా అగ్గి
మరి మండబోదురా బుగ్గి –
కొంప గోడులె కాదు
గుడ్డ గుడుసులె కాదు
తను మానములు వ్రేల్చి
బ్రతుకునే కాల్చినా
ఆఆగార బోదురా ద్వేషం
మితిమీరు తుందిరా ద్వేషం
పగబట్టి తెగబడి
పాము కరచిందంటె
మనిషి బ్రతుకేమైన
మందులేమైనా
నాల్గుకాట్లతో నాగు
తలనెండు తుందిరా విషము
మరి నిండబోదురా విషము –
పంచలను పొంచుండి
మంచినే వంచించి
కోటి పడగల నెత్తి
కోట్ల కోరల నొత్తి
తిండి పడగొట్టినా
బ్రతుకు నెడబెట్టినా
నిత్య జన్మెత్తురా కుటిలం
నిలు వెల్ల నిండురా కుటిలం –
కుటిల విషమును పిండి
ద్వేషాగ్నులను ఆర్పి
శాంతి సుఖముల బరపి
సౌభాగ్యములు నెరపి
సర్వజన సంఘాన
సంక్షేమములు నింప
ప్రగతితో వెలుగురా జగతి
సుగతితో వెలుగురా జగతి.

(ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంవారి సౌజన్యంతో)

---

## అడవులు

రాష్ట్ర రంగంలో 1963–64వ సంవత్సరానికి "అడవులు" అభివృద్ధి పద్దుక్రింద రు 20.97 లక్షలు, "భూసార సంరక్షణ" క్రింద రు 5.00లక్షల, మొత్తాన్ని ప్రణాళికా పథకంలో కేటాయించారు. ప్రస్తుతసంవత్సరంలో గిరిజన సంక్షేమ పథకాన్ని చేపట్టి రు 3.50లక్షల ఖర్చుతో కాఫీతోటలపెంపకం పనిని అటవీశాఖ అమలు జరుపుతున్నది.

1963–64వ సంవత్సరంలో కేంద్రం నిర్వహించే రెండు పథకాలు అమలుచేయబడుతున్నాయి. (1) రు 4.19లక్షల ఖర్చుతో త్వరగా ఎదిగేరకం మొక్కల పెంపకం. (2) రు 15.54 లక్షల ఖర్చుతో మాచిఖండ్ బేసిన్‌లో నీరు, భూసార సంరక్షణ పథకాన్ని అమలుచేయడం.

ఈ విధంగా 1963–64 వసంవత్సరంలో అటవీశాఖ మొత్తం 19 పథకాలను అమలు చేస్తున్నది. పథకాల పట్టిక, 1963వ సంవత్సరం ఆఖరువరకు అమలు జరిగిన పని వివరాలను దిగువ ఇవ్వడం జరిగింది.

### అడవులు

(1) జూలాజికల్ గార్డెన్ నిర్మాణం ... పని అభివృద్ధి దశలో ఉంది.

(2) రాజమండ్రిలో సమీకృత రంపపు కోతమిల్లు సంరక్షణ ప్లాంటు కలప పని షాపు నిర్మాణం ... పని అభివృద్ధిదశలో ఉంది.

(3) నిర్వహణ ప్రణాళిక తయారీ... పని అభివృద్ధి దశలోఉంది.

(4) టేకు పెంపకం ... పని అభివృద్ధి దశలో ఉంది.

(5) యూకలిప్టస్ ... 517 ఎకరాలలో మొక్కలపెంపకం జరిగింది.

(6) సర్వీ వృక్షాలు ... 572 ఎకరాలలో (సర్వుడు) మొక్కలను పెంచారు.

(7) అగ్గిపెట్టెల కలప... 80 ఎకరాలలో మొక్కలపెంపకం జరిగింది.

(8) రక్తచందనం... 115 ఎకరాలలో మొక్కలు వేశారు.

(9) అటవీ క్షేత్రం ... 75 ఎకరాలలో మొక్కలు వేశారు.

(10) రాకపోకలు (రోడ్లు)... పనులు అభివృద్ధిదశలో ఉన్నాయి.

(11) అటవీ పరిశోధన... పనులుఅభివృద్ధి దశలోఉన్నాయి.

(12) పునర్నిర్మాణం... అభివృద్ధిదశలో ఉంది.

(13) చెట్లకు గుర్తులు పెట్టడం... అభివృద్ధి దశలో ఉంది.

(14) భూసార సంరక్షణ పరిశోధన కేంద్రం శహీబ్‌నగర్... పనులుఅభివృద్ధి దశలోఉన్నాయి.

(15) త్వరితగతినిఎదిగే రకం మొక్కల పరిశోధన... పనులు అభివృద్ధి దశలో ఉన్నాయి

(16) మెరక కోత భూములనిర్మూలన...4970ఎకరాలలో మొక్కల పెంపకంజరిగింది.

(17) కాఫీ మొక్కల పెంపకం... 100 ఎకరాలలో పెంపకం జరిగింది

(18) త్వరగా ఎదిగే రకం మొక్కల... 1500 ఎకరాలు. పెంపకం

(19) మాచిఖండ్ క్యాచ్ మెంటు ప్రాంతంలో 10శాతం వంపులో భూసారసంరక్షణ... 1317 ఎకరాలు.

### మార్కెటింగ్

పెంపకందార్లు అతోధిక ఉత్పత్తులను సాధించడాన్ని ప్రోత్సహించడానికి వీలుగా వారి ఉత్పత్తుల నుండి ఎక్కువ ఆదాయంరాబట్టడానికి అన్ని హంగులుకల మార్కెటునునెలకొల్పడం ఎంతో అవసరం. ఇటువంటి మార్కెటు సౌకర్యం కల్పించడానికి ముందు ఉత్పత్తుల గ్రేడింగ్, ప్రమాణీకరణ ముఖ్యం. దీనివల్ల ఏ ప్రమాణంలో ఎంత మొత్తాన్ని ఉత్పత్తి చేయాలనే విషయాన్ని ఉత్పత్తిదారులు తెలుసుకోవడమే కాక వారికి సరిఅయిన ధర లభించగలదనే హామీకూడా ఉంటుంది.

ఈ ఉద్దేశంతోనే రాష్ట్రంలో 3గ్రేడింగ్ యూనిట్లు, 3 రెగులేట్ చేయబడిన మార్కెట్లు, 1 నెయ్యి ప్రమాణీకరణ లెబొరెటరీని ప్రభుత్వం ప్రారంభించింది. గ్రేడింగ్‌వల్ల కల్గే లాభాలనుగూర్చి మార్కెటింగ్ సిబ్బంది విస్తృత ప్రచారం చేస్తున్నది.

1964 జనవరిలో రాష్ట్రంలో 'అగ్‌మార్కు' క్రింద వర్గీకరించబడిన వ్యవ

సాయ ఉత్పత్తులు మొదలైనవాటివివరాలను దిగువ ఇవ్వడం జరిగింది:—

| | క్వింటాలు. |
|---|---|
| బియ్యం.................. | 623.25 |
| నెయ్యి.................. | 2428.68 |
| నువ్వులనూనె............ | 191 27 |
| గ్రుడ్లు............... | సంఖ్య 280. |

## జైళ్ళు

కేంద్రం వాటాతో సహా దిగువతెల్పిన అంశాలకు సంబంధించిన ప్రణాళికా పథకాలకై 1963—64 సంవత్సరంలో జరిగిన కేటాయింపుల వివరాలు:—

(1) బాలల జూనియర్ సర్టిఫయిడ్ పాఠశాల, ఆంధ్రప్రాంతం (ఏలూరు)... రు 2.02 లక్షలు.

(2) బాలల సీనియర్ సర్టిఫయిడ్ పాఠశాల. తెలంగాణా ప్రాంతం. హైద్రాబాదు ... రు 2.06లక్షలు.

1964—65 సంవత్సరంలో ప్రణాళికా పథకాలకై దిగువ కేటాయింపులు జరిగాయి. (కేంద్రం వాటాతో సహా).

(1) బాలల జూనియర్ సర్టిఫయిడ్ పాఠశాల. ఆంధ్ర ప్రాంతం... రు 2.40 (ఏలురు) లక్షలు.

(2) బాలల సీనియర్ సర్టిఫయిడ్ పాఠశాల తెలంగాణా ప్రాంతం... రు 2.24 హైద్రాబాదు లక్షలు.

(3) విశాఖపట్నంలోని బాల నేరస్థుల పాఠశాల విస్తరణ... రు 0 10 లక్షలు

(4) జైళ్ళలో సంక్షేమాధి కారుల నియామకం... రు 0.26 లక్షలు

వీటికి తోడు అనంతపురం జిల్లాలో ఖైదీలకై క్రొత్తవ్యవసాయ కాలనీని ప్రారంభించే ప్రతిపాదనకూడా ప్రభుత్వ పరిశీలనలో ఉంది.

రాష్ట్రంలోని 4 సెంట్రల్ జైళ్ళలో అంబర్ చర్ఖా శిక్షణ పథకాలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. సికింద్రాబాదు, మహబూబు నగర్‌లలోనిజిల్లా జైళ్ళలో దంపుడుబియ్యం పరిశ్రమను ప్రవేశ పెట్టడానికి కూడా నిశ్చయించారు. కొన్నాళ్ళ తర్వాత యీ పథకాన్ని ఇతర జైళ్ళలో కూడా అమలు చేస్తారు. ప్రథమంలో సికింద్రాబాదులోని జిల్లా జైలులోని ఖైదీలకు దంపుడు బియ్యం వాడాలనికూడా ఉత్తరువులు జారీ చేయడం జరిగింది. యీ పరిశ్రమ విస్తరణ జరిగిన తర్వాతనూ, సికింద్రాబాదు జైలులో యీ వాడకం ఫలితాలు తెలిసిన తర్వాతనూ దంపుడుబియ్యం వాడకాన్ని ఇతరజైళ్ళకు విస్తరింప చేసే విషయాన్ని పరిశీలించడం జరుగుతుంది.

## పాల ఫ్యాక్టరీ

రాష్ట్ర మూడవ ప్రణాళికా పథకాలలో సమీకృత పాల ప్రాజెక్టు పథకాన్నిచేర్చడం జరిగింది. దీనికై రు 175 లక్షలు కేటాయించారు. విజయవాడలో పాల ఫ్యాక్టరీని నెలకొల్పడం ద్వారా కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఇతోధికంగా లభించే పాల వనరులను వినియోగంలోకి తేవడానికీ, అదనంగా లభించే పాలను హైదరాబాదులోని ప్రధాన పాల క్షేత్రానికి తరలించడానికీ యీ పథకం నిర్దేశించబడింది. యీ ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తిఅయిన తర్వాత ప్రథమ దశలో సంవత్సరానికి 5.47 కోట్ల లీటర్ల (54700 టన్నులు) పాలను సరఫరా చేస్తుంది. రెండవ దశలో యీ మొత్తాన్ని సంవత్సరానికి 14.78 కోట్ల లీటర్లకు (1,4,7,800 టన్నులు) పెంచడం జరుగుతుంది. రు 30.00 లక్షలు విలువచేసే నెయ్యి, పాలపొడి, మొదలైన పాలతోతయారయ్యే పదార్థాలను యీఫ్యాక్టరీలో ఉత్పత్తి చేయడం జరుగుతుంది. ఈ పథకంవల్ల విజయవాడ ప్రాంతంలోని దాదాపు 40,000 మంది ఉత్పత్తి దార్లకు హైద్రాబాదు ప్రాంతంలోని 10.000మంది ఉత్పత్తిదార్లకు తమ ఉత్పత్తులకు నికరమైన మార్కెటు లభించడమే కాక యీ ఫ్యాక్టరీ ప్రాంతంలో పాల వ్యాపారంలో నవశకం ప్రారంభమవుతుంది. యీ పథకం అమలువల్ల విజయవాడ, గుంటూరు పట్టణాలలోని దాదాపు 4,50.000 మంది వాడకం దార్లకు పాలు లభ్యమవడమే కాక హైద్రాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలోని వాడకందార్లకు స్థానిక వనరుల ద్వారా లభించే పాలకుతోడు ఇక్కడ లభించేమిగులు పాలను సరఫరా చేయడం జరుగుతుంది.

## శీతల కేంద్రాలు

ఈపథకం అమలుచేయడంలో తగినంత అభివృద్ధిని సాధించడం జరిగింది. నాలుగు కేంద్రాలలో హనుమాన్ జంక్షన్, వీరంకి లాక్, పామర్రులలో మూడు కేంద్రాల నిర్మాణం పూర్తి అయింది. యునిసెఫ్ యంత్రాలను యీ శీతల కేంద్రాలకు తరలించడం జరిగింది. వీటిని త్వరలోనే నెలకొల్పడం జరుగుతుంది. నాలుగవ కేంద్రం గుడ్లవల్లేరులో నిర్మాణంలో ఉంది.

విజయవాడలోని ప్రధాన ఫ్యాక్టరీలో రు 3 లక్షల ఖర్చుతో నిర్మించబడే ట్రాన్స్‌పోర్ట్‌యార్డ్ పని పూర్తి అయింది. రు 5 లక్షల ఖర్చుతో నిర్మించ బడే పరిపాలనా నిర్వహణ బ్లాకుపని 80 శాతం పూర్తి అయింది. పాల ఉత్పత్తుల ఫ్యాక్టరీ పునాదుల పని పూర్తిఅయింది. దీనిఖర్చు అంచనా

రు. 38.00 లక్షలు. ఈ ఫ్యాక్టరీకి సంబంధించిన యునిసెఫ్ యంత్రాలు దాదాపు 38శాతం అందాయి. రైల్వే సైడింగ్, విజయవాడలో కల్వర్టుల నిర్మాణం కూడా పూర్తి అయింది.

తెలంగాణా ప్రాంతంలో కరప్తల్‌లో శీతలకేంద్రం, షాద్‌నగర్‌లో పాలుచిలకే కేంద్రాల నిర్మాణం పని పూర్తి కావస్తుంది. లాలాగూడలో ప్రధాన పాలక్షేత్రం భవనాల పునాదుల నిర్మాణం పనిచేపట్టడం జరిగింది. ప్రధానపాలక్షేత్రానికి రైల్వే సైడింగ్ నిర్మాణం మంజూరు అయింది. పని త్వరలోనే ప్రారంభం అవుతుంది. ప్రధానక్షేత్రానికి సంబంధించిన యునిసెఫ్ యంత్రాలు దాదాపు 95 శాతం అందాయి.

ఇంతవరకు యీ అన్ని పనులకై రు. 40.00 లక్షల మొత్తాన్ని ఖర్చుచేయడం జరిగింది. దీనికితోడు మరోవైపు యీ ఫ్యాక్టరీ నిర్వహణకు, యీ పథకాన్ని అమలుచేయడానికి కావలసిన సిబ్బందికి శిక్షణ ఏర్పాట్లు చేయడం జరిగింది. ఇంతవరకు 5గురు అధికారులకు విదేశాలలోని పటిష్ఠమైన పాల క్షేత్రాలలో శిక్షణ ఇవ్వడం కూడా జరిగింది.

## ప్రయోగాత్మక పథకం

పాల సేకరణ, ప్రొసెసింగ్ పంపిణీలలో అనుభవం పొందడానికి వీలుగా యీ ఫ్యాక్టరీవారు హైద్రాబాదులో ప్రయోగాత్మక పథకాన్ని అమలు చేస్తున్నారు. ఈ పథకం ద్వారా రోజుకు దాదాపు 6,000 లీటర్ల పాల అమ్మకం జరుగుతున్నది. హైద్రాబాదుకు 40మైళ్ళ దూరంలో ఉన్న పరిసర గ్రామాల నుంచి పాలను సేకరించి రాజేంద్రనగర్‌లోని పాలక్షేత్రంలో శుద్ధిచేసి దాదాపు 4000మంది వాడకం దార్లకు తోడు దాదాపు 60 ఆసుపత్రులకు, సంస్థలకు పాలను సరఫరా చేయడం జరుగుతున్నది. రైతులు పాడి పశువులను కొనుగోలు చేయడాన్ని ప్రోత్సహించడానికి వీలుగా ఇంతవరకు రు. 7.00 లక్షల మొత్తాన్ని రైతులకు మంజూరు చేశారు. రైతులు 1,400 పాడి పశువులను కొనుగోలు చేయడానికి యీ మొత్తాన్ని వినియోగించారు.

## పురావస్తుశాఖ

ఏలేశ్వరం, పోచంపాడు ప్రాంతాలలో త్రవ్వకాలపని అభివృద్ధి దశలో ఉంది. మరో రెండు నెలలపాటు యీపని కొనసాగుతుంది.

పెద్దతుంబాలం, రాజమండ్రి, బోధన్, డిచ్‌పల్లిలలో సంరక్షణ పనులను చేపట్టడం జరిగింది. రాజధానిలో సహరేబటూల్ కమాన్, గోల్కొండలోని ఖజానా భవనం మ్యూజియం సంరక్షణపనులు చేపట్టబడ్డాయి.

దిగువతెల్పిన ప్రచురణలు ముద్రణలో ఉన్నాయి:– (1) సలిహుండమ్‌లో బుద్ధుని అవశేషాలు. (2) చాళుక్యుని దేవాలయాలు. (3) తూర్పు చాళుక్యుల దేవాలయాలు. (4) బహమనీ నాణాల కేటలాగు (5) క్షేత్రప నాణాల కేటలాగు.

---

# 1964-65 సంవత్సరానికి ప్రణాళికా కార్యక్రమాలు

ఆంధ్రప్రదేశ్‌కు మూడవ ప్రణాళిక కొరకై సవరించిన కేటాయింపు మొత్తం రూ. 312.66 దీనిలో మొదటి మూడేళ్ళకు బహుశా అయ్యే ఖర్చు రూ. 166.00. ఈ కాలంలో కేంద్ర సహాయం క్రింద రాష్ట్ర ప్రభుత్వం రూ. 103.40 కోట్లు అందుకొంటుంది. ఇది, మొత్తం ప్రణాళిక కాలానికి కేంద్ర సహాయంగా లభించే సవరించబడిన కేటాయింపు రూ. 203.06 లలో 50.9 శాతం అన్నమాట. ఈ కాలంలో రాష్ట్రం వంతు రూ. 62.90 కోట్లు. అంటే ప్రణాళికకై రాష్ట్రం ఖర్చు చేయడానికి ఉద్దేశించిన సవరించిన కేటాయింపు రూ. 109.60 లో యిది 57.4 శాతం వుంటుంది.

ప్రణాళిక నాలుగవ సంవత్సరానికి – అంటే 1964–65 సంవత్సరానికి – కేంద్ర సహాయం రూ. 43.05 కోట్లు, రాష్ట్ర వనరుల క్రింద రూ. 26.30 కోట్లు అని ప్రణాళికా సంఘం సూచించింది. కాని రాష్ట్ర ప్రభుత్వం యీ ఏడాదికి దీని క్రింద రూ. 72.00 కోట్లను వెచ్చించడానికి నిశ్చయించింది. అంటే యీ ఏడాదికి ఆర్థిక వనరులలో రూ. 2.65 కోట్లు లోటు ఏర్పడుతుందన్నమాట. ఈ లోటును భర్తీచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం యీ ఏడాది ఆర్థిక వనరుల్ని ఆమేరకు అభివృద్ధి చేసుకోవలసి వుంటుంది.

ఆహారధాన్యాల మొత్తం ఉత్పత్తి స్థాయిని ద్వితీయ ప్రణాళికాంతానికి 63.19 లక్షలకు, తృతీయ ప్రణాళికాంతానికి 90.97 లక్షల టన్నులకు పెరిగేటట్టుగా ఆహారధాన్యాల అదనపు ఉత్పత్తి శక్తిని 27.78 లక్షల టన్నులకు పెంచాలనే ధ్యేయంతో ఆంధ్ర ప్రదేశ్ మూడవ ప్రణాళికను రూపొందించింది. అంటే 1950–51 ప్రాతిపదిక సంవత్సరపు ఉత్పత్తి స్థాయి అయిన 40.10 లక్షలకు యిది రెట్టింపుకన్న యింకా ఎక్కువే వుంది.

మూడవ ప్రణాళికాంతానికి రాష్ట్రంలో జనసంఖ్య 3.905 కోట్లు వుండవచ్చని అంచనా. మనిషి ఒక్కంటికి 18 ఔ॥ ఆహారధాన్యాల చొప్పున అవసరం అనుకుంటే మొత్తం అంతకు 73 లక్షల టన్నులు కావలసి వుంటుంది. ఆ విధంగా మూడవ ప్రణాళికలు వుద్దేశించిన మేరకు వాటిని సాధించడం జరిగితే మూడవ ప్రణాళికాంతానికి మన రాష్ట్రంలో, ఆహారధాన్యాల కొరత వున్న యితర రాష్ట్రాలకు ఎగుమతి చేయడానికి యించుమించు 18 లక్షల టన్నుల ఆహారధాన్యాలు మిగిలి వుంటాయి.

వర్తమాన సంవత్సరంలో ఆహార ధాన్యాల ఉత్పత్తిలో వచ్చిన అభివృద్ధిదృష్ట్యా 1963-64 లో ఉత్పత్తి సుమారు 76 లక్షల టన్నులు ఉంటుందని భావించబడుతున్నది.

ప్రణాళికా కాలంలో 3.71 లక్షల ఎకరాల వ్యావసాయక భూముల్లో భూసార రక్షణ చర్యలు తీసుకోవడానికి ఉద్దేశించడం జరిగింది. దీనిలో మొదటి మూడేళ్ళకు 0.86 లక్షల ఎకరాలలో యీ చర్యలు తీసుకోవడం జరగవచ్చు.

వివిధ చిన్న నీటి వనరుల కార్యక్రమాలను ప్రారంభించడం ద్వారా 10.43 లక్షల ఎకరాలను అదనంగా నీటి పారుదల సౌకర్యాల క్రిందికి తీసుకురావడం జరుగుతుంది. మొదటి మూడేళ్ళలోనూ బహుశా 5.11 లక్షల ఎకరాలకు యీ సౌకర్యం కల్పించవచ్చు. 1964–65 సం॥ పు ధ్యేయం 2.46 లక్షల ఎకరాలు.

4.50 లక్షల ఎకరాలలో కమతాల ఏకీకరణ చేపట్టబడుతుంది. మొదటి మూడేళ్ళలో సాధించినది 3.50 లక్షల ఎకరాలు. 1964–65 సం॥ కి సాధించాల్సిన ధ్యేయం 0.50 లక్షల ఎకరాలు.

గ్రుడ్లు, చేపలు, పాలు మొదలయిన సహాయక, రోగనిరోధక ఆహార పదార్థాల ఉత్పత్తిని అధికం చేయడానికి కూడా గట్టిగా ప్రయత్నం చేయడం జరుగుతున్నది.

యునెసెఫ్ సహకారంతో చేపట్టిన సమీకృత పాలప్రాజెక్టు నిర్మాణ కార్యక్రమాలు చురుకుగా కొనసాగుతున్నాయి. వర్తమాన ప్రణాళికాంతానికి యీ ప్రాజెక్టు పూర్తయి, పనిచేయడం మొదలు పెడుతుందని భావించబడుతున్నది.

ప్రస్తుతం పనిచేస్తున్న 447 సమాజ వికాస బ్లాకులలోనూ వ్యవసాయోత్పత్తిపై అధిక శ్రద్ధ చూపించడం జరుగుతున్నది. సమాజవికాస కార్యక్రమానికి కేటాయించ

బడిన విధులు ముఖ్యంగా యీ విషయంలో వెచ్చించడం జరుగుతున్నది.

## సహకారం

మొత్తం సుమారు 24 లక్షల మంది సభ్యులతో ఇంచుమించు 16,000 ప్రాథమిక సహకార వ్యవసాయ సంఘాలు ప్రస్తుతం పనిచేస్తున్నాయి. 1962–63 సం॥లో విడుదల చేసిన స్వల్పకాలిక, మధ్య కాలిక ఋణాల మొత్తం రూ. 18.73 కోట్లు వుంది. ఇది 1963–64 సం॥ లో రూ. 25.00 కోట్లకు, 1964–65 సం॥ లో రూ. 35.00 కోట్లకు పెంచబడుతుంది. ప్రణాళికా కాలానికి మొత్తం యివ్వవలసినది రూ. 45.00 కోట్లు, అంతిమలక్ష్యం రూ. 45.00 కోట్లు. దీర్ఘ కాలిక ఋణాల క్రింద రూ. 6.00 కోట్లు పంపిణీ చేయాలని లక్ష్యం వుండగా 1962–63 సం॥ వరకు అప్పటికి పనిచేస్తున్న 124 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల ద్వారా మంజూరు చేయబడిన ఋణాల మొత్తం రూ. 3.45 కోట్లు. 1963–64 సం॥లో యీ మొత్తం రూ. 4 30 కోట్లకు, 1964–65 సం॥ లో రూ. 5.15 కోట్లకు పెంచ బడుతుంది.

ముఖ్యంగా ధరలను అదుపులో పెట్టడానికై నాన్ గజెటెడ్ ఉద్యోగులతో పాటు సామాన్య ప్రజలకు కూడా వినియోగ దారుల సహకార సంఘాలు 1963–64 సం॥ నుండి ప్రారంభించ బడ్డాయి.

## నీటి పారుదల

బహుళార్థ సాధక నాగార్జున సాగర్ ఆనకట్ట నిర్మాణం అనుకున్న ప్రకారం సాగి పోతున్నది. 1966 సం॥ నాటికి ఆనకట్ట నిర్మాణం పూర్తవుతుందని భావించ బడు తున్నది. కాలువలద్వారా నీటి పారుదల సౌకర్యాలు నాల్గవ ప్రణాళిక మొదటి సంవత్సరం నుండి కల్పించ బడతాయి.

భారీ, మధ్యరకపు నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద మొత్తం 8.64 లక్షల ఎకరాలకు నీటి సౌకర్యం కల్పించాలని ప్రణాళిక ధ్యేయం. 1963–64 సంవత్స రాంతానికి 6.75 లక్షల ఎకరాలకు యీ సౌకర్యం కల్పించ బడుతుంది. 1964–65 లో మరొక 1.31 లక్షల ఎకరాలను అదనంగా ఈ సౌకర్యం క్రిందకు తీసుకురావడం జరుగు తుంది. ప్రతి ప్రాజెక్టు క్రిందా లభించే నీటి పారుదల సౌకర్యాలను సమీకరించి త్వరిత గతిని ఉపయోగంలోకి తీసుకరావడానికి వీలుగా ప్రాజెక్టుల క్రిందగల ఆయకట్టులను అభివృద్ధి పరచేందుకు 1964–65 సం॥ రానికి రూ. 0.50 కోట్లూ, మొత్తం ప్రణాళిక కాలానికి రూ. 2.08 కోట్లు కేటాయించడం జరిగింది.

తృతీయ ప్రణాళికా కాలంలో వరద నిరోధక పథకాలక్రింద 1.56 లక్షల ఎకరాలు లాభం పొందగలవు. మొదటి మూడేళ్ళ లోనూ 1.26 లక్షల ఎకరాలలో దీనిని సాధించడం జరిగింది. 1964–65 సం॥ లో 0.15 లక్షల ఎకరాలలో వరద నిరోధక చర్యలు తీసుకోవాలని ధ్యేయం.

## శక్తి

ప్రస్తుతం రాష్ట్రంలోవున్న స్థాపిత యంత్రశక్తి 213 మి. వా. స్థిరశక్తి 140 మి. వా. ఇది ప్రస్తుత అవసరాలను తీర్చ డానికి చాలదు. తృతీయ ప్రణాళికాంతానికి లోడ్ డిమాండు 600 మి. వా. వరకు పెరగ వచ్చని భావించ బడుతున్నది. ప్రణాళికా కాలానికి ఉద్దేశించబడిన అదనపు స్థాపిత యంత్రశక్తి 381.30 మి. వా. మొదటి రెండేళ్ళలోనూ క్రొత్తగా విద్యుదుత్పత్తి కాలేదు. 1963–64 సం॥ లో 41.60 మి. వా. 1964–65 సం॥ లో 37.20 మి. వా. విద్యు చ్ఛక్తిని ఉత్పత్తి చేసేందుకు కార్య క్రమాలు వున్నాయి.

గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించే కార్యక్రమం ఎంతగానో అభివృద్ధి చెందింది తృతీయ ప్రణాళికలో 978 పట్టణా లకు గ్రామాలకు, విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని కల్పించాలని ధ్యేయం వుండగా 1963–64 సం॥ నాటికి 984 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తికల్పించబడుతుంది. దీనిలో వర్త మాన సంవత్సరంలో విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించ బడనున్న 184 ఊళ్లుకూడా కలిసి వున్నాయి. 1964–65 సం॥ ధ్యేయం 27 గ్రామాలకు ఆ సౌకర్యం కల్పించాలని. తృతీయ ప్రణాళికాంతానికి మొత్తం 1,037 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం వ్యక్తంచేసిన మేరకు తెలంగాణా ప్రాంతీయ సంఘం కొన్ని కొన్ని అభివృద్ధి పథకాల విషయంలో చేసిన సిఫారసులను పురస్కరించుకుని తెలంగాణాలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించేందుకు అదనంగా కేటాయించిన నిధుల కారణంగానే యీ విద్యుచ్ఛక్తి సౌకర్యం విషయంలో మన ధ్యేయాన్ని మించి సాధించడం జరుగు తున్నది. ఈ పథకాల క్రింద మొదటి మూడేళ్ళలోనూ అయ్యే ఖర్చు రూ. 9.60 కోట్లు. 1964–65 సం॥ రానికి మొత్తం రూ. 4 కోట్లు ఖర్చుఅయ్యే పథకాలకు ఆమోదం లభించింది.

## పరిశ్రమలు

రాజమండ్రిలోని ఆంధ్రా పేపరుమిల్లు విస్తరణ మరుకుగా కొనసాగుతున్నది. ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి సంస్థకు వాటా ధనాన్ని యివ్వడం, సింథటిక్ మందుల కర్మాగారం, భారీ విద్యుత్పరికరాల కర్మాగాలకు భూమి, నీరు, విద్యుచ్ఛక్తి

సౌకర్యాలు మొదలయిన వాటిని కల్పించడం, పారిశ్రామిక ప్రాంతములను అభివృద్ధి పరచడం—ముఖ్యంగా చెప్పుకుకోదగ్గ యితర అభివృద్ధి పథకాలు.

రూ. 4.00 లక్షల ఖర్చుతో భారీ పరిశ్రమలకు, మధ్యరకపు పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని తగ్గింపురేట్లకు అందజేసే ఒక కొత్త పథకం 1964–65 సం॥ నుండి ప్రారంభించ డానికి ఉద్దేశించబడింది. లఘు పరిశ్రమలకు యీ సౌకర్యం 1963—అక్టోబరు నుండి లభిస్తూనే వున్నది. 1964–65 సం॥ రానికి ప్రణాళికలో యిందుకై రూ. 5.07 లక్షలు కేటాయించ బడ్డాయి.

రాష్ట్రానికి కూడా కొంతభాగం వుండే టట్లుగా తెలంగాణా ప్రాంతంలో టోనకల్లులో ఒక సిమెంటు ఫ్యాక్టరీని స్థాపించేందుకు ప్రాథమిక చర్యగా 1962–63 సం॥ కాలానికి రూ. 30 లక్షలను యివ్వడంతో పాటు మరొక రూ. 10 లక్షలను 1964–65 సం॥ లో ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషనుకు యివ్వడానికి ఉద్దేశించడం జరిగింది.

గ్రామీణ, లఘుపరిశ్రమల క్రింద చర్మ పరిశ్రమ, పారిశ్రామిక వాటికలు, పారిశ్రామిక సహకార సంస్థలు, చేతి పనులు, పట్టు పరిశ్రమ, కొబ్బరిపీచు, చేనేత మొదలయిన పరిశ్రమలకు సంబంధించిన పథకాలు వాటికి వున్న నిధుల మేరకు విజయవంతంగా నిర్వహించ బడుతున్నాయి.

## రోడ్లు, రవాణా

ఆంధ్ర ప్రదేశ్ ప్రాంతీయసంఘం సిఫారసుల కొరకు తెలంగాణా మిగులు నిధుల నుండి తీసుకుని తెలంగాణా ప్రాంతలో ప్రారంభించిన బహుకొద్ది కొత్తపథకాలు తప్ప ప్రణాళికలో రోడ్లకొరకు కేటాయించ బడిన మొత్తం అంతా ద్వితీయ ప్రణాళికలో అసంపూర్తిగా వదిలివేయబడిన పథకాలను పూరించడానికే ఉద్దేశించ బడ్డాయి. మామూలుగా ప్రణాళిక పథకాల కొరకు కేటాయించ బడిన రూ. 113.50 లక్షలతోపాటు, 1964–65 సం. రానికి పబ్లిక్ వర్క్సు, జిల్లా పరిషత్తురోడ్లకు తెలంగాణా మిగులు నిధులనుండి రూ. 1.80 కోట్లు కేటాయించ పడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రవాణా సంస్థ వాటాధనం క్రింద ప్రణాళిక కాలానికి రాష్ట్రం చెల్లింపు రూ. 300.60 లక్షలు. 1961–62లో రూ. 48.72 లక్షలు, 1962–63 సం. లో రూ. 46.88 లక్షలు, 1963–64 సం. లో రూ 60.00 లక్షలు చెల్లించడం జరిగింది. 1964–65 సం. రానికి ఉద్దేశించబడిన డబ్బు రూ. 72 లక్షలు.

విహార ప్రాంతాలక్రింద ద్వితీయ ప్రణాళికలోని అసంపూర్తి పథకాలన్నిటినీ పూర్తి చేయడం జరిగింది. అంతేకాక తిరుపతిలో తక్కువ ఆదాయంగల వర్గం వారికి ఒక విశ్రాంతి గృహం; ఆదిలాబాదు, అరకులలో ఎక్కువ ఆదాయంగల వర్గంవారికి రెండు విశ్రాంతి గృహాల నిర్మాణం చేపట్ట బడింది. విశాఖపట్టణం, ఉస్మాన్ సాగర్‌ల వద్దగల విశ్రాంతి గృహాలలో అదనపు సౌకర్యాలు కల్పించ బడ్డాయి.

## సాంఘిక సేవలు

బాలికలకు ఉన్నత మరియు హయ్యర్ సెకండరీ స్థాయిలవరకు ఉచిత విద్యా సౌకర్యాన్ని కల్పించడం, విద్యార్థులకు 10.000 మెరిట్ స్కాలర్ షిప్పులను యివ్వడం, వైద్య విద్యార్థులకు పెద్ద మొత్తాలలో ఋణాలు యివ్వడం, వార్ధక్యపు పెన్షన్ల సౌకర్యాలు కల్పించడం మొదలయిన అనేక ప్రణాళికేతర సాంఘిక కార్యక్రమాలకు 1964–65 సం. నుండి యేటా ఒక కోటి రూపాయల్ని వెచ్చించ డానికి ప్రభుత్వం నిశ్చయించింది. నాగార్జున సాగర్, పోచంపాడు, శ్రీశైలం వంటిపెద్ద పెద్ద ఆనకట్టలను కేంద్ర రంగంలోకి తీసుకోవలసిందిగా రాష్ట్రప్రభుత్వం భారత ప్రభుత్వాన్ని మరొకసారి కోరినట్టు ప్రస్తావనా వశమున యిక్కడ చెప్పక తప్పదు. ఈ విషయంలో కేంద్రం అంగీకరిస్తే సాంఘిక కార్యక్రమాల క్రింద వివిధముఖ్య పథకాలను చేపట్టడానికి తగినన్ని నిధులు లభించగలవు.

సాధారణ విద్యక్రింద 6–8 సం. మధ్య వయస్కులైన పిల్లలకు మాత్రమే నిర్బంధ విద్యను వర్తింపజేయడం జరుగుతుంది. ఇంతకుపూర్వం 6–11 సం. మధ్య వయస్సులకు వర్తింప జేయాలని వుండేది. 1–5 క్లాసులలో అదనంగా నమోదయిన మొత్తం పిల్లలసంఖ్య 1963–64 సం. నాటికి 5.64 లక్షలు. మొత్తం ప్రణాళిక ధ్యేయం మాత్రం 16 లక్షలు. అసలు ధ్యేయం 11,500 కాగా మొదటి మూడేళ్ళలోనూ అదనంగా చేర్చుకున్న ఉపాధ్యాయులసంఖ్య 9,300 వుంది. 11–14 సం. వయసు వర్గానికి చెందినంతవరకు, అదనంగా 575 మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడం, 2.58 లక్షల పిల్లలను అదనంగా పాఠశాలల్లో చేర్చుకోవడం విషయంలో యీ సంఖ్యలు దాటిపోయేటట్టు వున్నాయి.

సెకండరీ విద్యక్రింద 400 ఉన్నత పాఠశాలలను నెలకొల్పడం, 440 ఉన్నత పాఠశాలలను హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా రూపొందించడం ప్రణాళికయొక్క లక్ష్యం. అయితే మొదటి రెండేళ్ళలోనే 427 ఉన్నత పాఠశాలలు ప్రారంభించబడ్డాయి. 93 ఉన్నత పాఠశాలలు హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్పు చేయబడ్డాయి. పైగా, నిధుల కొరతవల్ల ఉన్నత పాఠ

శాలల్ని హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్పుచేసే కార్యక్రమాన్ని ప్రస్తుతానికి వాయిదా వేయడం జరిగింది. తెలంగాణా ప్రాంతానికి ఉదారమైన గ్రాంటు నిబంధనలను విస్తరింప జేయడమేగాక పబ్లిక్ పాఠశాలల విధంగా రెండుగాని, మూడుగాని రెసిడెన్షియల్ పాఠశాలలను ప్రారంభించాలని ఉద్దేశించడం జరిగింది.

కళాశాల స్థాయిలో దేహదార్ఢ్యము గలిగిన విద్యార్థులందరినీ ఎన్. సి. సి. కార్యక్రమం క్రిందకు తీసుకు రావడానికి, సెకండరీ పాఠశాలల్లో జాతీయ క్రమ శిక్షణా పథకాన్ని ప్రారంభించడానికిగాను ఎన్. సి. సి. కార్యక్రమాన్ని విస్తరించేందుకు ప్రణాళికలో దీనికి తగినంతగా కేటాయించడం జరిగింది. తెలంగాణాలో పాఠశాలల భవనాలను నిర్మించడానికి 1964–65 సం. రానికి రూ. 0 45 కోట్లు కేటాయించబడ్డాయి.

సాంకేతిక విద్యకు తగినంతగా ప్రాధాన్యత యివ్వబడింది. 1961–62 సం. లో ఖర్చు రు 42.24 లక్షలు, 1962–63 సం. లో ఖర్చు రు 41.10 లక్షలు కాగా 1963–64సం. రానికి 50.50 లక్షలు, 1964–65 సం॥ రానికి రూ. 71 58 లక్షలు కేటాయించబడ్డాయి. డిగ్రీ క్లాసుల్లో విద్యార్థులను తీసుకునే సంఖ్య యీ ఏడాది మరో 220 కి పెంచడం జరిగింది. ఇంజనీరింగు పట్టభద్రుల సంఖ్యను పెంచడానికి 1963–64, 1964. 65 సం. కాలాల్లో రాష్ట్రంలోని అన్ని ఇంజనీరింగు కళాశాలల్లోనూ వేసవి సెలవులను తగిన విధంగా తగ్గించడం జరిగింది. డిప్లొమా కలిగివున్న వారికొరకు పార్టుటైమ్ డిగ్రీ కోర్సులు నిర్వహించబడుతున్నాయి.

ఆత్యయిక పరిస్థితి కారణంగా ఏర్పడిన అవసరాన్ని తీర్చడానికిగాను రాష్ట్రంలోని రెండు ప్రయివేటు వైద్య కళాశాలలతో సహా మొత్తం ఎనిమిది వైద్యకళాశాలల్లోనూ మరో 190 సీట్లను యీ ఏడాది పెంచడం జరిగింది. వైద్యశాలల్లో పడకల సంఖ్యను మూడవ ప్రణాళికలో 2,000 లకు పెంచవలసి వుండగా 1963–64 సంవత్సరాంతానికి వీటిని 1,000 లకు పెంచడం జరుగుతుంది. 1964–65 సం॥ పు లక్ష్యం మరొక 200 పడకలను ఏర్పాటు చేయడం. మూడవ ప్రణాళిక ప్రారంభంనాటికి 193 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు వున్నాయి. ఆ తర్వాత ప్రణాళిక మొదటి మూడేళ్ళలోనూ 62 కేంద్రాలు అదనంగా స్థాపించబడ్డాయి. అంటే మొత్తం 255 కేంద్రాలన్నమాట. వీటిలో 78 కేంద్రాలలో డాక్టర్లు లేరు. ఈ 78 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలోనూ 50 కేంద్రాలలో డాక్టర్లను భర్తీ చేయడం జరిగింది. సంవత్సరానికి 22 చొప్పున రానున్న రెండేళ్ళలోనూ మొత్తం 44 కేంద్రాలు అదనంగా ఏర్పాటు చేయబడతాయి. రక్షణ అవసరాల దృష్ట్యా ఇంచుమించు 88 మంది డాక్టర్ల సేవలను వినియోగించు కోవడం కారణంగా యీ కేంద్రాలలో డాక్టర్ల కొరత ఏర్పడింది. వైద్య కళాశాలలనుండి కొత్తగా డిగ్రీలతో డాక్టర్లు బయటికి రాగానే, 1964 జూన్ నాటికి యీ కేంద్రాలన్నింటిలోనూ డాక్టర్లను ఏర్పాటు చేయడం జరుగుతుంది. ఇక రోగనిరోధక కార్యక్రమాలు కూడా అనేకం సమర్థవంతంగా నిర్వహించబడుతున్నాయి. మలేరియా నిర్మూలనోద్యమం, మశూచి నిర్మూలనోద్యమం బి. సి. జి టీకాలు మొదలయిన వివిధ అఖిలభారత కార్యక్రమాలు చక్కగా నిర్వహించబడుతున్నాయి.

రక్షణావసర వస్తువుల కొరతదృష్ట్యా వాటిని నివారించడానికి కార్మికులు, కార్మిక సంక్షేమంక్రింద వృత్తిపనివారల శిక్షణ పథకాలకు ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడుతున్నది. ఇందుకై యీ ఏడాదికి (1963–64) రూ. 22.50 లక్షలు కేటాయించబడ్డాయి. 1964–65 సం. రానికి రూ. 20 లక్షలు ఉద్దేశించబడ్డాయి. 1961–62 సం. లో రూ. 2.5 లక్షలు, 1962–63 సం. లో రూ. 3.19 లక్షలు మాత్రమే వెచ్చించడం జరిగింది. పై అంకెలు, మొత్తం అయ్యే ఖర్చులో తన వంతుగా రాష్ట్రం భరించే 40 శాతం మాత్రమే. తృతీయ ప్రణాళికలో స్థాపించ దలచుకున్న 10 పారిశ్రామిక శిక్షణ సంస్థలకూ యింతవరకు ఆరుదింటిని ప్రారంభించడం జరిగింది. 1964–65 సం॥లో మరో 4 సంస్థల్ని స్థాపించేందుకు ప్రాథమిక చర్యల్ని తీసుకోవడం జరుగుతున్నది. వచ్చే విద్యా సంవత్సరంలో వివిధ పారిశ్రామిక శిక్షణ సంస్థలలోను మొత్తం 900 సీట్లను అదనంగా పెంచాలని ఉద్దేశించబడింది.

ఇండ్ల కొరతను తీర్చడానికి ద్వితీయ ప్రణాళికలో ప్రారంభించిన కార్యక్రమాలు పూర్తయ్యాయి. వర్తమాన ప్రణాళికా కాలంలో 6,000 నివాసగృహాలు నిర్మించబడవచ్చునని భావించబడుతున్నది. వీటిలో 4,950 గృహాలు యీ సంవత్సరాంతానికి పూర్తి కాగలవు. 1964–65 సం పు లక్ష్యం 566 గృహాలను నిర్మించాలని. ఇవేగాక 2,530 కాలనీస్థలాలను అభివృద్ధి పరచడం జరిగింది.

షెడ్యూలు కులాల, షెడ్యూలు జాతుల యితర వెనుకబడిన తరగతుల సంక్షేమం క్రింద యీ అడుగు పౌరజీవులకు ఆయా కార్యక్రమాలవల్ల అత్యధిక లాభాలు జరిగేటట్టు ఆ కార్యక్రమాలను మార్పు చేయడం జరిగింది. వీరికి ఎక్కువ స్కాలర్‌షిప్పులను యివ్వడం,

(మిగతా 46 వ పేజీలో)

# సంస్కృత సాహిత్యానికి ఆంధ్రుల సేవ

— కీ॥ శే॥ కురుగంటి సీతారామయ్య

సంస్కృత విజ్ఞానం, వైజ్ఞానికాభివృద్ధికి ఆంధ్రులు చేసిన సేవ అనల్పమైనది. ప్రాచీనతమమైనది. ఇది దాదాపు అన్ని శాఖలకూ విస్తరించింది దీనిని ఈ లఘు వ్యాసంలో సంక్షిప్తంగా చెప్పడానికి మాత్రమే సాధ్యమవుతుంది. 'ఆంధ్రులు' అంటే ఆంధ్ర దేశంలో నివసిస్తున్న వారు అని అర్థం. ఐతరేయ బ్రాహ్మణం తరువాతి భాగాలలో ఒకదానిలో ఉల్లేఖించబడిన సునస్సేపుని ఉదంతం ఈ విషయంలో మొట్ట మొదట పేర్కొనబడింది. విశ్వామిత్రుని శాప ఫలితంగా ఆంధ్రజాతికి ఆ పేరు వచ్చింది. ఈ శాపాన్ని వారు 1000 సంవత్సరాలపాటు అనుభవించినట్లు, ఆ తరువాత తిరిగి యధా ప్రకారం ఆర్యత్వం పొందినట్లు స్వర్గీయ పండిత సుబ్రహ్మణ్య శాస్త్రి పేర్కొన్నారు. ఆంధ్రులకు తిరిగి ఆర్యప్రతిపత్తిని లభింప జేయడంలో ఆపస్తంబుడు విజయుడయ్యాడు. ఐతరేయ బ్రాహ్మణం తరువాత సుమారు 500 సంవత్సరాలకు ఆయన జననమొందాడు ఆపస్తంబుడు ఆంధ్రులలో తిరిగి చాతుర్వర్ణ వ్యవస్థను ప్రవేశపెట్టి వారికి మార్గదర్శకంగా వుండేందుకై సూత్రాన్ని రచించాడు. "ఆపస్తంబుని సూత్రం, ఆగ్నేయ భారతంలోని ఆంధ్రుల వైదిక సంప్రదాయానికి చెందింది. ఆపస్తంబుని ధర్మం దక్షిణ భారతంలో ఉద్భవించినట్లు కనిపిస్తుంది" అనే విషయంతో బుహ్లర్, రాప్సన్‌లు అంగీకరించారు. "ఆపస్తంబుని సిద్ధాంతం దక్షిణ భారతంలో బహుశా ఆంధ్రలో ఉద్భవించిందని" భావించడం స్వాభావికమైనదని డాక్టర్ కానే విశ్వసిస్తాడు. అందుచేత ఆపస్తంబుడు ఆంధ్రుల శాసనకర్త. ఆంధ్రులలో 90 శాతం మంది ఆయన శాఖకు చెందినవారే. అందుకే ఆయన 'ఆంధ్రపిత'గా భాసిల్లాడు.

తరువాతి ప్రధాన ఘట్టం హాలుని పరిపాలనా కాలం. ఈ శాతవాహన చక్రవర్తి క్రీ. శ. ఒకటవ శతాబ్దంలో పరిపాలించాడు. ఈయన అద్వితీయమైన ప్రాకృత ముక్తక కావ్యం గాథాసప్తశతిని రచించాడు. ఈ కావ్యాన్ని గురించి ప్రసిద్ధ చారిత్రకుడు డాక్టర్ ఎస్. కె. అయ్యంగార్ ఇలా వ్రాశాడు: "ప్రపంచకల్పనా సాహిత్యమంతటిలోకీ ఇది ఆదికావ్యం". ఈ వ్యాఖ్య సముచితమైనది.

హాలుని ఆస్థాన కవులైన గుణాఢ్యుడు, సర్వవర్మనుడు ప్రసిద్ధములైన బృహత్కథ, కతంత్రవ్యాకరణములను లిఖించారు. బృహత్కథ సోమదేవుని కథా సరిత్సాగరానికి ఆలంబనం. తరువాత వచ్చిన అనేక కావ్యాలకు, నాటకాలకు ఇది ఒరవడిగా వుంది.

గతకాలం దరిదాపులో ఇరువురు సుప్రసిద్ధ బౌద్ధ రచయితలు డిజ్నాగ, నాగార్జునులు ప్రవర్థిల్లారు. నాగార్జునులు ఇద్దరు వున్నట్లు కొందరి అభిప్రాయం. ఒకవేళ ఉభయులూ ఒకరేననే నిశ్చయానికి వచ్చినట్లయితే, ఆయన కట్టకడపటి శాతవాహన చక్రవర్తి కాలంలోనూ, ఆ తర్వాత, కృష్ణానదీ తీరంలో విజయపురిని పరిపాలించిన మొదటి ఇద్దరు ఇక్ష్వాకు చక్రవర్తుల ఏలుబడిలోనూ ప్రవర్థమానం చెందినట్లు పరిగణించాలి. నాగార్జునుడు సుప్రసిద్ధ మహాయాన బౌద్ధమత స్థాపకుడు. ప్రజ్ఞాపరిమిత మొదలైన పెక్కు బౌద్ధ మత గ్రంథాలు ఆయన రచించాడు. గొప్ప కవి, వేదాంతి అయిన డిజ్నాగుడు వేంగిలో నివసించినట్లు పండిత సతీష్‌చందర్ విద్యాభూషణ్ వ్రాశాడు. ఉత్తర రామాయణం ప్రాతిపదికగాగలకుందమాల అనే నాటకంతో పాటుగా బౌద్ధమతం, సిద్ధాంతాలపై ఆయన అనేక గ్రంథాలు వ్రాశాడు. ఆయన కుమారిల భట్టుతో చర్చాగోష్ఠులు జరిపినట్లు ప్రతీతి. నలందా విశ్వవిద్యాలయంలో కొంత కాలం ఆచార్యుడుగా కూడా పనిచేశాడు.

తరువాతి ఘట్టంలోని ముఖ్యులు ఇరువురు విఖ్యాత మీమాంసకులైన కుమారిల, ఉంబెకలు. మీమాంస న్యాయాల పునాదిపై వేదాన్ని ప్రతిష్ఠాపించిన గౌరవం కుమారిలునికి చెందుతుంది. ఈ కారణంగానే "వ్యవహార భట్టనయః" అన్న ఆర్యోక్తి వాడుకలోకి వచ్చింది.

ఆంధ్రుడైన కుమారిలునికి సంబంధించి జినవిజయంలో గల దిగువ ఉదహరించబడిన పంక్తులు గమనార్హమైనవి :

"ఆంధ్రోత్కలానాం యోగేపవిత్రేజ య
మంగళే.
గ్రామాంతికే మహానద్యాః భట్టాచార్యః
కుమారిలః
ఆంధ్రజాతి స్తిత్తిరికః మాతాచంద్ర గుణాసతీ
యజ్ఞేశ్వర "పితాయస్య."

వైదిక మతానికి ఆయన మూల స్తంభం వంటివాడు. జైమినీ సూత్రంపై శ్లోకవార్తిక, తంత్రవార్తిక, టుప్టిక అనే మూడు భాగాల క్రింద వాఖ్యానం వ్రాశాడు. ఉంబెకుడు కుమారిలుని శిష్యుడు. ఆయన గ్రంథాలపై వ్యాఖ్యానాలు వ్రాశాడు. కొందరు పండితులు ఆయనను భవభూతిగా విశ్వసిస్తారు. అలా అయిన ట్లయితే ప్రఖ్యాత నాటకమైన ఉత్తర రామచరిత్ర కర్త ఈయనే. "ఉత్తరే రామ చరితే భవభూతిర్వి శిష్యతే" అన్న ఆర్యోక్తి కూడా వుంది. ఆయన ఆంధ్రుడు కావడం వల్ల దీన్ని గట్టిగా సమర్థించడానికి వీలులేదు. అయితే మరికొన్ని ఆధారాలు వున్నాయి. ఈ సిద్ధాంతానికి ఆలంబనం అదే.

11 వ శతాబ్దంలో కలచూరి సామ్రాజ్యా ధీశుడు బిజ్జలుని అమాత్య శేఖరుడు బసవడు శైవమతాన్ని పునరుద్ధరింప జేశాడు. మల్లి కార్జున పండితుడు, పాల్కుర్కి సోమ నాథుడు శైవమతాన్ని సమర్థిస్తూ సంస్కృ తంలో కొన్ని గ్రంథాలు వ్రాశారు. వాటిలో దీపశిఖానాటకం, సోమనాథ భాష్యం ముఖ్య మైనవి.

12 వ శతాబ్దారంభం నుంచీ పరిపాలన సాగించిన ఆంధ్ర సామ్రాజ్యాలు మూడూ సంస్కృత విజ్ఞానాన్నీ, పండితులను పరిపో షించాయి.

కాకతీయ చక్రవర్తులు పోషించిన వారిలో అగస్త్యపండితుడు సుప్రసిద్ధుడు. ఆయనకు విద్యానాథుడనే మరో పేరుకూడా వుంది. విద్యానాథ విరచితమైన ప్రతాపరుద్ర యశో భూషణము భారతదేశమంతటా కూడా అలంకార శాస్త్రంలో పాఠ్య గ్రంథంగా వుంటున్నది. బాల భాగవతం ఈయన మరో ఉద్గ్రంథం. శ్రీ కృష్ణదేవరాయుని అమా త్యుడు తిమ్మరుసు దీనిపై వాఖ్యానం వ్రాశాడు. కృష్ణదేవరాయలు సాహితీ పోషకుడే కాక స్వయంగా కవి, పండితుడు కూడా. వైద్యం, గానకళ మొదలైన పెక్కు విషయాలపై ఆయన అనేక గ్రంథాలు లిఖించాడు. దురదృష్టవశాత్తు ఆయన సంస్కృత గ్రంథాలు వ్యాప్తిలోకి రాలేదు. కృష్ణదేవరాయలను ఆంధ్రులు, కన్నడులు కూడా తమ వాడని చెప్పుకుంటారు. సుప్రసిద్ధ వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు తన కీర్తనలను విజయనగర చక్రవర్తుల కాలం లోనే వ్రాశాడు.

ఇకపోతే రెడ్డిరాజుల సంగతి. రెడ్డిరాజు లంతా కూడా కవులను, గ్రంథ కర్తలను పోషించారు. ఆదరించారు. అంతేకాక వారిలో కొందరు స్వయంగా గొప్ప పండితులు కూడా. కోమటి వేమారెడ్డి కాళిదాసు నాటకాలపై, కాటమ వేమారెడ్డి అమరు శతకంపై వాఖ్యానాలు రచించారు. కుమారి గిరి లకుమాదేవి అభ్యర్థనపై వసంత రాజీయం అనే సంగీత, నాటక ప్రధానమైన గ్రంథాన్ని రచించాడు. వామనభట్ట బాణుడు వేమభూపాల చరితం అనే ప్రసిద్ధ గ్రంథాన్ని వ్రాశాడు. కవితాశైలిలో కాదంబరి తరువాత చెప్పుకోదగిన గ్రంథం ఇది. సర్వజ్ఞ సింగమ అనే రెడ్డినాయకుడు రసార్ణ వసుధాకరం అనే గ్రంథాన్నీ, విశ్వేశ్వరు డనే ఆయన ఆస్థాన కవీశ్వరుడు చమత్కార చింతామణి అనే గ్రంథాన్నీ రచించారు ఇవి రెండు కూడా అలంకార శాస్త్రంపై వ్రాయ బడినవే. ఈ శతాబ్దాలలో సుప్రసిద్ధ పండితులు కొంతమంది ప్రవర్ధమానం చెందారు. వారి ఉద్గ్రంథాలు సంస్కృత విజ్ఞానాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డాయి. అన్నమభట్టు తర్క సంగ్రహాన్ని వ్రాశాడు. భారతదేశ మంతటా తర్కశాస్త్రంలో పాఠ్యపుస్తకంగా దీనిని ఉపయోగిస్తున్నారు. దీనిపై అనేక వాఖ్యాన గ్రంథాలు వెలువడ్డాయి. తార్కికులు పద్య రచనలో సిద్ధహస్తులు కాకపోవడం కద్దు. కాగా అన్నమభట్టు కూడా ఈ కోవలోని వాడే. ఆయన తన గ్రంథం ప్రారంభంలో ఒక అనుష్టుప్ పద్యాన్ని వ్రాయగోరాడు. "విదుషాన్నం భట్టేన'' అనే పాదపంక్తి ప్రయోగం పొసగక తీవ్రంగా యోచించ సాగాడు. అన్నమభట్టుని అసహాయ పరిస్థితిని చూచిన ఆయన భార్య "అన్నం భట్టేన విదుషా'' అనే ప్రయోగాన్ని సూచించింది. దానికి ఆయన తన అర్ధాంగికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

అభినయ దర్పణాన్ని ఎవరు వ్రాసిందీ ఇదమిత్థంగా తెలియదు. అయితే దీనిని నందికేశ్వరుడు వ్రాశాడనే వాదం ఒకటుంది. అయితే దీని వ్రాత ప్రతు లన్నీ కూడా — అవి బెంగాలులో లభ్యమైనప్పటికీ, కాశ్మీరులో లభ్యమైనప్పటికీ — తెలుగులో వున్నాయి. కాబట్టి దీనిని లిఖించింది తెలుగు వాడే ననే విషయం సుస్పష్టం. నాట్యభంగిమలపై వ్రాయబడిన గొప్ప గ్రంథమిది. రామయా మాత్యుడు అళియ రామరాయుని కాలంలో స్వరమేలా కళానిధిని రచించాడు.

ఓరుగల్లు గణపతిదేవ చక్రవర్తి గజసా హిణి జాయపసేనాని నాట్యశాస్త్రంలో గొప్ప గ్రంథ కర్త. నృత్య రత్నావళి అనే గ్రంథాన్ని ఆయన వ్రాశాడు. ఆ గ్రంథంలో ఆయన అభివర్ణించిన అపూర్వ నృత్య భంగిమలు రామప్పదేవాలయంలో శిలా మూర్తులుగా చెక్కబడినవట. తంజావూరు నాయకరాజులలో ఒకడైన రఘునాథుడు

శ్రీ కృష్ణదేవరాయలు వంటివాడు. ఆయన పెక్కు గ్రంథాలు రచించాడు. వాటిలో సంగీత సుధ (ఆయన అమాత్యుడు గోవింద దీక్షితుడు వ్రాసిందంటారు) మహాభారత సారసంగ్రహం సుప్రసిద్ధమైనవి.

పండితరాజు పేరు కూడా ఈ సందర్భంలో పేర్కొనదగింది. ఆయన సంస్కృత విజ్ఞమండలంలోని ప్రకాశవంతమైన నక్షత్రాలలో ఒకరు. ఆయన కావ్యం నిర్వచనం అత్యంత ప్రామాణికమైనది. శిరోధార్యమైనది.

"సంస్కృత కావ్యాలపై వ్రాసిన ప్రతిభావంతుడైన కడపటి రచయిత ఈయన. అందుచేత ఈ దశలో ఈ ప్రక్రియను ముగింప జేయడం సమంజసమ''ని డాక్టర్ కానే అన్నాడు.

ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత ఎకాడమీ, ఆయన కావ్యాలన్నింటినీ సంపుటీకరించి ప్రచురించింది. ఆయన శాంతి విలాసంలోని స్వీయ చరిత్రకు సంబంధించిన పద్య పంక్తులను దిగువ పేర్కొంటున్నాను :

"శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయః సర్వేపి సంభావితాః
ఢిల్లీవల్లభ పాణిపల్లవ తలేనీతం నవీనం వయః
సంప్రత్యంధక శాసకస్యనగరే తత్వం పరించిత్యతే
సర్వం పండిత రాజరాజితిలకే నా కారిలోకాధికం."

దండిభట్ల కుటుంబానికి చెందిన బహుముఖ ప్రజ్ఞాశాలి విశ్వనాథశాస్త్రి జర్మనీకి బలవంతంగా తీసుకు వెళ్ళబడినట్లు విశ్వసించబడుతున్నది. శబ్దరత్నప్రభ, పరిభాషేందు చంద్రిక, శబ్దేందు చంద్రిక అనే గ్రంథాలను ఆయన లిఖించినట్లు ప్రతీతి. సంస్కృత వ్యాకరణానికి ప్రోది చేసిన వారిలో పేర్కొనదగినవారు భాగవతుల హరిశాస్త్రి, మహామహోపాధ్యాయ తాతా సుబ్రహ్మణ్య శాస్త్రి. భాగవతుల హరిశాస్త్రి రత్నాపణం, చిత్రప్రభ అనే గ్రంథాలనూ, తాతా సుబ్రహ్మణ్యశాస్త్రి గురు ప్రసాదం అనే గ్రంథాన్నీ వ్రాశారు.

గత శతాబ్ది పూర్వార్ధకాలానికి చెందిన బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన పండిత శిఖామణి బెల్లంకొండ రామారావు వ్యాకరణం ఇంకా అనేక ఇతర విషయాలపై 42 గ్రంథాలు రచించాడు. రామారావు శ్రీ శంకరాచార్యునివలెనే తన 32వ ఏట పరమపదించాడు. ఈయన గ్రంథాలలో అనేకం వెలుగును నోచుకోలేదు.

చాలారి నృసింహాచార్య విరచితమైన సదాచారస్మృతి ప్రసిద్ధ ధర్మశాస్త్ర గ్రంథం.

కవయిత్రులలో ముఖ్యంగా పేర్కొనదగినవారు గంగాదేవి, రామభద్రమాంబ, మధురవాణి. వీరిలో చివరి ఇద్దరు రఘునాథ నాయకుని ఆస్థానకవయిత్రులు వీరు కంపరాయ చరిత్ర, రఘునాథాభ్యుదయం, రామాయణసారం అనే మూడు ఉద్గ్రంథాలు రచించారు. కంపరాయుడు మహమ్మదీయులను జయించిన పిమ్మట దక్షిణాపథం ఏవిధంగా వున్నదీ గంగాదేవి ఇలా వర్ణించారు :

ప్రశాంత దావాదవనాంత లక్ష్మీః
గతోపరాగా గగనస్థలేన
కళిందజామర్దిత కాళిమేత
దిగ్దక్షిణాసీత్ క్షతపారసీకా

మధురవాణి తనను గురించి తాను ఇలా చెప్పుకున్నది :

చాతుర్యమేతి కవితా సచతుర్విధాసు
వీణాకళా ప్రకటనే భవతి ప్రవీణా
ప్రజ్ఞామయం నిపుణమంచితి పాణినీయే
మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే "

సంస్కృత సాహిత్యానికి అమోఘసేవ చేసిన విద్వాంసులను పరంపరగా ఉద్భవింపజేసిన కుటుంబాలు కొన్ని ఆంధ్రదేశంలో వున్నాయి. అటువంటి కుటుంబాలలో కోలాచలం, చెరుకూరి, దేవులపల్లి, బొమ్మకంటి, చిలుకూరి, కోరాడ, పరవస్తు, కురుగంటి వారిని పేర్కొనవచ్చు. కోలాచలం మల్లినాథసూరి అయిదు కావ్యాలకు నైషధానికి భాష్యం వ్రాశాడు. ఆయన కుమారుడు కుమారస్వామి ప్రతాపరుద్రీయంపై, ఆయన బంధువు నారాయణ రామాయణ చంపు, రామచంద్ర బుధేంద్రలపై వ్యాఖ్యానాలు రచించారు. ఈ కుటుంబాలకు చెందిన పండితులు వ్రాసిన ఉద్గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనదగినవి ఇవి :*

| | |
|---|---|
| 1.* కృతిరంజని–గీతగోవిందానికి వ్యాఖ్య–, షడ్భాషా చంద్రిక ... | చిలుకూరి లక్ష్మీధర |
| 2. తిలకాసహస్రం ... | బొమ్మకంటి నరసింహశాస్త్రి |
| 3. కుంభకర్ణ విజయం (కావ్యం), మంజుల నైషధం (నాటకం) లఘు శబ్దార్థ సంగ్రహము ... | పరవస్తు వెంకటరంగనాథాచారి |
| 4 గానవృత్త ... | కోరాడ రామచంద్రశాస్త్రి |
| 5. శ్రీరామ పంచాష్టి ... | దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి |
| 6. బ్రహ్మసూత్ర భాష్యం, ఛాందోగ్యోపనిషత్ తాత్పర్య దీపిక ... | కురుగంటి సుబ్రహ్మణ్యదైవులు (అద్వైతానంద తీర్థ) |
| 7. దాక్షిణ్య మర్యాలన (కావ్యం) సాంఖ్యమీమాంస, న్యాయాలపై మూడు ప్రాథమిక గ్రంథాలు. ... | కురుగంటి వెంకటరమణ శాస్త్రి. |

రామాయణంపై హరిపండితుడు,

మహేశ్వరతీర్థుడు వ్రాసిన వ్యాఖ్యానాలు ప్రశస్తమైనవి.

విజయనగరం, పిఠాపురం, గద్వాల, వనపర్తి వంటి కొన్ని సంస్థానాలు సంస్కృత విద్వాంసులను పోషించాయి. వీరిలో కొందరు పండితులు సంస్కృత సాహిత్యానికి అనన్యమైన సేవ చేశారు. పెక్కురు గంగ్రకర్తలు కావ్యాలు రచించారు. కాగా పండితరాజు మార్గగామి వంటివాడు. ఇట్టి గ్రంథకర్తలు దాదాపు 60 మంది వున్నారు. వీరిలో ధర్మసూరి, లొల్ల లక్ష్మీధరం పేర్కొనదగినవారు. ధర్మసూరి సాహిత్య రత్నాకరం అనే గ్రంథం వ్రాయగా లొల్ల లక్ష్మీధరం సాహిత్య లక్ష్మీధరం అనే గ్రంథం రచించాడు. వైజయంతీ విలాసం వ్రాసిన సారంగు తమ్మయ్య సంస్కృతంలో గ్రంథకర్త అయినట్లు ఆయన "హరిభక్తి సుధోదయం" అనే భక్తి ప్రధానమైన గ్రంథాన్ని రచించినట్లు కనిపిస్తున్నది.

మరో ముగ్గురు విఖ్యాత పండితులను గురించి చెప్పకుండా నేనీ వ్యాసం ముగించలేను. వీరిలో ఒకరు నారాయణ తీర్థుడు. ఈయన యోగీశ్వరుడు. భక్తి రసాత్మక గీతాలతో కృష్ణలీలా తరంగిణి అనే గ్రంథం వ్రాశాడు. జయదేవుని గీతగోవిందం తరువాత పేర్కొనదగిన ఉద్గ్రంథం ఇది. బహుశా దేవనాగరి లిపిలో ముద్రించబడక పోవడంవల్ల కాబోలు ఈ గ్రంథం సముచితమైన ప్రచారం పొందలేదు. దీని శైలి, ఇతర లక్షణాలు విలక్షణమైనవి. రెండవ వారు వాశిష్ఠగణపతి ముని. ఈయన తపస్వి, గొప్ప పండితుడు, భక్తుడు, వేదాంతి. ఉమా సహస్రం, వశిష్ఠవైభవం వంటి కొన్ని గ్రంథాలు తప్ప ఆయన గ్రంథాలు చాలావరకు అముద్రితాలే. మూడవ వారు అభినవ భారతి. అభినవగుప్తాచార్య, నాట్యశాస్త్ర సంచాలకుడు మానవల్లి రామకృష్ణకవి. ఈయన సంగీత, నృత్య, నాటక కళలపై భరతకోశం అనే విజ్ఞాన సర్వస్వం వంటి గ్రంథాన్ని వ్రాశాడు.

సంస్కృత భాషామతల్లికి ఆంధ్రులసేవ నేటికీ కొనసాగుతూనే వుంది. కాగా ఈ సందర్భంలో పేర్కొనదగిన ఇటీవలి గ్రంథం పండిత మల్లాది సూర్యనారాయణ శాస్త్రి విరచితమైన "సంస్కృత కవుల జీవితం."

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1964 జనవరిలో రాష్ట్రంలోని ఈక్రింద పేర్కొన్న గ్రామాలలో, సంస్థలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు:—

హైదరాబాదు జిల్లా: బుల్కాపురం, ఖండవెల్లి, భూగారం తాడ్‌పత్రి, ఎల్లంపేట, గిర్మాపూర్.

మెదక్ జిల్లా: రుద్రవర్ (హరిజనవాడ) అంతర్‌గాం (హరిజనవాడ), బూర్గుపల్లి, మన్నెవాగల్‌పూర్, మర్యాలపర్తి, మద్రెల్లి.

నిజామాబాదు జిల్లా: దార్‌పల్లి

ఆదిలాబాదు జిల్లా: ఈతెనపల్లి, సాంగ్వీ.

కరీంనగర్ జిల్లా: పోచంపల్లి, హసన్‌పూర్, పోతుగల్ - హసన్‌పూర్ శివారు - గట్టుబోతుకూరు, పొత్తారం, సుల్తాన్‌పూర్, సుందిళ్ళ

వరంగల్ జిల్లా: పొనకల్, చిటియాల్ (హరిజన కాలనీ).

మహబూబ్‌నగర్ జిల్లా: రేవల్లి.

శ్రీకాకుళం జిల్లా: కోనేరు, అర్తమూరు, పెదనాపల్లి, గంగుబిల్లి, రాపాక, కొంగరం.

విశాఖపట్నం జిల్లా: సూకవరం, సాగరం, గ్రెసెమవరం, రావిద, మురపాక, తోట పాలెం, ఎల్. కోట, కన్నూరు, కర్రివాని పాలెం, దిబ్బడి అగ్రహారం, పాతూరు, దబ్బిరాజుపేట, గుల్లపాలెం, ఫకీర్‌టెక్యా, గుడివాడ, వొమ్మటి జగన్నాధపురం, చందులూరు.

తూర్పు గోదావరి జిల్లా: చీడిగ, మాన్యంవారి పాలెం, కాట్రేవులపల్లి, పాతగ్గడ, బోయనపాడు, చింతలపల్లి-11.

గుంటూరు జిల్లా: గుమ్మారెడ్డిపాలెం.

నెల్లూరు జిల్లా: తాళ్ళూరు.

ఖమ్మం జిల్లా: మధిర మునిసిపాలిటీ, ప్రోయపట్నం (మహాదేవపురం), భద్రాచలం



# ప్రశ్నోత్తరావళి

*శ్రీ కగిట శ్రీరామమూర్తి,*
*నాగాయలంక, కృష్ణాజిల్లా.*

ప్రశ్న: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు చేనేతవృత్తిపదకోశ-నిఘంటువును ప్రచురించారా? ప్రతులు ఎక్కడ లభిస్తాయి?

సమాధానం: చేనేతవృత్తి పదకోశ నిఘంటువు ముద్రణ కాపీ పూర్తికా వచ్చింది. 1964 డిసెంబరుకు ముందు దీనిని వెలువరింప జేయడానికి ఏర్పాటు చేస్తున్నారు.

*శ్రీ బి. కేశవరెడ్డి, నాగారం, మంథెన తాలూకా, కరీంనగర్ జిల్లా.*

ప్ర. పోచంపాడు ప్రాజెక్టు కాలువ కరీంనగర్ జిల్లాలోని సుల్తానాబాదు తాలూకా వరకే తెస్తారా లేక గోదావరి, మానేరుల మధ్య ఉన్న మంథెన తాలూకా ప్రజలకు కూడా యీ కాలువవల్ల లాభం కలుగుతుందా? అయినతీరున మంథెన తాలూకాకు ఏ సంవత్సరంలో నీరు లభిస్తుంది?

సమా: గోదావరి దక్షిణ కాలువ నీరు మంథెన తాలూకాలోని గ్రామాలకు కూడా లభిస్తుంది. ఇవి కాలువ ఆఖరి ప్రాంతంలో ఉన్నాయి. పోచంపాడు రిజర్వాయరు పథకం రిపోర్టులో చేర్చబడిన కార్యక్రమం ప్రకారం యీ కాలువను 6సంవత్సరాలలో పూర్తి చేయాలని ప్రతిపాదించారు. కావున యీ ప్రాంతానికి నీరు లభించే నికరమైన తేదీని యీ దశలో తెల్పడం సాధ్యంకాదు.

*శ్రీ ఇరుకల్ల లక్ష్మీనరసింహారావు, పెంటలవారిగూడెం, కృష్ణాజిల్లా.*

ప్ర: ఒక వరిధాన్యం గింజలో రెండు బియ్యం గింజలు ఉండేరకం వరిని నేను చూచాను. యీరకం వరి సేద్యం లాభదాయకమా? పంట కాలం ఎంత? రాలుబడి ఎంత ఉంటుంది?

సమా: మీరు తెల్పిన యీ రకంవరిని టి. బి. ఇ. 1 అంటారు. దీనిరాబడితక్కువగా ఉంటుంది. (ఎకరానికి 1500పౌండ్ల నుంచి 2000పౌండ్లు.) అక్కుళ్ళమాదిరి దీని పంటకాలం 165రోజులు. భారీ ఎత్తున సాగుచేయడం లాభసాటి కాదు

---

(41 వ పేజీ తరువాయి)

పలకలు, పుస్తకాలు, మొదలయిన వాటిని ఉచితంగా అందజేసి, అధిక సంఖ్యలో యీ వర్గాలకు చెందిన పిల్లలను ఆకర్షించి, సమాజంలోని యితర వర్గాల పిల్లలతో సరిసమానంగా వారిని తీసుకురావడానికి ఎక్కువ ప్రయత్నాలు జరుగుతున్నాయి.

పట్టణ ప్రాంతాలలో నీటి సరఫరా, మురికి నీటిపారుదలకు సంబంధించిన పథకాలను గురించి ఆలోచిద్దాం. ద్వితీయ ప్రణాళికలో అసంపూర్తిగా వదిలివేయబడిన యీ పథకాలు యిప్పుడు పూర్తి కావస్తున్నాయి. దీనిక్రిందకు వచ్చే ముఖ్యమైన పథకాలు రెండింటిలో ఒకటి మంజీర నీటి సరఫరా పథకం, రెండవదివిశాఖపట్నం నీటిసరఫరా పథకం ఈ పనులు మందంగా జరుగుతున్నాయి. నీటిసరఫరా గొట్టాల తయారీకి అవసరమయ్యే ఎక్కువ బిరుసుగల ఉక్కును కొనడానికి రూ. 24 లక్షలకు పైగా విదేశమారక ద్రవ్యం కావలసివుంటుంది. ఈ కారణంగానే పనులు చురుకుగా సాగడంలేదు. అవసరమైన ఉక్కు లభ్యం కావడంతోనే పనులు త్వరత్వరగా పూర్తవుతాయి.

తెలంగాణా ప్రాంతంలో రెండుపట్టణకమిటీల అభిప్రాయం ప్రకారం రక్షిత మంచినీటి సరఫరా పథకాలకు 1964–65 సం. రానికి రూ. 0.50 కోట్లు కేటాయించబడ్డాయి. ఈ ప్రణాళికలో గ్రామీణ నీటి సరఫరా, పారిశుద్ధ్యం క్రింద కేటాయించిన రూ. 21.46 లక్షలు ద్వితీయ ప్రణాళికలో అసంపూర్తిగా వుండిపోయిన పథకాలను పూర్తి చేయడానికే వినియోగించబడతాయి.




## మీరూ అంగీకరిస్తారు



# టాటా-ఫిన్లే
# టీ

### సాటిలేని టీ!

### తాజా టీ
తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ
అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ
టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

## టాటా-ఫిన్లే టీ త్రాగండి;
## ఆనందము అందుకోండి!



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టీజ్ డార్జిలింగ్-సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్-వెండి రంగు ప్యాకెట్
షాన్-నీలి రంగు ప్యాకెట్




BI-TFN-5-TEL

# భారత ప్రగతి

## కేరళ

### పంచాయతీ కమిటీలు

రాష్ట్రంలోని 922 పంచాయతీలకు క్రొత్తగా ఎన్నికలు జరిగాయి. మొత్తం 7714మంది సభ్యులు క్రొత్త సంవత్సరాది నాడు పదవీ స్వీకారంచేశారు. వారిలో చాలా మంది తమ వార్డులలో గ్రామీణ వాలంటీర్ దళాల సహాయంతో నిర్వహించే ప్రజాహిత కార్యక్రమాలకు ప్రారంభోత్సవాలు చేసిన తరువాత తమ ఆఫీసులలోకి ప్రవేశించారు. రోడ్లు, చెరువులు, చిన్న వంతెనలు, కాలువలు, పెరుగుల గోతులవంటి అనేక కార్యక్రమాలకు ఆరోజు ప్రారంభోత్సవాలు జరిగాయి. డాక్టర్లు, బ్యాంకర్లు, వ్యవసాయదార్లు, న్యాయవాదులు, జర్నలిస్టులు, ఉపాధ్యాయులు, పరిశ్రమదార్లు, రాజకీయ నాయకులు మొదలైన జీవితంలో వివిధ రీతులకు చెందిన వ్యక్తులకు ప్రాతినిధ్యం వహించే పంచాయతీ అధ్యక్షులు, సభ్యులు ఆయా పంచాయతీల అధ్వర్యంలో ఏర్పాటు అయిన రక్షణ శ్రామిక బ్యాంకులలో 12 రోజుల శ్రమను విరాళంగా ఇవ్వడం ద్వారా ఇతర గ్రామస్థులకు వారు మార్గదర్శకులయ్యారు.

### రాకెట్లు

శాంతియుత ప్రయోజనాలకై గగన ఉపరితలాన్ని పరిశీలించే భారత రెండవ రాకెటును తిరువేంద్రం సమీపంలో తుంబా బేస్‌నుంచి జనవరి 8 వ తేదీన ప్రయోగించారు.

ఈ ప్రయోగానికై వాడబడిన రెండు దశల నిక్ అపాక్ రాకెటును అమెరికాకు చెందిన నాసావారు సరఫరా చేశారు. వారి సహకారంతోనే యీ ప్రయోగ కేంద్రాన్ని నెలకొల్పడం జరిగింది. శాంతియుత ప్రయోజనాలకై గగన ఉపరితలం శాస్త్రీయపరిశోధనలను ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలు కూడా తెలుసుకోవడానికివీలుగా యీప్రయోగకేంద్ర సౌకర్యాలను ఆదేశాల అధీనంలో ఉంచుతామని భారతదేశం చేసిన సూచనను అనుసరించి ఆరుగురు వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు యీ కేంద్రాన్ని సందర్శించి, రాకెటు ప్రయోగాన్ని తిలకించారు. జనవరి 12వ తేదీన మూడవ రాకెటును ప్రయోగించడంతో తుంబానుంచి రాకెట్లను ప్రయోగించే మొదటి దశ కార్యక్రమం పూర్తి అయింది. ఆ తర్వాత జనవరి 25వ తేదీన మాగ్నెటోమీటర్ పరిశోధనకై రాకెటును ప్రయోగించడం ద్వారా రెండవదశ కార్యక్రమం ప్రారంభించబడింది. తుంబా కేంద్రంనుంచి యీ కార్యక్రమానికి చెందిన రెండవ, మూడవ, నాలుగవ రాకెట్లను వరసగా జనవరి 27, 29 తేదీలలో ప్రయోగించారు.

### కవి జ్ఞాపక చిహ్నం

భారతదేశం అన్ని ప్రాంతాలలోని మళయాళీలకు జనవరి 15 వ తేదీ ఎంతో సంతోషదాయకమైన దినం. ఆ రోజు కాలీకట్‌కు దక్షిణాన దాదాపు 27మైళ్ళ దూరంలో ఉన్న తిరూరులోని తుంజాన్ పరంభూలో 16వ శతాబ్దానికి చెందిన ప్రసిద్ధ మళయాళ కవి తుంజాతు ఎళుత్తచ్చన్ గౌరవార్థం నిర్మించబడిన తుంజాన్ స్మారక భవనాలకు పంజాబు గవర్నరు శ్రీ పట్టంథాను పిళ్ళై ప్రారంభోత్సవం చేశారు. ఈ స్మారక భవనంలో రాష్ట్రప్రభుత్వం రెండులక్షల రూపాయల ఖర్చుతో నిర్మించిన మండపం, ఆడిటోరియం ఉన్నాయి.

### ట్రాన్స్‌ఫార్మర్ కర్మాగారం

కేరళ రాష్ట్రంలో ఎర్నాకులం సమీపంలోని అంకమాలెవద్ద ట్రాన్స్‌ఫార్మర్ కర్మాగారానికి భారతదేశంలోని జపాను రాయబారి డాక్టర్ కోటా మరుస్ డియారా ఫిబ్రవరి 12వ తేదీన శంకుస్థాపన చేశారు. కేరళ పారిశ్రామిక అభివృద్ధి సంస్థ యిది నిర్మాణాత్మకమైన సంఘటన. ఈ కర్మాగారంలో 1000 కి వా. మొదలు 50,000 కి వా. శక్తివంతమైన విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్లను ఉత్పత్తిచేస్తారు. ఈ ఉత్పాదక కృషికి జపానుకు చెందిన హిటాచి లిమిటెడ్ సంస్థనుండి తోడ్పాటు లభిస్తుంది.

రాష్ట్రంలోని 19 గ్రామీణ బ్లాకులలో రూ. 40లక్షల వ్యయంతో సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని అమలుపరచడానికి కూడా ఫిబ్రవరి నెలలో ప్రభుత్వం నిర్ణయించింది.

1964-65 సంవత్సరానికి రాష్ట్ర బడ్జెటులో రూ. 358 లక్షల రూపాయలు చూపించబడింది. ఎస్. టి. ఓ. లకు ప్రత్యేక సాయ తీలు కల్పించడానికీ, అనాథలకు సహాయం చేకూర్చడానికి బడ్జెటులో కేటాయింపులు చేయడం గమనార్హమైన అంశాలు. ఆరోగ్య కేంద్రాలను, ఆసుపత్రులను ప్రారంభించడం వంటి సాంఘిక భద్రతా చర్యలకు సొమ్ము కేటాయించడం పరోముఖ్యాంశం. వార్ధక్యపు పించనుల మంజూరీకి గరిష్ఠ వయః పరిమితిని 70 సంవత్సరాల నుంచి 65 సంవత్సరాలకు తగ్గించడానికి కూడా ప్రతిపాదించడం జరిగింది. బీదవారి గృహనిర్మాణానికై రూ. 4 లక్షల వ్యయంతో గృహనిర్మాణ పథకాన్నొకదానిని చేపట్టడానికి కూడా తలపెట్టబడింది. వచ్చే విద్యా సంవత్సరం నుంచి బడి పిల్లలకు ఉచితంగా పాఠ్యపుస్తకాలు సరఫరా చేయడానికి కూడా ఉద్దేశించబడింది.





ఇరాక్ ప్రభుత్వ ప్రణాళికాశాఖామంత్రి డాక్టర్ అబ్దుల్ కరీమత్ అఫీ హైద్రాబాదు వచ్చినప్పుడు 1964 ఫిబ్రవరి 25వ తేదీన గృహ పరిశ్రమల ఎంపోరియాన్ని సందర్శించారు.



క్రొత్త ముఖ్యమంత్రినీ కాంగ్రెసు శాసనసభా పార్టీ నాయకులనూ సన్మానించడానికి ఆంధ్ర ఫిల్మ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్‌వారు హైద్రాబాదులో 1964 మార్చి 9వ తేదీన జరిపిన సభలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫిల్మ్ పరిశ్రమకు సహాయ పడడానికి వాగ్దానం చేసినందుకు తమ కృతజ్ఞతలను వ్యక్తం చేశారు.



ఉగాది సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌర సంబంధాల శాఖ అధ్వర్యంలో హైద్రాబాదులో ప్రదర్శింపబడిన "భక్త రామదాసు" నాటకంలోని ముగింపు సన్నివేశం. పశ్చాత్తాపం చెందిన తానీషా విజయుడైన రామదాసుతో సంభాషిస్తున్న దృశ్యం.



వారంరోజుల పాటు జరిగిన సోవియట్ ఫిల్మ్ ప్రదర్శనోత్సవానికి రెవిన్యూమంత్రి 1964 ఫిబ్రవరి 21వ తేదీన హైద్రాబాదులో ప్రారంభోత్సవం చేశారు.



సోవియట్ చదరంగ చతురుడు హైద్రాబాదులో 1964 ఫిబ్రవరి 24వ తేదీన అనేకమంది స్థానిక చదరంగ నిపుణులతో చదరంగం ఆడారు.

1961–62వ సం॥ గుంటూరు జిల్లాలో ఉత్తమ గ్రామీణ రేడియో గోష్ఠిగా తంచవరం ఎన్నికైంది. పంచాయితీ ప్రెసిడెంటు కలెక్టరునుంచి స్ప్రేయర్లను బహుమతిగా పొందారు.

సంగీత పోటీలు.— కడపజిల్లాలో జరిగిన సంగీత నాటక సెమినారులో కడప శ్రీ రామకృష్ణ ఉన్నత పాఠశాల



ఎనమండుగురు పిల్లలను రక్షించిన స్త్రీ  నిజామాబాదు జిల్లా రెయినంపల్లి గ్రామంలో జనవరి 23 వ తేదీన కాలుతున్న మంటల్లోంచి ఎనమండుగురు పాఠశాలలకు వెళ్ళే పిల్లలను రక్షించిన శ్రీమతి సత్తెవ్వ (పూలమాల ధరించిన స్త్రీ)  ఈ మంటల్లోనుండి మరొక కుర్రవాడినికూడా బయటికి తీసుకొచ్చిందిగాని, ఆ కుర్రవాడు గాయాలవల్ల బ్రతకలేదు  మార్చి 27 వ తేదీన ఆ గ్రామంలో జరిగిన ఒక సమావేశంలో శ్రీమతి సత్తెవ్వ సాహసాన్ని కొనియాడడం జరిగింది  ప్రభుత్వం తరపున రూ 500 లు, సాంఘిక కార్యక్రమాల ఇండియన్ కాన్ఫరెన్సు తరపున రూ 501 లు బహుమతిగా ఆమెకు ఇవ్వడం జరిగింది.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు 1964 మార్చి 15వ తేదీన హైద్రాబాదులో ఫ్రెంచి అలంకార కళా ప్రదర్శనాన్ని ప్రారంభించారు. ఆ సందర్భంలో ఇండియాలోని ఫ్రెంచి రాయబారి శ్రీ ఎం. జీన్‌పాల్ గార్నీర్ ప్రసంగిస్తున్న దృశ్యం.

సమాజాభివృద్ధికి సంబంధించిన రాష్ట్ర శాసనసభా ప్రాథమిక సలహా సంఘం నాలుగవ సమావేశం 1963 మార్చి 2వ తేదీన హైద్రాబాదులో జరిగింది

## సంగ్రహ ప్రకటనలు

### బాలసాహిత్యానికి బహుమతులు

బాల సాహిత్యంలో నిర్వహించిన 9 వ పోటీకి ఉత్తమ గ్రంథాలు పంపిన దిగువ పేర్కొన్న గ్రంథకర్తలకు చెరి రు. 500/ల బహుమతిని ప్రభుత్వం ప్రకటించింది :— శ్రీరావెళ్ళ సూర్యనారాయణమూర్తి, సికింద్రాబాదు. "బొమ్మల బాల పంచతంత్రము" ; శ్రీ కె. బి. రెడ్డి, హైద్రాబాదు, "శబ్దము"

### అమ్మకం పన్ను మినహాయింపు

అన్ని పుస్తకాలు, పత్రికల అమ్మకంపై 1957 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకం చట్టం క్రింద చెల్లించ వలసిన అమ్మకం పన్నును ప్రభుత్వం మినహాయించింది. ఈ మినహాయింపు 1964 ఏప్రిల్ మొదటి తేదీ నుంచి అమల్లోనికి వచ్చింది.

### వసతి గృహాల్లో ఆహారపదార్థాలు, పానీయాల అమ్మకం

ఆంధ్ర ప్రదేశ్‌లోని విద్యాసంస్థలుగాని లేదా విద్యార్థి సంఘాలుగాని ఆయా విద్యాసంస్థల్లోని విద్యార్థుల వుపయోగార్థం నిర్వహిస్తున్న వసతి గృహాల్లో, కాంటీన్లలో ఆహార పదార్థాల, పానీయాల అమ్మకంపై అమ్మకపు పన్నును ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం మినహాయించింది.

### 58 రవాణా కంట్రోలుచట్టం

1964 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ వరి రవాణా కంట్రోలు చట్టాన్ని రాష్ట్రమంతటికీ తక్షణమే వర్తింపజేస్తూ ఆదేశించారు. దీనిని ఆంధ్ర ప్రదేశ్ గెజెటులో పునర్ముద్రిస్తున్నారు.

ఈ ఉత్తర్వు ననుసరించి కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి, గుంటూరు, వరంగల్, నిజామాబాదు, నెల్లూరు, మహబూబ్‌నగర్, మెదక్, కరీంనగర్, ఖమ్మం జిల్లాలనుంచి ఇతర జిల్లా ప్రదేశాలకు వరి ధాన్యం రవాణా చేయడం నిషిద్ధం. అయితే రాష్ట్ర ప్రభుత్వం లేదా ప్రభుత్వాధికారం పొందిన అధికారి జారీచేసిన పర్మిటువున్న సందర్భాలలో ధాన్యం రవాణాను అనుమతిస్తారు.

ప్రభుత్వం జరిపే రవాణాలకు, మిలటరీ క్రెడిట్ నోట్స్ మేరకు జరిగే రవాణాలకు, నిర్దిష్ట ప్రాంతంలోని ఒక జిల్లానుంచి ఆ ప్రాంతంలోని మరో జిల్లాకు జరిగే రవాణాలకు నిర్దిష్ట ప్రాంతంలోని ఒక స్థలం నుంచి మద్రాసు, మైసూరు, కేరళ లేక పాండిచేరీ యూనియన్ భూభాగం, లేక పాండిచేరీ ప్రాంతం, యూనియన్ భూభాగాలైన గోవా, డామన్, డయ్యూ భూభాగాలలోకి జరపబడే రవాణాలకు ఈ నిర్బంధం వర్తించదు.

### నాన్ ట్రేడింగ్ కంపెనీల చట్టం

ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ ఆంధ్ర ప్రదేశ్ నాన్ ట్రేడింగ్ కంపెనీల చట్టా (1962 వ సం. పు 2 వ చట్టం) న్ని ఆమోదించింది. భారత రాజ్యాంగం ఏడవ షెడ్యూలు 2 వ జాబితాలోని 32 వ ఎంట్రీ మేరకు ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి లక్ష్యాలు పరిమితమైనటువంటి నాన్ ట్రేడింగ్ కంపెనీలను స్థాపించడానికీ, క్రమబద్ధం చేయడానికీ, రద్దు పరచడానికీ ఈ చట్టం అవకాశం కల్పిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి లక్ష్యాలు పరిమితమైనటువంటి నాన్ ట్రేడింగ్ కంపెనీల విషయంలో హైదరాబాదులోని ఆంధ్ర ప్రదేశ్ కంపెనీల రిజిస్ట్రారు ఇక మీదట రిజిస్ట్రారుగా వ్యవహరించరు.

1962 వ సం. పు కంపెనీల చట్టం విషయంలో ఆంధ్ర ప్రదేశ్ రిజిస్ట్రేషన్, స్టాంప్స్ ఇన్‌స్పెక్టరు జనరల్ రిజిస్ట్రారుగా నియమించబడినారు. హైదరాబాదు—1 ముకర్రంజాహీరోడ్డులోని 5-4-398 నెంబరు భవనంలో 1963 ఏప్రిల్ 21 వ తేదీనుంచి ఆయన ఈ వ్యవహారాలు చూస్తున్నారు.

1962 వ సం. పు ఆంధ్ర ప్రదేశ్ నాన్ ట్రేడింగ్ కంపెనీల చట్టం 2 వ చట్టంలో నిర్వచించబడిన కంపెనీల విషయంలో 1956 వ సం. పు కంపెనీల చట్టం 25 వ సెక్షను క్రింద రాష్ట్ర ప్రభుత్వానికి గల అధికారాలన్నింటినీ ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల శాఖ ఉపకార్యదర్శికి సంక్రమింపజేశారు. అందుచేత లైసెన్సుకొరకు పెట్టుకునే దరఖాస్తులన్నింటినీ, కంపెనీల నిబంధనావళి 4 వ నిబంధనలో నిర్దేశించబడిన విధంగా పైన పేర్కొన్న అధికారికి పంపుకోవాలి.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి లక్ష్యాలు పరిమితమైనటువంటి అన్ని నాన్ ట్రేడింగ్ కంపెనీలు ఇప్పటి వరకు ఆంధ్ర ప్రదేశ్ కంపెనీల రిజిస్ట్రారు అధికార పరిధిలో వున్నటువంటివి లేక పైన ఉదహరించిన చట్టం క్రింద ఇటువంటి కంపెనీని నమోదు చేయదలచినఎవరైనా వ్యక్తి హైదరాబాదు-1 లోని ఆంధ్ర ప్రదేశ్ రిజిస్ట్రేషన్, స్టాంప్స్ ఇన్‌స్పెక్టరు జనరల్ కార్యాలయం (పో. బా. నెం. 137) లోని ఆంధ్ర ప్రదేశ్ నాన్

ట్రేడింగ్ కంపెనీల రిజిస్ట్రారుతో ఉత్తర ప్రత్యుత్తరాలు — జరపవచ్చు.

## బాలికలను వేధించే వారిపై కఠిన చర్యలు

స్త్రీలను, బాలికలను వేధించే దురల వాటును నిర్మూలించడానికి తీసుకునే చర్యలను గూర్చి ప్రభుత్వం జారీచేసిన ఒక ప్రకటన (ఆంధ్ర ప్రదేశ్, 64 ఏప్రిల్ సంచిక 53వ పుట చూ.) లో వివరించడం జరిగింది. నిందితుడు ప్రభుత్వోద్యోగి అయితే అతన్ని ఉద్యోగంనుంచి తీసివేయడం జరుగుతుంది. నిందితుడు విద్యాధికుడయిన ఉద్యోగి లేక నిరుద్యోగి అయినట్లయితే అతని పేరును ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషనుకు పంపి ప్రభుత్వ సర్వీసునుంచి అతనిని డిబార్ చేయాలని కోరడం జరుగుతుంది.

ప్రైవేటు వ్యాపారసంస్థలలోనూ పరిశ్రమలలోనూ అటువంటి నిందితులను ఉద్యోగంనుంచి తీసివేయడంకానీ, ఉద్యోగం ఇవ్వకపోవడం కానీ చేయాలని ఆంధ్ర ఛాంబర్ అఫ్ కామర్స్‌వారిని కోరడం జరిగింది. ఈ అసభ్యతను నిర్మూలించడంలో ప్రభుత్వంతో పూర్తిగా సహకరిస్తామని ఆ సంస్థ తన సంసిద్ధతను తెలియజేసింది. తదనుగుణంగా కార్మిక, మేనేజిమెంటు కమిటీతోనూ కార్యవర్గ కమిటీతోను సంప్రదించి ప్రభుత్వం సూచించిన మార్గాలలో అనువయిన చర్యలను యీ ఛాంబర్ అవలంబిస్తుంది. పై తెల్పిననేరానికి శిక్షించబడిన వ్యక్తుల ఉద్యోగ వివరాలను యజమానుల పేర్లను మధ్య మధ్య ఛాంబర్‌కు తెలియజేయడం జరుగుతుంది.

## జవానుల సంక్షేమం

జవానులు, నాన్ కమిషన్డ్ ఆఫీసర్ల యుక్తవయస్కులైన కొడుకులు, కూతుళ్ళకు వారి యోగ్యతకు తగిన ఉద్యోగాలు లభింపజేసే విషయంలో ఉద్యోగ సాధక కేంద్రాలు ప్రాధాన్యత ఇవ్వడానికి సంబంధించిన రాయతీని హోదాతో ప్రమేయం లేకుండా రక్షణ సిబ్బంది కొడుకులు, కూతుళ్ళందరికీ (యుక్తవయస్కులు) కూడా లభింపజేయడానికి ప్రభుత్వం ఉత్తర్వు చేసింది.

## పేర్ల మార్పుకు అనుసరించవలసిన విధానం

భారత పౌరులు తమ పేర్లమార్పు విషయంలో అనుసరించవలసిన విధానాన్ని నిర్దేశిస్తూ 1962 వ సం. పు భారత రక్షణ నియమావళి 34 వ నిబంధనలోని (2), (4) (సి) ఉప నిబంధనలను పురస్కరించుకొని, ఒక ప్రకటన 1964 మార్చి 4 వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటు ప్రథమభాగం 808, 809 వ నెంబరు పుటలలో ప్రచురించబడినదని ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో నివసిస్తున్న భారత పౌరులకు తెలియజేయబడుతున్నది. ఆ విధానాన్ననుసరించి తన పేరు మార్చుకో దలచిన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర వాస్తవ్యుడైన భారత పౌరుడు, అతను హైద్రాబాదు లేక సికింద్రాబాదు నగరంలో నివసిస్తున్నట్లయితే హైదరాబాదు పోలీసు కమీషనరు ద్వారా, ఇతర సందర్భాలలో అయితే తమ ప్రాంతానికి సంబంధించిన పోలీసు సూపరింటెండెంటు ద్వారా ప్రకటన అనుబంధం -1 లో పేర్కొన్న ఫారంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ హోం (ఎస్. సి) శాఖ కార్యదర్శికి ఒక నోటీసు ఇవ్వాలి.

దీని దృష్ట్యా అత్యవసర పరిస్థితి ప్రకటించబడిన తేదీ అంటే 1962 అక్టోబరు 26 వ తేదీన కానీ ఆ తరువాత కానీ పేర్ల మార్పుకై ఆయా వ్యక్తులు హైదరాబాదులోని ముద్రణశాల డైరెక్టరుకు దాఖలు చేసిన దరఖాస్తులను, పేర్లమార్పు నిమిత్తమై నిర్దేశించబడిన నోటీసు ఫారంలో పునరుద్ధరించవలసి వుంటుంది.

పై ప్రకటనకు లోబడి ప్రభుత్వ సంస్థలో కాని ప్రభుత్వం గుర్తించిన ఏదేని సంస్థలో కాని చదువుతున్న 18 సం. ల వయస్సు నిండనివ్యక్తులు పేర్ల మార్పుకు పైన తెలిపిన ప్రకటన వర్తించదు.

(1) వివాహిత స్త్రీ తమ భర్తపేరును వాడడానికి, (2) గ్రాంటు ఫలితంగాకాని, వారసత్వంవల్లకాని, హోదా లేక బిరుదుల ఫలితంగా కాని వచ్చిన పేర్లువాడకానికి (3) సంబంధిత సంస్థ అధిపతి వద్దనుండి పొందిన వయస్సును తెలిపే సర్టిఫికెట్టును అందజేసి విధానానికి లోబడి పై ప్రకటన నుండి మినహాయింపబడిన వ్యక్తులపేర్ల వాడకానికి మామూలుగా పేరుమార్పుకై ఆంధ్ర ప్రదేశ్ గజెట్‌లో ప్రకటించేందుకు అత్యవసర పరిస్థితి ప్రకటించ బడడానికి ముందు అమలులోవున్న పద్ధతుల ప్రకారం హైదరాబాదులోని ఆంధ్ర ప్రదేశ్ ముద్రణల డైరెక్టరుకు దరఖాస్తు చేయాలి.

## స్వర్ణకారులకు సర్టిఫికెట్లు

తహశీల్దార్లనుంచి ఆదాయపు సర్టిఫికెట్లు పొందడంలో స్వర్ణకారులకు చాలాఇబ్బంది కలుగుతున్నట్లుగా ప్రభుత్వం దృష్టికి వచ్చింది. అందుచేత ఆంధ్రప్రదేశ్ స్వర్ణకారుల పునరావససంఘం నమోదైన లేక పరిగణించబడిన స్వర్ణకారుల సంఘాలు లభింపజేసే వివరాల ప్రాతిపదికపై ఆదాయపు సర్టిఫికెట్లు జారీ చేయడానికి తహశీల్దార్లను ఆదేశించ వలసిందిగా సిఫార్సు చేసింది.

స్వర్ణకారులకు కలుగుతున్న యీ అసౌకర్యాన్ని నివారించే నిమిత్తం ప్రభుత్వం యీ సిఫార్సును ఆమోదించి నమోదైన లేక పరిగణించబడిన స్వర్ణకారుల సంఘాలు లభింపజేసే ఆదాయపు వివరాలను పరిగణనలోకి తీసుకొని తహశీల్దార్లు స్వర్ణకారులకు ఆదాయపు సర్టిఫికెట్లను జారీ చేయాలని ఆదేశించింది.

# వీరకంకణం

'భాను'

ఎవడురా వాడు ? దుర్నిరీక్ష్యమైన శాంతి పరివేషంలో
మలిన సంగ్రామ పాషాణాన్ని విసిరిందీ!
ఎవడా మ్రుక్కడి ? సౌభాగ్య సౌజన్యాల ప్రణాళికా డోలల్లో
నిదురిస్తున్న రౌద్రానికి వెన్నుపోటు పొడిచిందీ !

ఎవడా నాప ? భారతదేశ స్నాయువుల తంతులు
అనుచితంగా మీటి ప్రళయధ్వానులు ప్రయోగించిందీ !
ఎవడా క్రూరుడు ? పువ్వు రెక్కల చిరుగాలికి సంస్పందించే
అహింసాసీమ హృదయ నగరంపై కంచుపాదం మోపిందీ!

ఎవడా పరిహాస భాజనుడు ? కీర్తిని చుంబిస్తూ ఉన్నతంగా పెరుగుతున్న
పర్వత పాదతలంలో పెచ్చుతాడ గొడ్తున్న అవివేక చక్రవర్తి !
ఎవడు నాయనా ! వాడు ? ఎవడా చరిత్ర హీనుడు !
చరిత్ర పుటలు రక్త పంకిలం చేసిన పాపి యెవడు ?

వాడే ! వల్లపూసల నైవేద్యం కోరే కలియుగ రాక్షసుడు !
వాడే చైనా ! అమానుషత్వానికి మారుపేరు !
కనుక, భుజం భుజం కలిపి భుజంగంలా ఎగసి
గజం భూమి కూడా పోనీయకుండా పోరాడాలరా నాయనా !

నీ జన్మభూమి హర్షిస్తుంది ; నీ జన్మ తరిస్తుంది
కట్టుకో వీరకంకణం ! పట్టుకో ఖడ్గ భూషణం !

## ఆంధ్రప్రదేశ్ : గ్రామవాణి

సమాచార ప్రజాసంబంధాల శాఖ "ఆంధ్రప్రదేశ్" అనే మాస పత్రికను నాలుగు భాషలలో అంటే ఇంగ్లీషు, తెలుగు, హిందీ, ఉర్దూ భాషలలో ప్రచురిస్తున్నది. ఈ పత్రికలకు 20,000 పైగా సర్క్యులేషను వుంది. తెలుగు పత్రిక సర్క్యులేషను 11,000 పైగా వుంది. మన దేశంలో ఎక్కువ సర్క్యులేషను గల అధికార పత్రికల్లో యిది ఒకటి.

1964 జనవరి నుంచి ఈ శాఖ "గ్రామవాణి" అనే త్రైమాసిక పత్రికను గూడా ప్రచురించడం ప్రారంభించింది. ఇది గ్రామస్థుల రేడియో గోష్ఠులకు సంబంధించి వుంటుంది. పల్లెల్లోను, పట్టణాల్లోను, స్త్రీలు, పిల్లలు ప్రారంభించే రేడియో శ్రోతల సంఘాలకు ఈ పత్రికలు పంపబడతాయి.

— ముఖ్యమంత్రి (1964-65) బడ్జెటు ప్రసంగంనుంచి.

# పరిపాలనలో నైతిక విలువలకు ప్రాధాన్యత నిచ్చిన నిజమైన ఆదర్శ గ్రామీణ ప్రజానాయకుడు

# శ్రీ కుప్పుస్వామి చౌదరి కీర్తికి పతాకం

## అమూల్య పరిశోధన సర్వస్వం

ప్రాచీన భారతీయులు తాత్వికచింతన, సాహిత్యం, అలౌకిక విషయాల గురించి పట్టించుకొన్నంతగా లౌకిక విషయాలు చరిత్ర మొదలైన వాటిని గురించి శ్రద్ధవహించలేదు. దాని ఫలితమే మనకు ప్రామాణికమైన ప్రాచీనచరిత్ర లేకపోవడం. ఆంగ్లేయుల సాహచర్యంతో అనేక లౌకిక విషయాలతోపాటు చరిత్ర రచనపట్ల కూడా మనం శ్రద్ధవహించడం జరిగింది. అయినప్పటికీ అర్వాచీన చరిత్రలో అనేక విషయాలు చరిత్రకు ఎక్కకుండా నిలిచిపోయినవి. చరిత్రకు సమగ్రత చేకూరాలంటే ఏ ప్రాంతానికి ఆ ప్రాంతంవారు శ్రద్ధ వహించి, ఆ ప్రాంతానికి సంబంధించినసర్వ విషయాలను సేకరించి ప్రచురించడం అవసరం. ఇది వ్యయ ప్రయాసలతో కూడిన పని.

గుంటూరు మండలానికి చెందిన శ్రీ దరువూరి వీరయ్యగారు బహుళ వ్యయప్రయాసలను లెక్కించక పరిశ్రమించి గుంటూరు మండల సర్వస్వాన్ని సిద్ధపరిచారు. ఈ 'సర్వస్వం'లో చరిత్రకు మాత్రమేకాక, ఆధునిక విషయాలకుకూడా తగిన ప్రాధాన్యం లభించింది. అందుచేత ఇది గుంటూరుమండలం "గైడ్"గా కూడా ఉపయోగపడుతుంది.

పూర్వం బ్రిటిష్‌పాలకులు జిల్లాలసమగ్ర స్వరూపాన్ని చిత్రించే గెజిటీర్లను ప్రచురించేవారు. అటువంటి గెజిటీర్లు ప్రచురించని లోపం గుంటూరుజిల్లాకు చెందినంతవరకు యీ సర్వస్వం తీరుస్తుంది. ఇలాగే రాష్ట్రానికంతటికికూడా సర్వస్వం అవసరం. అటువంటి సర్వస్వ నిర్మాణానికిముందు మండల సర్వస్వాల నిర్మాణం ముఖ్యం. ఈ విషయంలో శ్రీ దరువూరి వీరయ్యగారు ఆదర్శమైన కృషి చేశారు.

లోగడ శ్రీ మాగంటి బాపినీడుగారు "ఆంధ్ర సర్వస్వం" ప్రచురించారు. కాని అది అప్పటి విస్తృత రాష్ట్రాని కంతటికీ వర్తించదు. దాని పరిధి పరిమితమైనది. ప్రస్తుత విశాల రాష్ట్రానికి అనుగుణమైన 'సర్వస్వం' నిర్మించడానికిముందు మండల సర్వస్వాల నిర్మాణం అవసరమని చెప్పనవసరంలేదు.

580 పేజీలకు విస్తరించిన ఈ సర్వస్వం ఇటీవల కాలంలో గుంటూరు మండలంలో అనన్య సాధారణ వ్యక్తిగా పేరెన్నికగన్న దీని కృతిపతి స్వర్గీయ కుప్పుస్వామి చౌదరి గారిని గురించిన పద్యాలతోను, వ్యాసంతోను ప్రారంభమైనది.

### ప్రాచీన చరిత్ర

గుంటూరు మండలం చరిత్ర కందని కాలంనుంచి నాగరికతతో వర్ధిల్లినది. పెద్ద గంజాం, అగ్నిగుండాల, తుమ్మలకుంటలో బయల్పడిన సమాధులు గుళ్ళు ఈ విషయాన్ని స్పష్టపరుస్తున్నవి. క్రీస్తుకుపూర్వమే ఈ ప్రాంతంపై బౌద్ధప్రభావం పడింది. అమరావతి, నాగార్జునకొండ, భట్టిప్రోలు స్తూపాలు వెలిసినవి. అమరావతికి సమీపంలోని ధాన్యకటకం రాజధానిగా శాతవాహనులు రాజ్యం చేశారు. శాతవాహన రాజుల అనంతరం వారిసామంతులైన ఇక్ష్వాకులు నాగార్జునకొండచెంత విజయపురి రాజధానిగా ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. విజయపురి ప్రాంతంలో మూడు సంఘారామాలు, ఆరు చైత్యాలు, అనేక స్తూపాలు కనబడినందున బౌద్ధసంస్కృతికి దీనిని కేంద్రంగా భావించవచ్చు. మొదట ఇక్కడి పర్వతానికి శ్రీ పర్వతమని పేరువుండేది. 2 వ శతాబ్దంలో నాగార్జునాచార్యుడు ఇక్కడ నివసించిన కారణంగా దీనికి నాగార్జునకొండ అని పేరువచ్చింది.

ఇక్ష్వాకులను ఓడించి క్రీస్తుశకం 280 ప్రాంతంలో పల్లవులు ఈ ప్రాంతాన్ని పాలించారు వీరు నాగార్జునకొండప్రాంతం బౌద్ధారామాలను ధ్వంసం చేశారు. ఆనంద గోత్రీకులైన కందరరాజులు చేజెర్ల రాజ

**నే చదివిన ఉత్తమగ్రంధం**

# మన చరిత్ర, సంస్కృతీ, సారస్వతాల పరమై సర్వతోముఖంగా అవతరించవలసిన "ఆంధ్ర సర్వస్వ" నిర్మాణానికి మార్గదర్శకం

## గుంటూరు మండల సర్వస్వం

కొత్త దేశపతిరావు

ధానిగా కొంత ప్రాంతాన్ని పాలించారు. ఇక్ష్వాకుల తర్వాత బృహత్పలాయనులు, పిమ్మట శాలంకాయనులు ఈ ప్రాంతాన్ని పాలించారు. విష్ణుకుండిరాజులు, చాళుక్యులు, గుంటూరు పల్లవరాజులు, నాదెండ్ల పాలకులు, పలనాటి హైహయరాజులు, వెలనాటి రాజుల పాలనలో విశేషాలు, గుంటూరు ప్రాంతీయ రాజుల ప్రభావం, మహమ్మదీయుల దండయాత్ర, యాదవ సామంత రాజుల కథ, రెడ్డిరాజుల పరిపాలన, శ్రీకృష్ణదేవరాయల ప్రభావం. మహమ్మదీయుల పాలన, ఈస్టిండియా కంపెనీరాక, జమీందారుల పాలన మొదలైన విషయాలతో 1812 సంవత్సరం వరకు గుంటూరుప్రాంత చరిత్రను సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ కొత్త భావయ్య చౌదరిగారు సుదీర్ఘ వ్యాసంలో ప్రామాణికంగా వివరించారు.

విశ్వబ్రాహ్మణ రాజరికం గురించి శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు అనేక విశేషాలను 'పెదోటచరిత్ర' వ్యాసంలో తెలియజేశారు.

గుంటూరు మండలంలో ప్రధాన పాలక వంశాలుగా ప్రసిద్ధిచెందిన వాసిరెడ్డి, మానూరు, మాల్రాజు, మాణిక్యాలరావు వంశపాలకుల విశేషాలను శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణ పంతులుగారు "గుంటూరు మండలమున ప్రధానపాలక వంశములు" అనే వ్యాసంలో తెలిపారు, శ్రీ సూర్యనారాయణగారే "గుంటూరు మండలమున ప్రధాన కేంద్రాల చరిత్ర" అనే పేరుతో గుంటూరు నామోత్పత్తి, గుంటూరు పట్టణంలో వివిధ స్థలాల విశేషాలు, సత్తెనపల్లి, పల్నాడు, వినుకొండ, నరసరావుపేట, చేజెర్ల, ఒంగోలు, బాపట్ల, రేపల్లె, తెనాలి మొదలైన ప్రధానకేంద్రాల చరిత్రను విపులీకరించారు.

"తెలుసుకోవలసిన విషయాలు" అనే శీర్షికక్రింద వివిధ గ్రంథాలనుంచి గుంటూరు మండలానికి సంబంధించిన విశేషాలను తెలిపే వ్యాస భాగాలను ప్రచురించారు.

ఆంధ్రదేశ చరిత్రలో కొండవీటి సామ్రాజ్యానికి ఒక ప్రత్యేక స్థానం వున్నది. ఆ సామ్రాజ్య చరిత్రను శ్రీ కోన వెంకటరాయశర్మ "కొండవీటి సామ్రాజ్యము" అనే వ్యాసంలో వివరించారు.

"ఆంధ్ర ప్రజానీకానికి నాగార్జునకొండ ఎక్కడున్నదో అచట దొరుకుతున్న శిధిలాల శేషాలు యెట్టివో తెలుసు. కాని ఆ ప్రదేశానికి ప్రఖ్యాతి చేకూర్చిన మహనీయుని (నాగార్జునుని) చరిత్రకాని, కృతులు కాని, ఆతని భావాల విలువకాని, తత్ప్రబుద్ధదేశనామాలు కాని, తత్ప్రతిపాదిత నవ్యప్రపంచ సమస్యా పరిష్కార మార్గాలు కాని, ఆంధ్రులకు తెలియవు" — ఆర్యనాగార్జుని తాత్విక దృక్పథాన్ని గురించి, అది నేటి ప్రపంచానికి చూపుతున్న మార్గాలను గురించి సుప్రసిద్ధ కథకులు, తత్త్వవేత్త, సాహిత్య విమర్శకులు, నవలాకర్త అయిన డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు "యుగయుగాల నుండి భావప్రపంచాన్ని ఉర్రూతలూపుతున్న నాగార్జునుడు" అనే విశిష్టవ్యాసంలో వివరించారు. వ్యాసం 16 పేజీలను మించకపోయినప్పటికి ఆర్యనాగార్జున ప్రబోధాలను తెలుసుకొనడానికి అధికంగా తోడ్పడుతుంది; నాగార్జునుని గురించి మరింత తెలుసుకోవాలనే ఆసక్తి కలిగిస్తుంది.

అలాగే "అమరావతీ శిల్పసౌందర్యం" అనే మరొక ఉత్తమవ్యాసం కూడా దీనిలో వున్నది. దీని రచయిత ఆంధ్రులకు సుపరిచితులైన నార్ల వెంకటేశ్వర రావుగారు. ఆయన ప్రతిభను గురించి, రచనా వైశిష్ట్యాన్ని గురించి నేను చెప్పబూనడం సూర్యుని దివిటీపెట్టి చూపడమే కాగలదు. అమరావతి, నాగార్జునకొండ శిల్ప సౌంద

ర్యాన్ని సామాన్య పాఠకుడు కూడా అర్థం చేసుకొనగల విధంగా శ్రీ నార్ల వారు వివరించారు. ఒక్కొక్క శిల్ప విశేషాన్ని చెప్పడానికి ఆయన ఎన్నో ప్రమాణాలను చూపించారు. అమరావతి కళాఖండాలవలె నార్ల వారి వ్యాసం ఒక కళాఖండం.

"దావులూరు దేవాలయ శాసనాలు" గురించి శ్రీ ఎన్. రామేశన్‌గారు ఆంగ్లంలో వ్రాసిన వ్యాసాన్ని అనువదించి దీనిలో ప్రచురించారు. గుంటూరు మండలంలో ఎన్నో ప్రసిద్ధ దేవాలయాలు వున్నాయి. మాచెర్ల దేవాలయం, బెల్లంకొండ శ్రీ మల్లేశ్వర స్వామి దేవాలయం, అమరావతి అమరేశ్వర దేవళం, దుర్గి దేవాలయం, కోటప్ప కొండక్షేత్రం, మంగళగిరి క్షేత్రం, కాకాని శ్రీ మల్లేశ్వర మహాస్థలం, చేజర్లక్షేత్రం, సంగమేశ్వర దేవాలయం — ఈ పవిత్ర స్థలాల మహత్మ్యాన్ని గురించి, ఉండవల్లి గుహలు, కోహినూరు వజ్రం లభించిన రత్నగర్భ "కోళ్ళూరు" గురించి సంక్షిప్తంగా తెలియ పరిచారు.

స్వాతంత్ర్య సమర సమయంలో బ్రిటిష్ పాలకులకు భీతావహం కలిగించిన ఉద్యమాలు కొన్ని ఉన్నాయి. "అటువంటి వానిలో ఆంధ్ర దేశములోని మన్య ప్రాంతములో శ్రీ అల్లూరి సీతారామరాజు సాగించిన యుద్ధం ఒకటి. అటువంటిదే శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వాన శాంతియుతంగా జరిగిన పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమము." ఆ ఉద్యమం గురించి శ్రీ వీరయ్య చౌదరిగారి డైరీ ఆధారంగా వ్రాసిన వ్యాసం, "గోపాలకృష్ణుని చీరాల — పేరాల మహోద్యమం" గురించి శ్రీ గుమ్మడిదల వెంకట సుబ్బారావుగారు వ్రాసిన వ్యాసం, "గుంటూరు మండల జాతీయోద్యమం," గురించి శ్రీ విష్ణుభొట్ల సూర్యనారాయణగారి వ్యాసం, "ప్రజోద్యమాల" గురించిన ఆచార్యరంగా గారి వ్యాసం, గుంటూరు జిల్లా వివిధ రంగాలలో ఎలా ముందు నిలబడిందో, ఎంతగా చైతన్యంతో వ్యవహరించిందో వివరిస్తున్నవి.

గత రెండున్నర దశాబ్దాలలో తాను కాంగ్రెస్‌లో, రైతు, కూలి, చేనేత, యువజన, విద్యార్థి ఉద్యమాలలో సేవాదళ్‌లో తాను నిర్వహించిన పాత్రను పురస్కరించుకొని ఈ గుంటూరు "మండలసర్వస్వ" సంపాదకులు శ్రీ చిరువూరి వీరయ్యగారు "నేను — నా జీవితం" అనే వ్యాసంలో జాతీయోద్యమానికి సంబంధించిన విశేషాలను, యువజనులపై జాతీయోద్యమ ప్రభావాన్ని తెలియపరిచారు.

"పరిపాలనలో నైతికవిలువలకు ప్రాధాన్యం ఇచ్చిన శ్రీ కుప్పుస్వామి చౌదరి". అనే ఆచార్యరంగా గారి వ్యాసం "విశిష్టమైనది. రైతు నాయకుడైన ఆచార్యరంగా ఆదర్శ గ్రామీణ నాయకు"ని గురించి వ్రాయడం ఎంతో సమంజసంగా వున్నది.

"ఆదర్శ శ్రమజీవి — చేనేత శిల్పిఅందె సుబ్బారాయుడు", "పంచాయతీల ప్రభువు పంగులూరి నరసింహారావు", "సేవాత్యాగములే జీవిత పరమార్థంగా ఎంచిన పాటిబండ్ల సీతారామయ్య", "ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య", "శనగపల్లి రామస్వామి గుప్త", "వితరణశీలి", "విద్యాపోషకుడు యార్లగడ్డ రామనాధబాబు" "సాహితీ పోషకుడు, సహృదయుడు ఏకాంజనేయులు", "వైజ్ఞానికవేత్త, సహృదయుడు వల్లభ జోస్యుల సుబ్బారావు", "సమాజ శ్రేయస్సుకై సాహితీ కృషి సాగించిన మహా రచయిత త్రిపురనేని గోపీచంద్" మొదలైన వ్యాసాలు ప్రసిద్ధ వ్యక్తుల విశిష్టతను చాటుతున్నవి.

సాహిత్య, సంగీత, నృత్య, నాటకాది బహుళరంగాలలో కృషిచేస్తున్న "ఆంధ్ర సంసత్", గుంటూరు సాహిత్యోద్యానంలో పెంపెనలారు 'యు. ర. న., 'స. సా. స.' లతానికుంజాలు, 'విజ్ఞానవర్ధనీ పరిషత్', 'జ్యోత్స్న సమితి', 'భారతీయ రచయితల సమితి', 'పట్టణ హిందీ ప్రేమీమండలి', 'జైహింద్‌క్లబ్', 'జాతీయ విజ్ఞానసమితి', 'త్యాగబ్రహ్మ గానసభ', 'కోటరీక్లబ్', 'లయన్స్‌క్లబ్' మొదలైన సాంస్కృతిక, సంఘసేవాసంస్థల గురించి శ్రీ బందా రామమోహనరావుగారు తమ వ్యాసంలో వివరించారు. "ఆంధ్ర నాటకరంగంలో ముందంజవేసిన గుంటూరు మండలము" అనే వ్యాసంలో శ్రీ మందపాటి రామలింగేశ్వరరావుగారు గుంటూరుజిల్లా రంగస్థల విశేషాలు తెలిపారు.

గుంటూరు మండలంలోని వర్తమాన రచయితలు, కవులు, కళాకారులను గురించి 50 పేజీలకుపైగా సమాచారం యివ్వబడింది. వారి వారి జన్మస్థలం, వయస్సు, వృత్తి, రచనలు, అభిరుచులు, ప్రస్తుతం వుంటున్న ప్రదేశం మొదలైన వివరాలు ఇందులో వున్నవి. సాధ్యమైనంతవరకు రచయితల, కవుల, కళాకారుల ఫొటోలు కూడా ముద్రించారు. "మండల కవిత్రయం" అనే శీర్షికక్రింద శ్రీ పెద్ది సత్యనారాయణ గారు, శ్రీ తుమ్మల సీతారామమూర్తి, శ్రీజి. జాషువా శ్రీ ఏటుకూరి వెంకటనరసయ్య కవిత్వ, ప్రతిభా విశేషాలను వివరించారు.

గుంటూరు జిల్లా గ్రంథాలయోద్యమం గురించి లోకల్ లైబ్రరీ అథారిటీ అధ్యక్షుడు శ్రీ శరణు రామస్వామిచౌదరి, శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు కలిసి వ్రాసిన వ్యాసం, గుంటూరుజిల్లా చేనేత ఉద్యమం గురించి

శ్రీ అక్కుల కోటయ్య వ్రాసిన వ్యాసంకూడా పేర్కొనదగినది.

"ప్రముఖ వ్యక్తులు" అనే శీర్షికక్రింద వివిధ రంగాలలో పనిచేసిన, చేస్తున్న ప్రసిద్ధులనుగురించి విపరింపబడింది. వ్యక్తిగతమైన అభిప్రాయ భేదాలు వున్నా, ఈ శీర్షికలో యింకా కొందరు ప్రసిద్ధ వ్యక్తులను విడిచిపెట్టకుండా వుంటే బాగుండేది.

"గుంటూరు మండలం - నేటి సాంఘిక చరిత్ర'' శీర్షికక్రింద జిల్లా భౌగోళిక పరిస్థితి, తాలూకాలూ, జనసంఖ్య, వివిధ పంటలు పండుతున్న భూముల విస్తీర్ణం, వర్షపాతం, వ్యవసాయ పరిశోధన సంస్థలు, సహకార సంస్థల అభివృద్ధి మొదలైన వివరాలను యివ్వడం జరిగింది. ఎక్కడ అవసరమైన ఫొటోలను అక్కడ ప్రచురించడంతో "సర్వస్వాని"కి మరింత నిండుదనం వచ్చింది. ఇట్టి ఉత్తమ సర్వస్వాన్ని రూపొందించిన శ్రీ దరువూరి వీరయ్యగారు దీన్ని ముచ్చటగా ప్రచురించడానికి సర్వ విధాలా సహాయపడిన వదాన్యులు శ్రీ జాగర్లమూడి చంద్రమౌళిగారు ప్రశంసనీయులు.

యింత ఉత్తమ సంపుటాన్ని

వలచివచ్చిన గౌరవమును మెచ్చితి కాని
పదవికై తంత్రముల్ పన్నఁబోవు
అది ప్రజాసేవగా నరసి దన్పితి కాని
యధికారమనుచు నహంతగనవు
ఈర్ష్యాళువులపట్ల హితమ కోరితికాని
మచ్చరించుట కెన్నఁ డిచ్చపడవు
తెరువు తప్పినవాని దిద్దితీర్చితికాని
కడుపుపైఁ గొట్టబెన్నఁడు నెఱుఁగవు
గర్తపురమండల నిరాఘాటగరిమ
నేలినన్నాళ్ళు నీ వొకయించి వేల్పు
నటుల పాలితహృదయమ్ము నాఁచికొంటివి

అని ప్రశంసితులై

తాతముత్తాతలు దాఁచియిచ్చిన మేటి
కలిమితో నడవడి బలిమితోడ
అన్యయశ శ్రీదత్తమై రాచసిరిగుల్కు
కీవితోసరిలేని యావితోడ
దిగ్దంతులగువారు తెలతెలఁబోవు వి
ద్వత్తతోఁ బ్రతిభామహత్తుతోడ
కనిరాజ పండితాఖండల శ్రేయోను
రక్తితో దృఢ భక్తితోడ
నొక తెలుగునాటికేకాక సకల దక్షి
ణాపథమ్మునకును మాపు డాపులేని
రాణతెచ్చిన కర్షక ప్రభుని నిన్నుఁ
జెప్పి యొరుఁజెప్పవలెఁగదా!

అని ప్రస్తుతించబడిన శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిగారికి అంకితం యివ్వడం బంగారానికి తావి అబ్బినట్లు అయినది

శ్రీ కుప్పుస్వామిగారు లేకుండా ఒక రకంగా గుంటూరుజిల్లా చరిత్ర, మరొక రకంగా ఆంధ్రదేశ చరిత్ర లేదనే చెప్ప వచ్చు. ఆయన ఒక అసాధారణమైన, విశిష్ట మైన వ్యక్తి, నోరులేని లక్షలాది రైతు జనానికి ఆయన ప్రతినిధి. రైతుల కష్ట సుఖాలంటే ఆయనకు కరతలామలకం, రైతు అంటేనే పంచప్రాణాలు. గ్రామాల అభివృద్ధి జరిగిననాడే దేశం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంటుందని భావించేవారు, వాదించేవారు ఒకప్పుడు ఒంగోలుకరువుకు గొడ్డు గోదా తోలుకొని రైతులు వలస వస్తుంటే ఆ పశువులను చూచి అక్కడక్కడే దారిలోనే గడ్డి గాదం కొని పశువులకు వేయించిన ఘట్టాలువున్నవి. చీరాల తుఫానుకు బీదా సిక్కిని అస్నదానంతో రోజుల తరబడి ఆదుకొన్నప్పుడు అప్పటి శాసన సభలో ప్రభుత్వ సభ్యులు ప్రసంగిస్తూ ఇంత త్యాగనిరతి, దాతృత్వబుద్ధిగల కుప్పుస్వామి మన శాసన సభలో సభ్యుడుగా వుండడం శాసన సభకే గౌరవమని శ్లాఘించిన రోజులున్నవి.

శ్రీ కుప్పుస్వామి జిల్లా బోర్డు ప్రెసిడెంటుగా వుండగా ఎన్నోరోడ్లు, బ్రిడ్జీలు, పాఠశాలలు వెలిశాయి. సొంతంగా ఎన్నో ధర్మ సంస్థలను ఏర్పాటు చేశారు, వారి ఆదరణ పొందని కవిపండితులు లేరు. ఎన్నెన్ని ఉత్తమ గ్రంథాల ముద్రణకు ఆయన ఔదార్యం ఉపయోగపడిందో! వారి రాజకీయాలు తమాషాగా వుండేవి. ఎంత శత్రువైనా సులభంగా మిత్రునిగా మార్చుకొనేవారు. శత్రువును సాధించుదామనే మాట ఆయన నిఘంటువులో లేదు. ఆయన జిల్లా బోర్డు పరిపాలనలో ఉద్యోగులు, ఉద్యోగినులు - అందరూ ఆయనను గౌరవించేవారు ఆయన నైతికశక్తికి కైమోడ్చేవారు, అందువల్లే కాబోలు ఎం.ఎల్. సిగా ఎన్నికయ్యే సందర్భంలో నాటి ప్రజలు కుప్పుస్వామిని "పీడ"గా భావించలేదు. ఆయనకు వేసే ప్రతి ఓటూ దేవుని ఓటుగా భావించారు. ఆయన మొదట ఎన్నికల ఖర్చు గ్రామాలకు ఆ రోజుల్లో కార్డులు వ్రాసినందుకైన ఖర్చు మాత్రమే. రెండవ ఎన్నికల ఖర్చు ఏ నాలుగైదు వందలలో అయి వుంటుంది. ప్రజలలో ఆయనంటే అంత గౌరవం వుండేది.

అన్నట్లు ఆ రోజుల్లో గొప్ప ఆర్థికశాస్త్రవేత్త, మహాపండితుడు అయిన శ్రీ శంకర లింగగౌడ (ఎం.ఏ.) అనే వారు మైసూరులో వుండేవారు. ఆయనను పిలిపించి గుంటూరు మండల చరిత్రను ఒక బృహద్గ్రంథంగా ఇంగ్లీషులో వ్రాయించి, ప్రకటించిగుంటూరు మండల సర్వస్వ రచనకు కారకులుగా శ్రీకారం చుట్టిన కుప్పుస్వామిచౌదరి గారికి శ్రీ వీరయ్యగారు ఈ గుంటూరు మండల సర్వస్వాన్ని అంకితమివ్వడం ఎంతో సముచితంగా వున్నది. శ్రీ నార్ల చెప్పినట్లు ఇంత ఉత్తమ గ్రంథాన్ని రూపొందించిన శ్రీ వీరయ్యగారికి ఒక్క గుంటూరు మండలమే కాక, యావదాంధ్రము ఋణపడి ఉన్నది. ఇంతగా పరిశ్రమ చేసిన శ్రీ వీరయ్యగారే "ఆంధ్రసర్వస్వ" నిర్మాణానికి పూనుకుంటారని ఆశిస్తున్నాము. ★

---

## గుంటూరు మండల సర్వస్వం

[రివైజ్డ్ ఎడిషన్]

సంపాదకుడు : దరువూరి వీరయ్య

వెల సాధా ప్రతి : 12 రూపాయలు

మేలు ప్రతి . 15 రూపాయలు

ప్రతులకు : యువకర్షక ప్రచురణలు, గుంటూరు.

# ఇదీ యథార్థం

ఏ సెటిల్మెంటు
ఎప్పుడో జరుగవలసింది

మన రాష్ట్రంలో పోయినదఫా జరిగిన భూమిశిస్తు సవరింపు 1931-32లో, ఆ తరువాత 1939లో సెటిల్మెంటు విధానాన్నే ప్రభుత్వం పూర్తిగా రద్దు చేసింది. కాగా ఇప్పటి అదనపు శిస్తు 30 ఏండ్ల తరువాత వచ్చిందన్నమాట.

1939లో సెటిల్మెంటు విధానాన్ని రద్దు చేసి ఉండకపోతే ఆంధ్ర జిల్లాలన్నింటిలో భూమిశిస్తు ఎక్కువగా పెరిగి ఉండేది. ఎందుకంటే, 1955 లో, అంతకు ముందు 20 సంవత్సరాల కాలంలోని సగటు ధరలు ఆధారంగా లెక్కగట్టి చూస్తే, పూర్వపు సెటిల్మెంటు జరిగినప్పటికంటే 100కి 154 నుండి 326 వరకు శిస్తు రేటు పెంచవలసి వచ్చేది. 1962లో 400 వరకు పెరిగేది. భూమి శిస్తు లోగడ తాత్కాలికంగా కొంత పెరిగింది. వ్యవసాయ పంటల దిగుబడి, ధరల దృష్ట్యా చూస్తే యీ పెరుగుదల కొద్దిమాత్రమే. వ్యవసాయ పంటలదిగుబడి, ధరలు ప్రధానంగా రైతులకే లాభించాయి.

శిస్తు ఎంత పెరిగింది ?

అదనపుభూమిశిస్తు చట్టం అమల్లోకి రాక ముందు, భూమిశిస్తు మీద మొత్తం రాబడి రు. 826.71 లక్షలు. ఈ చట్టంవల్ల ఇది రు. 1,307.56 లక్షలకు పెరిగింది. అంటే పెరిగినశిస్తు రు. 480.85లక్షలు-58 శాతం. గోరంతను కొండంతగాకొందరుచెప్పుతున్న సంఖ్యలు యథార్థాలు కావు.

మూడు పన్నులు పోయాయి

1962 జులై 1వ. తేదీనుండి అదనపు భూమిశిస్తుచట్టం అమల్లోకి వచ్చింది, అంతకు ముందు భూమి శిస్తుమీద సర్ చార్జీ, వ్యాపార పంటలమీద ప్రత్యేకశిస్తు, అదనపు మాగాణి శిస్తు అని రకరకాలపన్నులుండేవి. ఈచట్టం అమలు పరచడంతో ఆ పన్నులన్నీ రద్దు అయినవి.

ప్రణాళిక రైతుల కోసమే

మన పంచవర్ష ప్రణాళికలు వ్యవసాయ ప్రాధాన్యంగలవి. మూడో ప్రణాళికలో వ్యవసాయ కార్యక్రమాలకు సవరించిన కేటాయింపు రు 79.84 కోట్లు. సేద్యపు నీటి పారుదల, వరద నివారణ పథకాలకోసం రు. 75.33 కోట్లు కేటాయించారు. సవరించబడిన మూడోప్రణాళిక మొత్తం వ్యయం రు. 312.66 కోట్లలో ఇవి 49.6 శాతం. అంటే ప్రణాళికా పథకాలవల్ల ముఖ్యంగా ప్రయోజనం పొందేది రైతులే.

ఆర్థిక వనరులలో కొరత

ఆంధ్ర ప్రదేశ్ మూడవ పంచవర్ష ప్రణాళిక మొత్తం వ్యయం రు. 312.66 కోట్లలో కేంద్రప్రభుత్వ సహాయంద్వారా లభించేది రు. 203.06 కోట్లు. మన రాష్ట్రం భరించవలసినది రు. 109.06 కోట్లు. మనభాగం మనం సమకూర్చుకోవాలంటే అదనపు పన్నులద్వారా రు. 53 కోట్లవరకు సాధించుకోవాలి. ఇంతవరకు తీసుకున్న అన్నిచర్యల ద్వారాకూడా యింతమొత్తం రాలేదు. ఇంకా రు. 4 కోట్ల కొరతవుంది. ప్రణాళిక కొనసాగాలంటే యీ లోటును మనమే భర్తీ చేసుకోవాలి. మరెవరూ వచ్చి మనలను ఆదుకోరు.

బంజరు భూములు

భారత దేశంలోని యితర రాష్ట్రాలన్నింటి కంటె ఎక్కువగా ఆంధ్ర ప్రదేశ్ లోనే భూమిలేని పేదవారికి బంజరు భూముల పంపిణీ జరిగింది. *ఇంతవరకు 21 లక్షల యకరాలు పంచబడినవి.* దీనివల్ల 4,47,000 భూమిలేని నిరుపేద కుటుంబాలకు లాభం చేకూరింది.

1960 మే నెలలో బంజరు భూముల పంపిణీకి ఉద్యమస్థాయిలో ప్రభుత్వం ఒక ప్రత్యేక కార్యక్రమాన్ని అమలు పరిచింది. ఆ సందర్భంలో 9,78,379 యకరాలబంజరు భూమి పేదవారికి పంచబడింది. మన సైనికులు యుద్ధరంగంనుండి తిరిగి వచ్చిన తర్వాత వారికి యివ్వడంకోసం బంజరు భూములను ప్రత్యేకించడానికై, పంపిణీ తాత్కాలికంగా ఆపుచేయబడింది. చైనావాడు మన సరిహద్దుల్లో ఇంకా పొంచి ఉన్నాడు. మన వీర సైనికులను మనం ఇంతలోనే మరచిపోగలమా ?

ఉదారంగా శిస్తు రెమిషన్

ఒకే విధానంతో, ఉదారంగా శిస్తు రెమిషన్ మంజూరు చేయడానికి ఉద్దేశించిన నూతన నిబంధనలను ప్రభుత్వం తయారు చేసింది.

మన రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం. రాష్ట్రాభివృద్ధికి రథసారథులైన రైతుల ప్రాధాన్యాన్ని ప్రభుత్వం గుర్తిస్తున్నది. ప్రణాళికలలో జరిగే కేటాయింపులే దీనికి నిదర్శనం. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో రైతులే ప్రధానపాత్ర నిర్వహించాలి.

ఇంకా శత్రువు తొలగి పోలేదు.
అత్యవసర పరిస్థితి అలాగే ఉంది.
మనం ఐక్యంగా ఉండాలి.



# ప్రభుత్వ నిర్ణయాలు

* రాజమండ్రిలోని ఆంధ్రా కాగితంమిల్లును జాయింటు స్టాక్ కంపెనీగా మార్చడం జరుగు తుంది. ఇందులో రాష్ట్ర ప్రభుత్వానికి 33⅓ శాతం సమానవాటాలు ఉంటాయి.

* అనువయిన షరతులతో ప్రభుత్వానికి ఎటువంటి నష్టమూ రానితీరున ఆజంజాహి మిల్లులో ఉన్న 36 శాతం వాటాలను ప్రభుత్వం వదలుకుంటుంది.

* పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల ఉద్యోగులకు సడలించిన పింఛను నిబంధనలను వర్తింప జేస్తారు. అదనపు వ్యయంలో 50 శాతం మొత్తాన్ని ప్రభుత్వం భరిస్తుంది.

* కేంద్ర, రాష్ట్ర గిడ్డంగిసంస్థలలోని గిడ్డంగి సౌకర్యాలను పొగాకు, ఉన్ని నిలువలకు కూడా విస్తరింప జేస్తారు.

* ఎయిడెడ్ కళాశాలలకు గ్రాంట్ల మంజూరీకి సంబంధించి, డాక్టర్ డి. ఎస్. రెడ్డి నాయకత్వం క్రింద నియమించబడిన సంఘం చేసిన సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించింది. ఈసంఘం సిఫార్సులలో ముఖ్యమైనవి ఇవి : కళాశాల అధ్యాపకులకు యు. జి. సి. స్కేళ్ళ ప్రకారం జీతాలివ్వాలనీ, వేతనాలతో సహా పరిపాలనా వ్యవహారాలకు జరిగే వ్యయం లోటులో 100 శాతం మొత్తాన్ని ప్రభుత్వం భరించాలనీ ఈ సంఘం సిఫార్సు చేసింది. సైన్స్ సాధన సామగ్రి నిమిత్తం యు. జి. సి. గ్రాంట్లు పొందని కొత్త కళాశాలలకు ప్రయోగశాల సాధన సామగ్రి నిమిత్తం ఒక్కొక్క విద్యార్థికి రూ. 15ల చొప్పున ప్రభుత్వం గ్రాంటు ఇస్తుంది. వచ్చే సంవత్సరం నుంచి సైన్సు కళాశాలలన్నీ ఒక్కొక్క విద్యార్థికి రూ. 5/-ల చొప్పున అదనపు గ్రాంటు పొందుతాయి.

* పూర్తి సమయం ఉద్యోగిగా ఒక స్వర్ణ నియంత్రణాధికారిని నియమిస్తారు. నిరుద్యోగులైన స్వర్ణకారులకు కొన్ని హామీలపై వ్యక్తిగతంగా ఇచ్చే ఋణం గరిష్ఠ పరిమితిని రూ. 500-ల నుంచి రూ. 3000-లకు హెచ్చిస్తారు. పాలీ టెక్నిక్‌లు, ఇంజనీరింగ్ కళాశాలలలో 3 శాతం సీట్లనూ, పారిశ్రామిక శిక్షణాసంస్థలలో 5 శాతం సీట్లనూ స్వర్ణకారుల పిల్లల కొరకు ప్రత్యేకిస్తారు. వయః పరిమితి విషయంలో వారికి 10 సంవత్సరాల మేరకు రాయితీ ఇస్తారు.

* గిరిజన బ్లాకులలో, పంచాయతీల అధ్యక్షులుగా గిరిజనులు మాత్రమే వుంటారు.




భావ, రాగ, తాళ, భరితంగా నటించే దానినే భరతం అంటారు. నాట్యం నృత్యమనిన్నీ — నృత్తమనీ రెండు భాగాలు. భావాన్ని స్పష్టపరిచేదే నృత్యం. భాషతో భావాలను వ్యక్తంచేసేది నృత్తం. మానవుని దేహసౌందర్యాన్ని, సౌష్టవాన్ని సుకుమారాన్నీ నాట్యమందే చూడాలి. కవి పద్యం వ్రాస్తే పాటకుడు సంగీత అలంకారాన్నిస్తాడు. కని నాట్యానికి యావత్ శరీరాన్నీ ఉపయోగిస్తాడు. మనుష్యుడు తనలోవుండే భావాలను దేహంయొక్క కదలికలద్వారా వ్యక్తం చేయడంలోనే గొప్పతనముంది. కవి రాసిన పద్యములో వుండే భావాన్ని సంగీతంయొక్క మాధుర్యంతో ఇంకా, ఎక్కువ రంజింపజేస్తూ, వాటిని అభినయం ద్వారా, నృత్యం ద్వారా, కదలికలతో మేళవింప జేసినపుడు, దాని గొప్పతనం వర్ణించలేం. కాని ఈ మాదిరి నృత్యమే సరైన నృత్యమన్నారు. ఇందులో ఎంతో విశిష్టతుంది. కొందరు ఒక్క అవయవ స్వాధీనత ద్వారా తాళయుక్తంగా శాస్త్రాన్ని చూపించడం తప్పితే అవయవాల అభినయాన్ని వాచికాభినయాన్ని పాటించడంలేదు. అదొక వ్యాయామంగా మాత్రమే చూపించ గలుగుతున్నారు. ఇలాంటి నృత్యాలు పాశ్చాత్య దేశాల్లో ప్రతి దేశంలోనూ వున్నాయ్. మన దేశంలో కథక్ నృత్యం కేవలం చక్రనృత్యం. సాత్వికానికి, వాచికానికి అవకాశం తక్కువ. కథకళి కేవలం ఆంగిక ఆహార్యాభినయాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. మణిపురి లాలిత్యమైన అభినయం.

## కూచిపూడి భరత నాట్యం

మన కూచిపూడి నాట్యాచార్యులు — వీటన్నిటినీ మేళవించి — రాగ తాళ భావయుక్తంగా నృత్యం చేస్తారు. పాటలోవున్న ప్రతి మాటయొక్క భావాన్ని అభినయం ద్వారా చూపించుతారు. ఇదే కష్టమైన నృత్యం — సర్వాంగములతో — సర్వాంగ సుందరంగా తను యే యితివృత్తాన్ని తీసుకున్నాడో దాని యొక్క శిఖరాల నందుకున్నారు. ఈ గొప్పతనమే మన కూచిపూడి భరత నాట్యంలో వుంది. నృత్యంద్వారా అభినయాన్ని, అభినయం ద్వారా పాటను, పాట ద్వారా సంగీతాన్ని జోడించి పండితులను పామరులను రంజింప జేస్తున్నారు. ఇదే ప్రజలకు కావలసింది, అర్థమయ్యేది, అర్థం చేసుకోగలిగేదీ.

## అలరిప్పు - జతి - స్వరం

అసలు నృత్యాన్ని, నృత్తాన్నీ అభినయాలను శాస్త్రోక్తంగా సమానంగా నడపడమే భరతనాట్య విశిష్టత. అలరిప్పు — జతి స్వరం — శబ్దం — జావళి — తిల్లానా మొదలైన పద్ధతులన్నీ తంజావూరు భరత నాట్యంలో రూపొందించబడ్డాయి. కూచిపూడి భరత నాట్యానికి తంజావూరు భరత నాట్యానికి వ్యత్యాసం వుంది.

తంజావూరు శైలి సొంపైనది. ఇది లాస్య పద్ధతికి చేరినది. కూచిపూడి సాంప్రదాయాల నుంచి తంజావూరు ఆంధ్రరాజుల కాలంలో అభివృద్ధి పొందటం ద్వారా మనకీ సొంపైన శైలి లభించింది. అంటే ఆదిబీజ కూచిపూడి వారిదే. అంతేగాక షొల్లుకట్టు అనే జతుల నృత్యమాడుటలో కూడ కూచిపూడి వారు ప్రవీణులు. తంజావూరు భరతనాట్యంలో, నృత్తాన్ని, నృత్యాన్ని విపులంగా సమపాళ్ళలో పోషించుతారు. ఈ తంజావూరు శైలి నృత్యాన్ని తంజావూరు సంస్థానంలోనూ, దేవాలయాల్లోనూ దేవదాసీలు అత్యద్భుతంగా నటించేవారట. వారి నర్తనలో ప్రాముఖ్యం వహించినది రాగాలు — పదాలూ — గానము.

ఇక మన కూచిపూడి సాంప్రదాయంలో ప్రాముఖ్యం వహించి గణనలోని కొచ్చిన సంగీతం, సంగీతం ద్వారా పదం — పదం ద్వారా అభినయం, అభినయం ద్వారా భావ విశిష్టత — నృత్తమూ — నృత్యము ముక్తాయింపు నడుస్తుంది. తంజావూరు భరత నాట్యానికి కూచిపూడి నాట్యానికి వున్న తారతమ్యాలు యివే.

## క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు

ఈ మువ్వగోపాల పదాలనే మన కూచిపూడి భాగవతులు, వారి వీధి భాగవతాల్లో పాడటం ఆ గీతాలను అభినయించడం — భరతం పట్టడం చేశారు క్షేత్రయ్య పదాలను యెక్కువ ప్రచారంలోకి తీసుకు వచ్చినవారు మన కూచిపూడి భాగవతులే. ప్రాచీనకాలం నుంచీ మన కళారూపాలు ఎలా పరిణామం చెందాయో అలాగే మన గేయ వాఙ్మయంకూడా అభివృద్ధి పొందింది. క్షేత్రయ్య నివాసస్థానం కృష్ణాజిల్లా దివి తాలూకా మొవ్వ గ్రామం. ఆగ్రామ గోపాల స్వామి మీదే క్షేత్రయ్య గోపాల పదాలను రచించి దక్షిణ దేశమంతా సంచారం చేశాడు. అనేక యాత్రా స్థలాలకుపోయి కంచి వరదుని పైనా — తిల్ల గోవిందుని పైనా — యదుగిరి స్వామి — శ్రీ వెంకట రమణుడు — ఇనపురి ధాముడు — పాలగిరి చెన్నుడు — మధురా పురాధీసుడు మొదలైన దేవుళ్ళ పైన క్షేత్రయ్య పాటలను రచించాడు. క్షేత్రయ్య పదాలు భక్తి భావమేగాక సంగీత సమ్మేళనాలతో, అభినయ ప్రదర్శనానికి కూడా



ఆయన యెన్నో గీతాలను రచించాడు. దక్షిణ దేశంలో త్యాగరాజు, ఉత్తర దేశంలో జయదేవుని మాదిరి క్షేత్రయ్య కూడా ప్రాముఖ్యత వహించిన గేయవాఙ్మయ కారుడు ఆంధ్రుల నాట్యకళా సాంప్రదాయాలలో క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు ఒక మెట్టులాంటివి.

## నాటక రంగశాల

కూచిపూడి వీధి భాగవతాలు అనాటినుంచి యీనాటి వరకు వీధుల్లోనే ప్రదర్శింపబడుతూ వున్నాయి. నాలుగు వీధుల కూడలిలోగాని, వూరిమధ్య పెద్ద బజారులోగాని, వూరిచెలుపల బయలు ప్రదేశంలో గాని ప్రదర్శనాలు జరిగేవి. ఈ నాటి మాదిరి ఆనాడు రంగస్థలాలు లేవు. ఎత్తయిన ప్రదేశమే రంగస్థలంగా చూచేవారు. లేనట్లయితే మట్టిని దిబ్బగా పోసేవారు. ఇంకా జనసమ్మర్దం ఎక్కువగా వుంటే ఎత్తుగా బల్లలతో నిర్మించేవారు. ప్రదర్శనం నాలుగు ప్రక్కలకు కనిపించేటట్టు పందిరి నిర్మించేవారు. పైన తాటియాకులుగాని యీత చాపలుగాని కప్పేవారు. ఈ నాటి తెరలు ఆనాడులేవు. మామూలు కలంకారీ అద్దకంబొమ్మల దుప్పటీలాంటిది యిరువురు చెరోపక్క పట్టుకుని నిలబడే వారు. ఈనాటి లైట్లు ఆనాడులేవు. కేవలం నూనె కాగడాల మీద ఎలాయి కర్రలమీదా ఆధారపడేవారు. ఇరు ప్రక్కలా వెలుగునిచ్చే రెండు కంచు నూనె కాగడాలు వేసేవారు పాత్రల ప్రవేశంలో, రాజుగాని, రాణిగాని, యముడుగాని, కంసుడుగాని, ముఖ్యపాత్రలప్రవేశంలో ఇంత గుగ్గిలాన్ని ఆ కాగడాలపై గుప్పేవారు. ఆ సమయంలో గొప్ప కాంతితో గప్పుమని మెరిసేది. ఈ మెరుపులో పాత్రలు ప్రవేశమయ్యేవి.




ఈ విధంగా వారు వారి రంగస్థలాన్ని నిర్మించుకునేవారు ఇందుకు గ్రామస్థులందరూ సహాయపడేవారు. ప్రదర్శనానికి కాకితో కబురంపితే చాలు. చుట్టుప్రక్కల గ్రామాలనుండి జనం గుంపులు గుంపులుగా వచ్చేవారు. ఇందుకు కారణం యింతకు మినహా ఆనాడు వినోద కార్యక్రమాలు తక్కువ కనక.

## ప్రదర్శన ప్రారంభం

రాత్రి సుమారు 10 గంటలకు ప్రదర్శన ప్రారంభమయ్యేది. ఈలోగా భాగవతులందరూ గ్రామంలోవున్న బ్రాహ్మణుల యిండ్లలో భోజనం చేయడంగాని, స్వయం పాకంగాని చేసుకునేవారు. రంగస్థలానికి కొంచెం దూరంలోవున్న యింటిలో ముఖాలంకరణ చేసుకునే వారు. ప్రేక్షకులందరూ వచ్చేవరకు సూత్రధారులు వాద్య విశేషాలతో వివిధ రకాలైన పాటలు పాడుతూ గణపతి ప్రార్థన, సరస్వతీ, లక్ష్మీ ప్రార్థనలు చేసేవారు. ఒకప్రక్క వేషాలు తయారవుతూ వుండేవి. మరో ప్రక్క ప్రేక్షకులందరూ ఆశీనులై వుండేవారు. గ్రామంలో వున్న పండితులూ, గ్రామపెద్ద, మున్సిఫ్, కరణం మొదలైన పెద్దలందరూ వచ్చి ముందు వరుసలో కూర్చునేవారు. పెద్దలందరూ వస్తేనేగాని ప్రదర్శన ప్రారంభ మయ్యేది కాదు. వచ్చినవారందర్నీ వారికి సహాయాలు చేసేవారినీ యీ విధంగా సంబోధించేవారు.

"ఈ సభారంగమునకు అందరూ వచ్చి యున్నారటరా ?''

"చిత్తం!"

"కరణంగారూ ?"

"చిత్తం"

"మున్సిఫ్‌గారూ ?"

"చిత్తం"

ఈ విధంగా ప్రేక్షకు లందర్నీ ఆకర్షించి ప్రదర్శనం ప్రారంభించే వారు. ప్రతి జట్టులోనూ సమర్థులైన ఇద్దరు ముగ్గురు హాస్యనటులుండేవారు. వారు యేపాత్ర బడితే ఆ పాత్రను అచ్చుగుద్దినట్లు చెప్పేవారు. వేషధారణలో యీ నాటి కేశులుగాని పౌడర్లుగాని బ్రష్‌లుగాని లేవు. ముఖాలంకరణకు అద్దకం, మణిశిల, బొగ్గుపొడి, సిందూరం వుపయోగించేవారు. క్రేప్‌హైర్ బదులు నారపీచునుపయోగించే వారు.

ప్రదర్శనంలో ప్రతి పాత్రా రంగస్థలంలో మూడు మూడు ప్రక్కలకు తిరిగి అభినయించేవారు. దూరంగా వున్న వారికి వినబడేందుకు సూత్రధారులు హెచ్చు స్థాయిలో పాడేవారు ప్రతి చరణాన్ని ఒక సారికి రెండుసార్లు రెట్టించి పాడేవారు. ఇలా రెట్టించటంవల్ల అందరికీ యిట్టేఅర్థమయ్యేది. ఈ ప్రదర్శనంలో సాత్విక భావాలు దగ్గరున్న వారికి తప్ప దూరాన వున్నవారికి కనిపించేవి కావు. అందువల్ల కాళ్ళతో నృత్యం చేసే వారు. నోటితో పాట పాడేవారు. చేతులతో భావానికితగ్గట్లు అంగచలనం చేసేవారు. మధ్య మధ్య శ్లోకాలను చదివేవారు. ఈ శ్లోకాలు చాలామందికి అర్థంకావని హాస్యగాని ద్వారా వివర మడిగించి శ్లోకార్థాన్ని విశద పర్చేవారు. ప్రదర్శనంలో యేమాత్రం విసుగు జనించకుండా హాస్య పాత్రధారులైన మాధవి చోపుదారు, ద్వారపాలకుల ద్వారా చిత్ర విచిత్రమైన లోకధర్మాలను, సాంఘికాచారాలను ప్రవేశపెట్టి మధ్య మధ్య కడుపుబ్బ నవ్వు పుట్టించేవారు. ప్రదర్శనం 10 గంటలకు ప్రారంభిస్తే తెల్లవారి 6 గంటల వరకు ప్రదర్శనాన్ని సాగించేవారు. ప్రేక్షకులు తెల్లవార్లూ రెప్పవాల్చకుండా ఈ ప్రదర్శనలను చూచి ఆనందించేవారు.

## అబ్దుల్ హసమ్ తానీషా విరాళం

సిద్ధేంద్రయోగి పెట్టిన భిక్షతో అనేక సంవత్సరాలు కూచిపూడి వారు యక్షగానాల ద్వారానూ వీధి భాగవతాల ద్వారానూ నానాదేశ సంచారంచేసి విరాళాలను పొందారు. ఆ విధంగానే గోల్కొండను పరిపాలించిన నవాబ్ అబ్దుల్ హసమ్ తానీషా కూచిపూడి కళాకారులకు 1687 లో కూచిపూడి గ్రామాన్ని అగ్రహారంగా దాన మిచ్చారు.

ఆ కాలంలో సిద్ధేంద్ర యోగి జీవించే వున్నాడనీ నవాబువద్దనుంచి రాగిరేకుమీద అగ్రహారపు దానపట్టాను వ్రాయించిందికూడా సిద్ధేంద్రుడేననీ కూడా కొంద రంటున్నారు.

ఏది యేమైనా నాట్యకళా సాంప్రదాయాలకు తమ జీవితాన్ని అంకితంచేసిన బ్రాహ్మణ కుటుంబాల కళాకారులందరూ ఈ అగ్రహారపు దానాన్ని పొందేటట్లు పట్టాలో వ్రాయబడిందట. ఆ నాటినుండి యీ నాటి వరకూ తరతరాలుగా ఆ కుటుంబాలన్నీ దీనిని అనుభవిస్తూనే వున్నాయి.

## ప్రదర్శించిన నాటకాలు

కూచిపూడి భాగవతులు వారు ప్రదర్శించిన నాటకాలన్నీ పురాణాలకు సంబంధించినవీ, భక్తితత్వంతో కూడుకున్నవి. భారతం-భాగవతం - రామాయణ కావ్యాలు యక్షగాన రూపాలైన నాటకాలు — నాట్యరూపంలో సాంప్రదాయ సిద్ధంగా ఈ క్రింద వుదహరించిన వాటి నన్నింటినీ ప్రదర్శించేవారు.

శ్రీ త్యాగరాయకృతులు — జయదేవుని అష్టపదులు — మువ్వగోపాల పదాలు - భద్రాచల రామదాసు కీర్తనలు — నారాయణ తీర్థుల తరంగాలు, సారంగపాణి కీర్తనలు, తుంగతురి కృష్ణదాసు కృష్ణలీలలు- తాళ్ళపాక అన్నమాచార్యులవారి పదాలు- సింహపురి పదాలు- చిదంబరం ఉషాపరిణయం — శ్రీ సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మ రామాయణ కీర్తనలు- తిరునారాయణాచార్యులుగారి ప్రహ్లాద — హరిశ్చంద్ర - రామనాటకం - ఉషా పరిణయం — గొల్ల కలాపం — భామా కలాపం — దాదినమ్మ వేషం - దశావతారములు — మండూక శబ్దం — ప్రహ్లాద పట్టాభిషేకం — పరసురామ స్తవం — రామపట్టాభిషేకం — బాలగోపాల తరంగం మొదలైన వెన్నో ప్రదర్శించేవారు.

## కూచిపూడి కళాకారులు

కూచిపూడి కళాకారులు ఒక్క నాట్య సంగీతంలోనేగాక అలంకార శాస్త్రంలోనూ- మంత్ర శాస్త్రంలోనూ - భాషాశాస్త్రంలోనూ వాద్య శాస్త్రములోనూ — నిరుపమానమైన ప్రజ్ఞా నైపుణ్యము గలవారు. కూచిపూడిలో వేదాంతంవారనీ-చింతావారనీ, పసుమర్తివారనీ - భాగవతులవారనీ — వెంపటివారనీ — ఇంగువవారనీ — బుక్కావారనీ ప్రసిద్ధ కుటుంబాలవారున్నారు.

వేదాంతం వారిలో చలపతి, సాంబయ్య, రామకృష్ణయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ మొదలైనవారు ప్రసిద్ధులు. భామకలాపంలో వివిధ సాత్విక భావాలను, నాయకీ నాయకుల వివిధావస్థలను అభినయించి నటించడంలో లక్ష్మీనారాయణగారి ప్రతిభ అపూర్వమైనది.

భాగవతులవారి వంశంలో రామయ్య - దశరథ రామయ్య — నాగలింగయ్య — రామదాసు - విస్సయ్య - సుబ్రహ్మణ్యం మొదలైనవారు.

వెంపటివారి కుటుంబంలో వెంకట నారాయణ - సత్యనారాయణగార్లు.

చింతావారికుటుంబంలో వెంకట్రామయ్య, రత్తయ్య.

ఇంగువవారి కుటుంబంలో పట్టాభిరామయ్య — బుక్కావారిలో పార్వతీశం, ఆయన కుమారుడు రామబ్రహ్మంగార్లు మొదలైనవారు ప్రసిద్ధులు.

## ప్రత్యేక పాత్రల్లో ప్రతిభావంతులు

వెంపటి వెంకట నారాయణగారు గొప్ప నాట్యాచార్యుడు. లయబ్రహ్మ. వీరు భామవేషాన్ని యితర స్త్రీ పాత్రలను అద్భుతంగా ప్రదర్శించేవారు.

భాగవతుల వారిలో నరసింహంగారు స్త్రీ పాత్రను అద్భుతంగా పోషించేవారు. అలాగే వేదాంతం వారిలో చలపతిగారు స్త్రీ పాత్రాభినయంలో ప్రజ్ఞావంతులు. చింతా వెంకట్రామయ్యగారు సుప్రసిద్ధ నాట్యాచార్యుడు. ఈయన చండామార్కులు - నారదుడు — మొదలైన పాత్రల్ని సొంపుగా ప్రదర్శించేవారు. ఇక హరివారి వంశంలో చలపతిగారు- హిరణ్య కసిపుడు మొదలైన భీకర పాత్రల్ని, రౌద్ర, భీభత్స, భయానక రసాలను అద్భుతంగా పప్పించేవారు.

## వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి

కూచిపూడి కళాకారుల్లో అగ్రశ్రేణికి చెందిన వారిలో ముఖ్యులు నాట్యకళానిధి కీ॥ శే॥ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఒకరు. వీరు వేదాంతం రామేశ్వరయ్యగారి కుమారులు. యక్షగానాల్లోనూ వీధి భాగవతాల్లోనూ పారంపర్యంగా వచ్చే మామూలు నృత్యంగాక లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ప్రత్యేక కృషి సలిపి శాస్త్రయుక్తంగా భరతనాట్య శాస్త్ర సాంప్రదాయాలను నారాయణ తీర్థులవారి కృష్ణలీలా తరంగిణిలోని తరంగాలకు జయదేవ కవి అష్టపదులకు క్షేత్రయ్య మువ్వగోపాల పదాలకూ కృష్ణకర్ణామృతం పుష్పబాణవిలాసంలోని శ్లోకాలకు నృత్యాన్ని కల్పించి నాయకీ నాయక లక్షణ సమన్వితాలను విరూపించి, శాస్త్రయుక్తంగా నృత్యశాస్త్రాన్ని కల్పించి శిష్య ప్రశిష్యుల్ని తయారుచేసి ఆంధ్ర దేశానికి ప్రసాదించారు.

భామకలాపంలో సత్యభామ నాయిక. ఈ ప్రదర్శనంలో అఖండమైన ప్రజ్ఞావంతులు. లక్ష్మీనారాయణ శాస్త్రిగారు. శాస్త్రిగారు ఒక్క భామకలాపం-గొల్ల కలాపమే గాక దాదినమ్మ వేషం (లీలావతీ విజయం)లోనూ, బాలింత వేషం-(శ్రీకృష్ణ

జననం) మొదలైన యక్షగాన పాత్రలను అద్భుతంగా ప్రదర్శించేవారు. శాస్త్రిగారు హైదరాబాదులో ప్రదర్శనలిస్తున్న ఉదయ శంకర్ బృందం శాస్త్రిగారిని ఆహ్వానించి కూచిపూడి సాంప్రదాయాల విశేషాలను తెలుసుకుని శాస్త్రిగారిని స్తుతించి సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆయన జీవితమంతా రాజస్థానాల్లో గడిచిపోయింది. లక్ష్మీ నారాయణ శాస్త్రిగారిని ప్రముఖ కళాకారునిగా గుర్తించి పండిత శాలువతో సువర్ణ ఘంటా కంకణాలను బహూకరించారు. శాస్త్రిగారివద్ద భామ కలాపాన్ని గొల్ల కలాపాన్ని ఎంతో మంది దేవదాసీలు నేర్చుకున్నారు. మరంగంటి కాంచనమాలకు సి. వి. ఆర్. ప్రసాద్‌గారి కుమార్తె చిరంజీవి అఖిలేశ్వరి, చాలా వరకు శాస్త్రాన్ని అభ్యసింపజేశారు_ 13_7_57 న హైద్రాబాద్‌లో అస్తమించారు —

### కూచిపూడి వారి ఆభరణాలు

కూచిపూడి భాగవతులు వారు ప్రదర్శించే ప్రదర్శనాలలో ప్రతి పాత్రకు ఒక ప్రత్యేకమైన వేషధారణను, ప్రాచీన సాంప్రదాయాలలో కూడుకున్న ఆభరణాలను ప్రవేశపెట్టారు. నాయిక, నాయకుడు, విదూషకుడు, చెలికత్తె, వుపనాయకులు మొదలైన అనేక పాత్రలకు తారతమ్యంతో కూడుకున్న శరీరాలంకరణాలను, కంఠాభరణాల్ని, శిరోభూషణాలను, ధరించేవారు.

### పురుష పాత్రలు

పురుష పాత్రల్లో ముఖ్యంగా రాజుకి కిరీటాన్ని, శంఖ చక్ర గదాదండాల్ని, భుజకీర్తుల్ని, గండభేరుండ పతకాలు, కర్ణపత్రాలు, లంగా, దవురు, కాశికోక, కండువాలు, నల్లకోటు మొదలైనవాటిని ప్రధాన భూషణాలుగా ధరించేవారు.

ఇంకా పురుష పాత్రల్లో తారతమ్యాలను బట్టి తదితరకోట్లు, షర్వాలు, చొక్కాలు, అంగరఖాలు వుపయోగించే వారు.

నరశింహస్వామి, శక్తి, రావణుడు, హిరణ్య కశ్యపుడు, హనుమంతుడు మొదలైన భీకరమైన పాత్రలకు కరాశములను, మొఖాలకు ముసుగులను వాడతారు.

### స్త్రీ పాత్రలు : ఆభరణాలు

నిత్యజీవితంలోనే పురుషులకంటె స్త్రీలకు ఆభరణాలు ఎక్కువ. అలాగే ప్రదర్శనాలలో గూడ ఎక్కువగానే ధరించేవారు. నిజంగా కూచిపూడి కళాకారులు వారి భాగవతాలలో స్త్రీ పాత్రలకు ఒక ప్రత్యేకమైన ఆభరణాలను ధరించేవారు. ఆ కాలంలో ఆచరణలో వున్న స్త్రీల ఆభరణాలనన్నింటినీ వుపయోగించే వారు. కొన్ని లోహాలకు సంబంధించినవి, మరికొన్ని పేడతో తయారు చేసినవి, మరి కొన్ని కాగితాలతో మోల్డింగ్సుగా తయారు చేసినవి ధరించేవారు.

### భామ వేషపు ఆభరణాలు

భామవేషానికి ఎన్నో ప్రాచీన ఆభరణాలను వుపయోగించేవారు. వారమునకు కొన్ని నగలు చొప్పున ఏడు వారములకు ఏడు రకములైన వివిధ ఆభరణాలను ధరించే వారు — పెద్దజడ — చిన్నజడ — శిఖ - రాగి రేకులు — మొగలిరేకులు — రాగిడి - చంద్రవంక — కమ్మలు — జూకాలు—తాయెత్తులు - 



చేర్లు — పాపిటతురాయి — పాపిడి పింజరాలు- కడియాలు — దండకడియాలు — పోచీలు - దట్టెడ — అడ్డబాస — బిళ్ళల మొలత్రాడు — కట్టడపు బులాకి—ముక్కుపుల్ల మొదలైనవి ధరిస్తారు. ఇవిగాక కాసులపేరు, సూర్యుడు, ముత్యాలు — తాయెత్తులు — కితకి — వడ్రాణము — జడికుప్పెలు మొదలైనవి కూడా ధరిస్తారు. వారి జడబిళ్ళలు నవరత్నాలు చెక్కినట్లుండెడివి. ఆ బిళ్ళల్లో సూర్యుడు, జంద్రుడు, నక్షత్రాలు మొదలైన ఖగోళశాస్త్రానికి సంబంధించిన విశేషాలుండేవి.

---

# 'రణభేరి'

విఖ్యాతాంధ్రకవులు
జాతీయైక్యత, రక్షణోద్యమ సందేశాలతో రచించిన ఉత్తేజకరాలైన
గేయముల రెండవ సంపుటి:

## వెల 00-25 న.పై.

*ఇతర ప్రచురణలు :*

| | |
|---|---|
| శంఖారావం: (గేయాలు) | 0-25 న. పై. |
| కనువిప్పు : (బుర్రకథ) | 0-25 ,, |
| చైనాద్రోహం: వీరభారత్ (బుర్రకథలు) | 0-25 ,, |
| పాంచజన్యం: (బుర్రకథ) | 0-25 ,, |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | రూ. 2-75 ,, |
| వందేమాతరం: ( నాటిక ) | రూ. 1-00 |
| అగ్గిగుండెలు-మరి రెండు నాటికలు | రూ. 1-00 |

ప్రచురణ:
సమాచార ప్రజాసంబంధాల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్

# ప్రగతి పథం పల్లె



### ఆదిలాబాదు జిల్లా

*గ్రామసహాయక శిక్షణ శిబిరం :*

నర్సాపూర్ పంచాయతీ సమితిలోని కుంతలలో 3 రోజులపాటు గ్రామసహాయక శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఇందులో 50 మంది వ్యవసాయదారులకు వ్యవసాయం, పశుపోషణ, సమాజాభివృద్ధి, ఆరోగ్యం విషయాలలో శిక్షణ ఇవ్వడం జరిగింది.

1964 మార్చి 8 వ తేదీన బోత్ లో మహిళా గ్రామసేవక్ శిక్షణ శిబిరాన్ని ప్రారంభించారు.

### అనంతపురం జిల్లా

*ఉత్పత్తి కార్యక్రమం :*

1964 ఫిబ్రవరి నెలలో ముదిగుబ్బపంచాయతీ సమితిలో 247 మణుగుల మేలురకం విత్తనాలను, 609 మణుగుల రసాయనిక ఎరువులను సరఫరా చేయడం జరిగింది. 148 ఎకరాలలో జపాను వరిసాగు పద్ధతిని అమలుచేశారు. 62 ఎకరాల భూమిని సేద్య యోగ్యంచేశారు.

### తూర్పుగోదావరి జిల్లా

*విత్తనాల పంపిణీ :*

పెద్దాపురం పంచాయతీ సమితిలో ఫిబ్రవరి నెలలో 103 మణుగుల వరివిత్తనాలు, 974 మణుగుల చరకుగడ విత్తనాలు, 247 మణుగుల రసాయనిక ఎరువులు, 9 ఆధునిక వ్యవసాయ పనిముట్లు వగైరాలను పంపిణీ చేశారు. యిదేకాలంలో 94 వ్యవసాయిక ప్రదర్శనాలను నిర్వహించారు. 43 కంపోస్టు గోతులను త్రవ్వారు. 3080 టన్నుల కంపోస్టు ఎరువులను తయారుచేశారు.

### గుంటూరు జిల్లా

*రోడ్డు నిర్మాణం :*

సంతమాగులూరు పంచాయతీ సమితిలో 1964 ఫిబ్రవరి నెలలో 5½ ఫర్లాంగుల కచ్చా రోడ్డును నిర్మించారు. 19 ఫర్లాంగుల కచ్చా రోడ్డును బాగుచేశారు. ఇదేకాలంలో 4 చిన్న వంతెనలను నిర్మించారు.

*పాఠశాల భవనం నిర్మాణం :*

రేపల్లె పంచాయతీ సమితిలోని గుడ్డికాయలంకలో 1964 మార్చి 11 వ తేదీన ఎలిమెంటరీ పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం జరిగింది.

పిడుగురాళ్ళ పంచాయతీ సమితిలోని చిన అగ్రహారంలో ఫిబ్రవరి 21 వ తేదీన పాఠశాల భవన నిర్మాణానికి పునాదిరాయి వేశారు.

*శిక్షణ శిబిరం :*

పెద అగ్రహారంలో ఫిబ్రవరి 28 వ తేదీనుంచి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. రు. 200 లు ఖర్చు అయ్యే మట్టిరోడ్డును గ్రామస్థుల శ్రమదానంతో నిర్మించారు.

మంగళగిరి పంచాయతీ సమితిలోని నూతక్కిలో ఫిబ్రవరి 27 వ తేదీనుంచి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు.

*పిల్లల పార్కు :*

గురజాల పంచాయతీ సమితిలోని రెంటచింతల గ్రామంలో పిల్లల పార్కును ప్రారంభించారు.

### కర్నూలు జిల్లా

*గ్రామీణ కంపోస్టు గోతులు :*

ఆస్పారి పంచాయతీ సమితిలో 1964 ఫిబ్రవరి నెలలో 99 గ్రామీణ కంపోస్టు గోతులను త్రవ్వారు, 19 మణుగుల రసాయనిక మందులను 25 ఆధునిక వ్యవసాయ పరికరాలను పంపిణీ చేశారు.

### మెదకు జిల్లా

*బ్లాకు స్థాయిలో ఆటల పోటీలు :*

గజ్వేలులో 1964 ఫిబ్రవరి 22వ తేదీనుంచి బ్లాకుస్థాయిలో పాఠశాల పిల్లలకు, యువకులకు ఆటలపోటీలను నిర్వహించారు. జిల్లా పరిషత్తు, ప్రాథమిక పాఠశాలల విద్యార్థులు, యువజన క్లబ్బులు యీపోటీలో పాల్గొన్నాయి.

### నల్లగొండ జిల్లా

*వ్యవసాయదారుల శిక్షణ శిబిరం :*

ఆలేరు పంచాయతీ సమితిలోని అమ్మనబ్రోలులో 3 రోజులపాటు వ్యవసాయదారుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. ఈ శిబిరంలో 45 మంది గ్రామ సహాయకులకు శిక్షణ యిచ్చారు.

*గ్రామీణ పశు వైద్యశాలలు :*

కోదాడు సమితిలోని నల్లబండ గూడెంలో గ్రామీణ పశువైద్యశాలను ప్రారంభించారు.

### నెల్లూరు జిల్లా

*మధ్యాహ్న భోజన పథకం*

కొండపి పంచాయతీ సమితిలోని 15

(మిగతా 82 వ పేజీలో)

# త్యాగం

హిందీ నాటిక

మూలం :
చావలి సూర్యనారాయణమూర్తి

అనువాదం :
గోపేటి సావిత్రి



పూర్వరంగం

[కాకినాడలో శర్మగారి యిల్లు. మధ్యాహ్న సమయం. శారద తన గదిలో కాలేజీకి వెళ్ళేందుకు పుస్తకాలు తీసుకుంటూ ఉంటుంది. వెనకాలనుండి 'నాగేశ్వర్' వచ్చి ఆమె కళ్ళు మూస్తాడు].

శారద : [ఉలిక్కిపడి] ఎవరు ? [విడిపించుకునేందుకు ప్రయత్నిస్తుంది].

(నాగేశ్వర్ శారదను విడిచిపెట్టి నవ్వుతాడు)

శా : నువ్వా ? నేను ఎవరో అనుకుని హడలిపోయాను.

నా : ఏం ? పూర్వం 'ఊర్వశి'ని ఎత్తుకుపోయిన 'కేశి' రాక్షసుణ్ణనుకున్నావా ?

శా : (నవ్వుతూ) లేదు. అట్లా అనుకోలేదు.

నా : అయితే ఎందు కులిక్కి పడ్డావు ?

శా : ఇలాంటి సమయంకాని సమయంలో ఈ దేవత ఎక్కడినుండి ఊడిపడిందా ! అని : (ఇద్దరూ నవ్వుతారు)

(శర్మగారి ప్రవేశం)

శ : శారదా ! ఇంకా కాలేజీకి వెళ్ళలేదూ ?

శా : ఇప్పుడే వెడుతున్నా నాన్నగారూ !

శ : నాగేశ్వర్ ! అప్పుడే వచ్చేశావేం ? రమణారావుగార్ని కలుసుకోలేదా ?

అనువాదభారతి

నా : లేదుమామయ్యా ! ఆయన బొత్తిగా అందనిపండై పోయాడు ! రేపు రమ్మని కబురంపాడు ! ఆయన నౌకరనుకున్నాడో ఏమో ? రోజూ ఆయనచుట్టూ తిరిగి తిరిగి విసుగెత్తిపోతోంది.

శ : (శాంత గంభీరస్వరంతో) నాగేశ్వర్ ! నువ్వింకా చిన్నవాడివి ! ఉద్యోగంకోసం ఎంత కష్టపడాలో నీకేం తెలుసు.

నా : మీరేమన్నా సరేగాని ఇలాంటి ఉద్యోగం మానవుని ఆత్మాభిమానాన్ని అణగద్రొక్కుతుంది. ఉద్యోగంఎప్పుడో ఒకప్పుడు వస్తుంది. నేనుమాత్రం ఇంక అక్కడికి వెళ్ళను.

శ : ఇంత అభిమానం ఉంటే పనికాదు నాగేశ్వర్. అవసరం నీది.

నా : నాకేం అవసరం లేదు. మీ మూలంగానే నేనక్కడికి వెళ్ళవలసొచ్చింది. ఉద్యోగం లేకపోయినా నా పని నిశ్చింతగా కొనసాగుతుంది.

శ : (కోపంగా) నీ గురించి అంతగొప్పగా చెప్పకుంటా వెందుకు ? ఇంట్లో ఖాళీగా కూర్చుని తింటుంటే డబ్బంతా ఎన్నాళ్ళొస్తుంది. అయినాగాని ఒకళ్ళమీద ఆధారపడటం ఎంతసిగ్గుచేటు ? అప్రయోజకుడైన వ్యక్తిని భార్యకూడా గౌరవించదు.

నా : (శారదవైపు చూస్తూ) కాని.. (అంటూ శర్మ వంక చూస్తాడు).

శ : (అతనిభావం గ్రహించి కోపంగా) నాగేశ్వర్ : నీలాటి అప్రయోజకునికి శారదనిచ్చి పెళ్ళిచెయ్యను.

శా : నాన్నా !...

(నాగేశ్వర్ అభిమానంగా శర్మవైపు చూస్తాడు).

శ : నీ తండ్రి ధనవంతుడని గర్వపడుతున్నావుకాబోలు : బీదవాళ్ళ రక్తాన్ని పీల్చి పోగుపెట్టిన ఈ డబ్బంటే నా కసహ్యం.

నా : (కోపంగా) మామయ్యా.

శ : ఏమిటోయ్ ! పెద్ద కళ్ళెర్ర జేస్తున్నావేమిటి ? నువ్వు పెళ్ళి చేసుకోకపోతే మా శారద కన్యగానే ఉండిపోతుందని మాత్రం అనుకోకు.

శా : (దుఃఖంతో) నాన్నా ! అలా అనకండి!

శ : నువ్వు మధ్యలో మాట్లాడకు శారదా ! కాలేజీకి వెళ్ళు. టైమయింది!

(శారద నెమ్మదిగా నాగేశ్వర్ వైపు చూస్తూ వెళ్ళిపోతుంది)

శ : నేను చెప్తున్నాను జ్ఞాపకం పెట్టుకో! నువ్వు ప్రయోజకుడవయ్యే వరకూ శారదతో వివాహమనే ప్రసక్తి తీసుకురాకు.

(నాగేశ్వర్ కోపంగా విసురుగా వెళ్ళిపోయాడు.)

*1*

(శర్మగారి ఇల్లు. శారద చేతిలో ఒక ఫోటో పెట్టుకుని పాడుతూ తిరుగుతూ ఉంటుంది. గోడమీద ఒకవైపు శారదతల్లి ఫోటో తగిలిచ్చి ఉంటుంది. ఇంతలో శర్మగారు ప్రవేశిస్తారు! బాగా వృద్ధుడు, మధ్య మధ్య దగ్గుతూ ఉంటాడు.

శ : శారదా! ఇంకా సిద్ధం కాలేదూ ? వాళ్ళొచ్చే వేళయింది. తొందరగా తయారవు. ఇంక ఆలస్యం లేదు!.

శా : (తండ్రివైపు చూస్తూ మౌనంగా నిలబడుతుంది ఆమె కళ్ళవెంట నీళ్ళు కారుతూ ఉంటాయి.)

శ : (ఆమె దగ్గరకు వెళ్ళి తల నిమురుతూ కన్నీళ్ళు తుడుస్తాడు) శారదా! ఇంకా ఆమాటే పట్టుకూర్చుంటే ఎల్లా చెప్పు, అదంతా మర్చిపోయి జీవితంలో ముందడుగు వెయ్యి !

శా : ఎల్లా మర్చిపోను నాన్నా ! చిన్నప్పటి నుంచీ......

శ : శారదా! నాకుమాత్రం తెలియదూ ? మీ ప్రేమ శుక్లపక్ష చంద్రునిలా ఎలా దినదిన ప్రవర్ధమాన మయిందో! మీ అమ్మకూడా నిన్ను నాగేశ్వర్ కివ్వాలనే ఉండేది, నేనుకూడా అదే అనుకున్నాను. కాని మీ ప్రేమ కొద్దిరోజులకు ఫలిస్తుందనగానే ఆ భగవంతుడు చూడలేకపోయాడు. పరిస్థితు లిలా తారుమారవుతాయని కలలోకూడ అనుకున్నామా ? ఏం చేస్తాం? విధి నెవ రెదిరించ గలరు? (దగ్గుతాడు.)

శా : నాన్నా ! నేను మీతో ఏం చెప్పను ? (తండ్రి గుండెలమీద తల ఆన్చి ఏడుస్తుంది)

శ : శారదా! నీ దుఃఖం ఎలాంటిదో నాకూడా తెలుసునమ్మా ! కాని ఏం చెయ్యను ? నేను గత్యంతరం లేక ఈ పని చేయవలసొస్తోంది. 'నాగేశ్వర్'ని వెతికించడానికి నేనెంత ప్రయత్నం చేశానో నీకూడా తెలుసుగా? అతని ఫోటోకూడా పత్రికల్లో వేయించాను. అతన్ని వెతికించడానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేశాను. రెండు సంవత్సరాలైంది ఇల్లు విడిచి. పిచ్చివాడు కాకపోతే ఒకచిన్నమాట మీద కోపగించి సంబంధం తెంచేసుకుని పారిపోతాడా!... బహుశా నాగేశ్వర్ చనిపోయుంటాడని వాళ్ళ తమ్ముడు నారాయణ చెప్తున్నాడు. లేకపోతే ఇప్పటివరకు ఇంటికి రాడూ ? వాళ్ళమ్మ...నా ప్రియమైన చెల్లెలు వాడికోసం ఏడ్చిఏడ్చి కళ్ళు మూసింది. (శారదవైపు చూస్తూ) వాడు యిల్లువిడిచి పోవటం నాకుమాత్రం బాధ కాదనుకున్నావా శారదా !

శా : (తండ్రివైపు చూస్తూ) అయితే ఈ సంబంధం...

శ : అన్నీ తెలిసుండికూడా ఏమీ తెలియని దానిలా తయారవుతున్నావు, నీకేం చెప్ప

గలను నేను. నువ్వా ఈడొచ్చిన పిల్లవి. ఈడొచ్చిన పిల్లని ఏ తండ్రైనా ఎన్నాళ్ళని పెళ్ళిచెయ్యకుండా ఇంట్లో ఉంచుకుంటాడు ? అదీ కాక పోయినా సంఘంగురించి కూడా ఆలోచించొద్దూ !

శా : సంఘం !...ఈ సంఘంకోసం ఒక్కగా నొక్క కుమార్తె సుఖం బలిచేస్తారా ? నాన్నా ?

శ : నా కుమార్తె సుఖాన్ని నాశనం చేయటమా? లేదు...ఏ తండ్రీ అలా చేయలేడు. పరిస్థితు ల్నర్థం చేసికొని నడచుకోమని మాత్రమే నేను చెప్పేది. నేనా ? కాటికి కాళ్ళుచాచుకొని ఉన్నాను. అందులో ఈ జబ్బొకటి (దగ్గుతాడు). ఏ క్షణాన ఏమి కానుందో ఎవరు చెప్ప గలరు ?రేపేకావచ్చు...రేపెందుకు?... ఈ క్షణంలోనే ;

శా : (తండ్రినోరు మూస్తూ) ఆపండి నాన్నా! ఇలాంటి మాటలు రానివ్వకండి. నాకు భయంవేస్తుంది.

శ : భయమా !...భయందేనికి ? శారదా ? పుట్టినవాళ్ళెప్పటికైనా చావక తప్పదుగా ? ఒకరు ముందు, ఒకరు వెనుక, అంతేతేడా ! నేను చనిపోయిన తరువాత నా ప్రియమైన కుమార్తె ఆశ్రయ హీనురాలు కాకుండా ఉండాలనే నేను కోరేది.

శా : ఆశ్రయహీనురాలా: నాన్నా! మీరునాకు పూర్తిగా విద్య చెప్పించారు. దాని సహాయంతో నేను జీవితయాత్ర చెయ్య గలను !

శ : సరిగ్గా చెప్పేవమ్మా ! నా కుమార్తె ఎప్పుడూ అబలకాదు ! నాకు సంతోషంగా ఉంది. నా శారద జీవితమంటే భయ పడదు. తనకాళ్ళమీద తాను నిలబడేశక్తి కలిగి ఉంది. కాని శారదా ! తండ్రి హృదయం ఎప్పుడూ తనకూతురు పొట్టకులేక నౌకరీకి ఇల్లిల్లూ తిరగకుండా ఉండటమే కోరుతుంది. ఏదోనీవు పెళ్ళి చేసుకొని నీకడుపున నలుగురు పిల్లలు పుడితే చూచి చనిపోదామని నాకుంది.

శా : (సిగ్గు—నవ్వుతో తల వంచుకుంటుంది) పొండి ! నాన్నగారూ !

శ : శారదా ! నేను ఈ ఆశతోనే జీవిస్తున్నా నమ్మా (భార్య ఫొటోచూసి) మీ అమ్మ చనిపోయినతరువాత నాకు జీవితంలో నీవుతప్ప ఇంకే ఆకర్షణా, ఆశాలేవు. ఎవరికోసం నా సుఖాన్నంతా విడిచి పెట్టాను ? కేవలం—నీకోసం ! తల్లి తండ్రులపట్ల కూడా సంతానం తమ కర్తవ్యాన్ని నెరవేర్చాలి ! నా ఏకైక కుమార్తెను ఒక యింటిదాన్నిచేసి చూసి ఆనందించగల భాగ్యం నాకీ జీవితంలో కలుగచేయవా శారదా ? నా జీవితం ఇలాగే వ్యర్థమై పోతుందా ?

శా : (దుఃఖంతో) నాన్నా !

శ : చెప్పుతల్లీ ! నీ చదువు తండ్రి కోరికను పాలించమని చెప్పలేదా ? నీ చదువు ఈ ముసలి తండ్రియెడ హృదయాన్ని కరి గించటంలేదూ ?

శా : నాన్నా !

శ : ఈడొచ్చిన పిల్ల హృదయంలో పితృ ప్రేమకి స్థానంలేదా ? నువ్వింతటి కఠిను రాలవైతే నీతండ్రి అశాంతితో సంసారం విడిచిపోగా చూద్దుగాని

శా : (తండ్రి గుండెలమీద తల ఆన్చి) చాలించండి ! నాన్నా. ఇంక వినలేను.

శ : శారదా ! నీ హృదయానికి నచ్చచెప్పు! మనస్ఫూర్తిగా ఈ సంబంధానికంగీక రించు. బ్రహ్మానందరావుకూడ అంద గాడు. మద్రాస్ కాలేజీలో లెక్చరర్. మంచి గుణవంతుడు అన్నీనీకేతెలుసు. నేనేం చెప్పను ?

శా : అయితే మీ ఆజ్ఞను శిరసావహిస్తు న్నాను నాన్నగారూ.

శ : (ప్రేమగా ఆమెతల నిమురుతూ) మా అమ్మాయి చాలా మంచిది. ఇంక నా ఆశకూడా పూర్తవుతుంది.

శా : (తండ్రివైపు చూస్తూ మౌనంగా నిల బడుతుంది)

శ : అయితే తొందరగా తయారవు.

(శారద లోపలకు వెళ్ళిపోతుంది)

శ : పిచ్చిపిల్ల ! జీవితంలో సుఖం తృప్తి పడటంలోనే.

(సమయ సూచనకు స్టేజిమీద కాస్సేపు చీకటి. మళ్ళీ వెల్తురు)

(బయటనుండి "శర్మగారూ !—")

శ : అదుగో వచ్చేశారు. (తలుపుదగ్గరకు వెళ్ళి బ్రహ్మానంద్—రమేశ్‌లతో ప్రవే శిస్తాడు) కూర్చోండి — కూర్చో బ్రహ్మా నందం !

(బ్రహ్మానంద్, రమేశ్ కుర్చీలోకూర్చుం టారు. వాళ్ళిద్దరూ సూటుధరించారు)

శ : ఇంట్లో అందరూ కుశలమేనా ?

బ్ర : ఆ! మీ దయవల్ల.

ర : మీ ఆరోగ్యం ఎలా ఉందండీ ?

శ : బాగానే ఉంది. (నవ్వుతూ) ఈ వృద్ధాప్యంలో ఇంక అదే ఆరోగ్యం. ఆ...ఇప్పుడే వస్తా!(లోపలకువెళతాడు)

ర : (నాలుగువైపులా చూచి) ఉన్నవాడు లాగే కనిపిస్తున్నాడు

బ్ర : చాలా మంచివాడని కూడా విన్నాను. భార్య చనిపోయిన తరువాత మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు.

ర : అదలా కట్టిపెడుదూ ! మంచితనానికేం గాని మంచికట్నం లాగొచ్చు.

బ్ర : కట్నం...కట్నం తీసుకుంటా నను కుంటున్నావా ? లేదు. ఆ విషయంలో మాత్రం నా యిష్టం సుమా !

(లోపలినుంచి దగ్గు వినిపిస్తుంది)

ర : మాట్లాడకు. వస్తున్నట్టున్నారు.

(శర్మ – శారద ప్రవేశిస్తారు)

శ : (శారదతో) శారదా ! ఈయనే బ్రహ్మానందరావుగారు. (శారద బ్రహ్మానంద్ వైపుచూచి తలవంచుకుంటుంది.) బ్రహ్మానంద్ ! ఈమే నా ఒక్కగానొక్క కూతురు శారద. (చెప్పి కుర్చీ మీద కూర్చుంటాడు)

ర : (శారదతో) కూర్చోండి.

శ : కూర్చోమ్మా (శారద ఒక కుర్చీలో కూర్చుంటుంది.)

ర : ఎంతవరకు చదువుకుంది ?

శ : ఈ సంవత్సరమే బి.ఎ. పరీక్షకెళ్ళింది. సంగీతంకూడా వచ్చు.

ర : చాలా బాగుంది. సంగీత సాహిత్యాల కిక్కడ కలయిక బాగా కుదిరింది.

శ : మా అమ్మాయి ఇతర చదువుకున్న పిల్లలవంటిది కాదండోయ్! ఇంటి పనులన్నీ చక్కగా చేస్తుంది. మా అమ్మాయిని నేను ప్రశంసించటం బాగుండదనుకోండి.

ర : ప్రశంస వద్దులెండి, బాగానే ఉంది.

శ : నా కోరిక ఏమిటంటే పిల్లవాడు ధనవంతుడైనా సరే కాకపోయినా సరే పౌరుషవంతుడై ప్రయోజకుడై ఉండాలి. మంచి నడవడి కలవాడుగా ఉండాలి. 'బ్రహ్మానంద్'లో ఈ గుణాలన్నీ ఉన్నాయని నాకు తెలుసు.

బ్ర : ఏమండోయ్! మీ ప్రశంసకు నేనుతగిన వాణ్ణి కానేమో ! నన్ను సిగ్గుపడేటట్లు చేస్తున్నారు.

శ : లేదు బ్రహ్మానంద్! నేను నిజమే చెప్తున్నా. ఈ మాటలు నీ వినయ విధేయతల్ని కూడా బయట పెడ్తున్నాయి. నీతో మా శారద సుఖపడ గలదని నా నమ్మకం. (కొంచెం ఆగి) కట్నం అది యథాశక్తి గా ఇస్తాను.

బ్ర : దానిపేరెత్తకండి, నేను పెళ్ళి చేసుకునేది మీ అమ్మాయిని గాని కట్నాన్ని కాదు.

శ : ఏంచెప్తున్నావు ? బ్రహ్మానంద్! ఈ కాలపు కుర్రవాళ్ళు డిగ్రీలవారీగా కట్నాలు గుంజుతూంటే నువ్వు పెద్ద డిగ్రీ కలవాడవయినా కట్నం వద్దంటున్నావు! నిజంగా నీ చదువు సార్థకమయిందోయ్ ! అందరు యువకులూ నీలాటి ఉదారులైతే లోకం ఎప్పుడో బాగుపడి ఉండేది! మా శారదను నువ్వు స్వీకరిస్తే ధన్యుణ్ణవుతాను !

బ్ర : ముందు మీ అమ్మాయి నడగండి!

శ : ముందు మీకు నచ్చాలిగాని మా అమ్మాయి నామాట వింటుంది!

ర : మళ్ళీ...

శ : అమ్మాయ్! నీ కిష్టమేనా ?

శా : (సిగ్గుపడుతూ బ్రహ్మానంద్ వైపు చూస్తుంది)

శ : చెప్పమ్మా.

శా : మీమాట ఎప్పుడైనా కాదన్నానా నాన్నా !

ర : చాలు! మాకంగీకారమే!

శ : మీరు చాలా దయగల వారండీ! ఆఁ... సరేగాని వివాహం ఈ నెలలోనే కావాలని నా కోరిక! ఇవాళే పురోహితుణ్ణి రప్పించి ముహూర్తం పెట్టిస్తా!

ర : అయితే మాకు సెలవిప్పించండి! తొందర పనులున్నాయి !

శ : మంచిది! ముహూర్తం పెట్టించి కబురు చేస్తాను!

బ్ర : అయితే వెళ్ళొస్తాం! నమస్తే!

శ : నమస్తే!

శా : నమస్తే!

(బ్రహ్మానంద్ – రమేశ్, వెళ్ళిపోతారు, తెర పడుతుంది)

## 2

(కాశీలో నాగేశ్వర్ తన గదిలో తిరుగుతూ ఉంటాడు. తనచేతిలో శారద ఫొటో ఉంచుకుని ఆలోచిస్తూ ఉంటాడు. గదిలో మూడు కుర్చీ లుంటాయి)

నా : శారదా ! నన్ను క్షమించు ! ఇంట్లోంచి వెళ్ళిపోయేటప్పుడు నిన్ను కలుసుకోలేక పోయాను. అందుకు నేనెంత బాధ పడ్డానో ఈశ్వరుడికి తెలుసు. కాని ఏం చేస్తాను ? మీనాన్న నాకు చేసిన అవమానపు తీవ్రక్షోభ నా బుద్ధిని హరించేసింది. నేను గ్రుడ్డివాణ్ణయ్యాను. మామయ్యా ! నాసంపద నా తండ్రి పాపంతో సంపాదించినది కదూ ? మా వంశం మంచిదికాదు. నేను నీ ప్రియమైన కుమార్తెకు తగినవాణ్ణి కాదని ఇదివరకన్నావు. కాని నేనిప్పుడు మీ దృష్టిలో శారదకు తగినవాణ్ణిగానే తయారయ్యాను. లేకపోతే ఇప్పుడుకూడా ఏదైనా లోపముందా ? అమ్మా ! నన్ను క్షమించు. మామయ్య సూటిపోటు మాటలకు బాధపడి నిన్నువదిలి వచ్చేశాను. నేను చాలా కృతఘ్నుణ్ణి. కానీ అమ్మా ! నీ ఆశీర్వాద ప్రభావంవల్ల నేనిప్పుడు యోగ్యుణ్ణయ్యాను. ఇంక నీదగ్గరికి రావటానికి ఆలస్యం చెయ్యనమ్మా !

(ఇంతలో 'హరిప్రసాద్' ప్రవేశం).

హ : నమస్తే ! నాగేశ్వర్ !

నా : ఓ ప్రసాద్ గారా! రండి, రండి. కూర్చోండి.

హ : ఏదో ఆలోచనలో పడ్డారే!

నా : ఆలోచనేమీ లేదు! ఏదో ఇల్లు జ్ఞాపకం వస్తేను!

హ : అయితే మీరు తిన్నగా ఇంటికే వెడతారా?

నా : లేదు, తిన్నగా ఇంటికెళ్ళను. మొదట మద్రాసు వెళ్ళి అక్కడ డ్యూటీలో జాయినయి సెలవు తీసికుని కాకినాడ వెళతాను.

హ : ఇంటికెళ్ళి మమ్మల్ని మర్చిపోతారేమిటి? ఉత్తరాలు వ్రాస్తూ ఉండండి.

నా : వోహ్! ప్రసాదుగారూ! ఏం మాట్లాడతారు? మీవంటి ఉదారవ్యక్తిని నా జీవితంలో మర్చిపోగలనా?

హ : నాదేంవుంది. అంతా భగవంతునిదయ.

నా : మీరేం ఉపకారం చేయలేదంటున్నారు కాని మీరు ఆశ్రయమివ్వకపోతే నేనీ పట్నంలో తోకరాలుతింటూ తిరిగేవాణ్ణి. ఉద్యోగంలేక తిరుగుతూ ఉంటే మీరు దయతలచి నాకు సెంట్రల్ గవర్నమెంట్‌లో ఉద్యోగం ఇప్పించారు గనక గాని లేకపోతే నే నిల్లాఉందునా?

హరి ; నాదేముంది? నేను నా కర్తవ్యాన్ని నెరవేర్చానంతే!

నా : కర్తవ్యం!...మీతో సమానులైన కర్తవ్య పరాయణులైన వ్యక్తి ప్రపంచంలో ఇంకొకరుండరు! నాకా దినం జ్ఞాపకం వస్తోంది. సరిగ్గా నాలుగు సంవత్సరాల క్రితం నేను ఏ ఆధారం లేకుండా విశ్వేశ్వరాలయం వెనకాల పడిపోయి ఉంటే అప్పుడు మీరునన్ను మీ ఇంటికి తీసికెళ్ళి సోదరునివలె ప్రేమ చూపించారు. నాకుద్యోగం సంపాదించి పెట్టడానికి మీరెన్ని కష్టాలుపడవలసొచ్చింది? సాక్షాత్తు ఆ విశ్వేశ్వరుడే మీరూపంలోవచ్చి సహాయం చేశాడని నా నమ్మకం.

హరి : ప్రశంస విడిచిపెట్టండి గానీ ఇక్కడ నుండి మీకు 'రిలీవ్' అయిందా?

నా : ఇప్పటికి లేదు. బహుశ ఇవాళ దొరుకుతుందేమో!

హ : ఎప్పుడు బయలుదేరుతారు!

నా : రేపే వెళ్ళవలసి ఉంటుంది. అస లివాళ సాయంత్రం మిమ్మల్ని కలుసుకునేందుకు వచ్చేవాణ్ణే.

హ : మంచిది. (పర్సులోనించి డబ్బుతీసి) ఈ వందరూపాయలు ఉంచండి అవసరమైతే ఉంటాయి.

నా : "మెనీ మెనీ థాంక్స్" ప్రసాద్‌గారూ! కాని ఇప్పుడు వాటి అవసరంలేదు. మీ దయవల్ల నాదగ్గర కావలసినంత డబ్బుంది.

హ : అరె! ఇవికూడా ఉంచండి! తిన్నగా ఇంటిక్కూడా వెళ్ళటంలేదు.

నా : లేదు. క్షమించండి. నా కవసరమయితే మిమ్మల్నడిగే తీసుకుంటా.

హ : మీరుమాత్రం అడగడానికి సందేహించకండి.

నా : నాకా ... మిమ్మల్నడగడానికా?... సందేహం? భలేవారండీ.

(విశ్వనాథ్ ప్రవేశం)

వి : నమస్తే నాగేశ్వర్ — నమస్తే ప్రసాద్ గారూ.

నా : విశ్వనాథ్‌గారా? రండి. కూర్చోండి. (విశ్వనాథ్ కూర్చుంటాడు)

వి : మీ అభివృద్ధిని చూస్తూంటే నాకుచాలా ఆనందంగా ఉందండీ.

నా : ఏదో మీ అందరి దయాను.

వి : అదేం మాటండోయ్! మీ అభివృద్ధి మీ బుద్ధిబలం మీదే ఆధారపడి ఉంటుంది. అది సరేగాని మిమ్మల్ని చూస్తూంటే దుఃఖం, ఆనందంకూడా కలుగుతున్నాయండి. మీకు "సూపరింటెండెంట్" ఉద్యోగం అయినందుకు, సంతోషం, మీరు వెళ్ళిపోతున్నందుకు బాధగాను ఉంది.

నా : నాకుకూడ మిమ్మల్ని విడిచిపెట్టాలంటే చాలా బాధగా ఉందండీ. మళ్ళీ ఎప్పుడొస్తానో నాకే తెలియదు.

హ : ఢిల్లీ ప్రభుత్వంతో మాటలేమిటి? ఎప్పుడు ట్రాన్స్‌ఫర్ అవుతుందోఏమో?

వి : మీకు వీడ్కోలిచ్చే సందర్భంలో మా ఆఫీసువాళ్ళమంతా కలసి మీకు టీపార్టీ ఇవ్వడానికి నిశ్చయించుకున్నాము.

హ : బాగానే ఆలోచించారు మీరంతాకలిసి. ఎప్పుడు చెయ్యటం?

వి : ఇవాళ సాయంత్రం 5½ గంటలకి. ప్రసాద్‌గారూ! మీరుకూడా తప్పక రావాలి.

(అందరు వెళ్ళిపోతారు. తెరపడుతుంది)

## 3

(బ్రహ్మానందరావు గది. మధ్యన ఒక టేబుల్. రెండువైపులా కుర్చీలు. టేబుల్ మీద ఒక అలారం టైంపీసు ఉంటుంది. కొన్నిపుస్తకాలుఅందంగా సర్దబడి ఉంటాయి. ఒకవైపున బట్టల స్టాండు ఉంటుంది. శారద ఒకకుర్చీలో కూర్చుని స్వెట్టరల్లుతూ ఉంటుంది. ఆమె ముఖం ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లుంటుంది. బహ్మానంద్ ప్రవేశిస్తాడు. సూటుధరించి)

బ్ర : శారదా? ఏం చేస్తున్నావ్?

శా : వచ్చారా? (అంటూ లేచి కోటు పైతీసి స్టాండుకు తగిలిస్తుంది) ఏమీ చెయ్యటంలేదు. (అంటూ లోపలకువెళ్ళి కాఫీ తెస్తుంది. ఇద్దరు చెరొక కప్పు తీసికుని త్రాగుతూ ఉంటారు.)

శా : ఇవాళ తొందరగా వచ్చేస్తున్నారుగా?

బ్ర : అన్నాననుకో!

శా : అయితే ఇంతాలస్యం ఎందుకు చేశారు?

బ్ర : ఇవాళ కాలేజీలో మీటింగుంది!

శా : అయితే ఇవాళ సినీమా ప్రోగ్రామని ఎందుకన్నారు ?

బ్ర : నాకు ప్రొద్దున్నే ఏం తెలుసు? మీటింగుందని! కాలేజీకి వెళ్ళాక తెలిసింది. ఏం చెయ్యను మరి ? ఉండవలసి వచ్చింది !

శా : ఇప్పుడు టైము లేదూ ?

బ్ర : ఇప్పుడేముంది? (వాచీ చూచి) 7కూడా దాటిపోయింది. పోనీ రేపు వెడదాం.

శా : రేపుమాత్రం మీరు టైముకొస్తారని నమ్మకమేమిటి ? ఒకవేళ టైముదొరికినా ఏ ఫ్రెండో కనిపిస్తే అతనితో కబుర్లు చెప్పటంలో ఆకాస్త టైమూ అయిపోతుంది.

బ్ర : ఊహుఁ. రేపు అల్లా కానివ్వనుగా. తప్పకుండా వెడదాం!... సరేగాని ఇవాళ నీసంగీతం వినాలని ఉంది శారదా!

శా : నా సంగీతమా ?

బ్ర : ఏం? నీ సంగీతానికేం తక్కువా ?

శా : తక్కువని నేనన్నానుటండీ! ఆ సంగీతంలో ఉండే ఆనందం సినీమా సంగీతంలో ఉందేమిటి !

బ్ర : అచ్చు సరస్వతిలాగే మాట్లాడుతున్నావు. పూర్వం ఒకకవి ఏమన్నాడో తెలుసా ? "సంగీత మపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం" అన్నాడు. సంగీత సాహిత్యాల్ని రెండింటినీ నీలో చక్కగా ఇముడ్చుకున్నావు!

శా : (సిగ్గుపడి) పొండి! ఎప్పుడూ పొగడ్తలే మీకు! (ఒకప్రక్కకు వెళ్ళి నుంచుంటుంది)

బ్ర : ఏం ? కోప మొచ్చిందా ?

శా : (నవ్వుతూ) ఆఁ! బ్రతిమాలేవాళ్ళుంటే

బ్ర : (ఆమెదగ్గరకు వెళ్ళి) బ్రతిమాలనా ? ఎందుకు ?

శా : ఇవాల్టి ప్రోగ్రాం తారుమారు చేసినందుకు !

బ్ర : అదామాట! సరే బ్రతిమాల్తానుగాని ఎట్లా బ్రతిమాలను ? చూడు పూర్వం శ్రీకృష్ణుడు సత్యభామను బ్రతిమాలాడు. అట్లా బ్రతిమాలనా.

శా : మీ యిష్టం !

బ్ర : అయితే సరే! ఓ బ్రహ్మగారి రాణియైన శ్రీమతి శారదాదేవిగారూ! ఈ దాసుని మీద ప్రసన్నులు కండి! మీ మధుర సంగీతామృతాన్ని వర్షించి వీణ్ణి పవిత్రుణ్ణి చెయ్యండి ! (అంటూ నమస్కారం చేస్తాడు!)

శా : (అతని చేతులు పట్టుకుని) ఆపండి చాలు!

బ్ర : బ్రతిమాలించుకోవట మయిందా ?

శా : ఇదేనేమిటి ? బ్రతిమాలటమంటే: భార్యకు దణ్ణం పెడుతూ!

బ్ర : అరె ! అల్లా అంటావేమిటి ? ఆరోజుల్లో కృష్ణుడు సత్యభామ ఎడమకాలి దెబ్బకూడా తిన్నాడు ! ఇక్కడ పరిస్థితి అంతదాకా రాలేదు గాని.

శా : అయితే పాడుతున్నాను వినండి.

బ్ర : అయితే పాడండి. (కుర్చీలో కూర్చుంటాడు)

(శారద మధురంగా పాడుతూ ఉంటుంది)

(బయటనుండి ''బ్రహ్మానందం గారూ ! టెలిగ్రాం'')

బ్ర : తీసికుని చింపిచూస్తాడు అయ్యో !

శా : (ఖంగారుగా) ఆదేమిటండీ! అల్లా అయిపోయారేమిటి ?

(టెలిగ్రాం ఆమెచేతికిస్తాడు)

శా : (చదువుకుని) నాన్నా ! (అంటూ చేతుల్లో ముఖందాచుకొని ఏడుస్తుంది.

(తెర పడుతుంది)

## 4

(పార్కు ! నాగేశ్వర్ తమ్ముడు నారాయణ, అతని స్నేహితుడు ప్రభాకర్ మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.)

ప్ర : చూడు నారాయణా! నువ్వింత చెప్ప నవసరంలేదు. నేను చాలా పొదుపుగానే పనిచేస్తున్నాను. నిన్న దగకుండా నేనసలు ఖర్చేచెయ్యటం లేదు !

నా : అయితే ఫరవాలేదుగాని...మనం లెఖ్ఖ వేసినదానికంటే ఎక్కువ ఖర్చయిందని నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. పని చూస్తే కొంచెంకూడా కాలేదు. ఇంకా రికార్డింగు కూడా మొదలుపెట్టలేదు. ఇలా అయితే బండేం నడుస్తుంది.

ప్ర : మనం వెనుకముందు ఆలోచించకుండా ఈపని మొదలుపెట్టాం. అది మన తప్పేకాని ఇప్పుడేం చేస్తాం ? ఖర్చయిన డబ్బును వదులుకోలేం ! ఇప్పటికి '50' వేల రూపాయలు ఖర్చయ్యాయి ! వాటిని మళ్ళీ ఫిల్ము ఎలాగైనా పూర్తిచేసి దానిమీద రాబట్టాలి.

నా : అదే నేనూ ఆలోచిస్తున్నాను (కొంచెం ఆలోచించి) ఒక్కటేమార్గం కనిపిస్తోంది.

ప్ర ; ఏమిటది ?

నా : కొంచెంభూమి అమ్మేస్తే సరిపోతుంది.

ప్ర : (సంతోషాన్ని కనపడనీయకుండా) అదెల్లా కుదురుతుంది ?

నా : ఎందుకు కుదరదు ?

ప్ర : కోర్టువారు నిన్ను ఆస్థికి వారసుణ్ణి చేశారా ?

నా : ఆం. అదంతా అయిపోయింది. ఇంక ఆస్తికి హక్కుదారుణ్ణి నేనే! ఇంక నన్నెవరూ ఏమీ చేయలేరు!

ప్ర : నాగేశ్వర్ చనిపోయాడని ఎలా ఋజువు చేస్తావు ?

నా : అరె! భాయీ! ఆదంతా డబ్బులో ఉందనుకో! డబ్బుతో ఆకాశం మీది దేముడుకూడా మనపక్షంగా సాక్ష్యమిచ్చి అబద్ధాన్ని 'నిజం'గా ఋజువుచేస్తాడు. డబ్బులో అంత మహత్యముంది. నాగేశ్వర్ ఈ ఆస్థినంతా విడిచి ఎక్కడికో పారిపోయిన మాట నిజం! వాడిని వెతికించటానికి చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. అలాంటప్పుడు వాడు చనిపోయాడని ఋజువు చేయటం ఏమంత కష్టంకాదు.

ప్ర : వాడెప్పుడైనా హఠాత్తుగా ఊడిపడితే?

నా : ఇంకెక్కడ తిరిగివస్తాడు ? బ్రతికుంటే ఇప్పటి వరకూ తిరిగిరాడూ ? కనీసం శారదకోసమైనా తిరిగిరావాలి. ఎప్పుడైనా వాడు బ్రతికుండి తిరిగివస్తే అప్పటిమాటచూసుకుందాం. వాడెప్పుడో వస్తాడని ఇంత పెద్దాస్తిని చేతులారా వదులుకుంటామా ?

ప్ర : అది సరేగాని డబ్బెప్పటికి సర్దుబాటవుతుందో ముందు చెప్పు. 'యాక్టర్స్'కి ఎడ్వాన్సు కూడా ఇవ్వాలి.

నా : నేను ఎల్లుండివెళ్ళి పొలం అమ్మేసి డబ్బుతెస్తాను, అంత వరకూ కొంచెం సర్దుకో, సరేగాని ఎంతడబ్బు కావాలో చెప్పు.

ప్ర : 'ప్రఖ్యాత యాక్టర్స్'ని బుక్ చెయ్యటానికి అధమం 75 వేలైనా కావాలి.

నా : బాబోయ్! 75 వేలే ?... ఏమిట్రోయ్! నువ్వు డైరెక్టర్‌వయి నన్ను దివాలా తీయిద్దా మనుకుంటున్నా వేమిటి ?

ప్ర : ప్రొడ్యూసర్ని దివాలా తీయించి నేనెక్కడ కెడతాను ? నువ్వు చెప్తే పోసీ చౌకరకం యాక్టర్స్‌నే బుక్‌చేయిస్తాను.

నా : పేరుతోనే డబ్బువచ్చేది. హీరో హీరోయిన్ పాత్రలకు ప్రఖ్యాత యాక్టర్స్‌ని బుక్‌చెయ్యి. సైడ్ కేరక్టర్స్‌కి సెకెండ్ క్లాసువాళ్ళుచాలు. (జ్ఞాపకంచేసుకుంటూ) చూడు. ఆవేళవచ్చింది. ఆ అమ్మాయి పేరెవరు ?

ప్ర : "కమల."

నా : ఆ అమ్మాయిని 'హీరోయిన్'కిందబుక్ చెయ్యి. అందంగా ఉంటుంది. డ్యాన్సు చేస్తుంది. 'హీరోయిన్ కేరక్టర్' తీసికోవాలనే కోరికమీద ఎక్కువడబ్బు కూడా అడగదు.

ప్ర : నువ్వు చెప్పింది బాగానేఉంది. కాని ఆ అమ్మాయి డ్యాన్సు ఎల్లా ఉందో చూడొద్దూ ?

నా : ఒక ట్రెయిల్ ఎరేంజ్ చేద్దాం.

(ఇద్దరూ వెళ్ళిపోతారు. తెరపడుతుంది)

(సశేషం)

# లలనావనం



## ✻ పిల్లల పెంపకం - పెద్దల విధులు ✻

—ఊటుకూరు శకుంతలాదేవి

అత్యంత విప్లవాత్మక పురోగమనంలో వున్న యీ యిరవయ్యో శతాబ్దంలో ప్రపంచం పురాతన దృక్పథం నుండి, అధునాతన దృక్పథానికి అతి వేగంగా ప్రయాణిస్తున్నది. వినూత్న పరిణామాలతో కొత్త లోకం ఒకటి ఉద్భవిస్తున్నట్టనిపిస్తుంది. ఈ లోకంలో మానవుడి ఉనికికి వున్న ప్రాధాన్యం అనితరమైంది. కాలానుగుణమైన లక్షణాలతో మానవుడు సిద్ధం కావలసి వుంది. యీ అవసరం దృష్ట్యా, ఈ ప్రపంచంలో భావిపౌరులుగా ప్రవర్తిల్లగల మన సంతానం విషయంలో అమితమైన శ్రద్ధను ప్రదర్శించవలసి వుంటుంది. మన పిల్లలు పెరిగి, పెద్దవాళ్ళై, ఈ విశ్వ సౌభాగ్యాన్ని సంపూర్ణంగా అనుభవిస్తూ అధికం చేసే నిమిత్తం తగిన అర్హత గల వారుగా రూపొందాలి. వారు మానవ సహజమైన యదార్థ జీవనమార్గంలో ముందుకు నడవాలి. మానవతా దృష్టిలో జీవించాలి. ఈ సందర్భంగా పెద్దలైన తల్లిదండ్రులు, తమ సంతానం పెంపకం పట్ల నిర్వర్తించవలసిన బాధ్యతలను ముందుగా అర్థం చేసుకోవలసి వుంది.

పసితనం నుంచీ పిల్లలకు యే లక్షణాలు అబ్బితే ఆ లక్షణాలతోనే వారు ప్రాపంచిక జీవితరంగం మీద ప్రవేశిస్తారు. సరియైన శిక్షణ, పోషణ లేకుండా పెరిగితే, జీవిత మార్గంలో కూడా వారు శిక్షణ సభ్యత లేకుండానే ప్రవర్తిస్తారు. తప్పితే, సత్ప్రవర్తన అవలంభించ లేరు.

మానవుడు యదార్థ ప్రపంచంలో తాను చేస్తున్న పనులకు తగిన విధంగానే ఫలితాలను పొందుతూంటాడు. మంచి పనికి మంచిఫలితం, చెడు పనికి చెడు ఫలితం యేర్పడటమనేది అత్యంత వాస్తవికమైన విషయం.

గృహంలోనూ, పరిసరాలలోనూ, మంచి వాతావరణం, మంచి అలవాట్లూ వుంటే, పెరిగే పిల్లలలో కూడా, చక్కని అలవాట్లూ, సత్ప్రవర్తన తప్పనిసరిగా అబ్బుతాయి. పసిపాపలూ, పిల్లల మనస్సుల్లో ఉన్నతమైన, ఉత్తమమైన ఆశయాదర్శాలు నెలకొనాలంటే, చిన్నతనం నుంచీ తగినంత శిక్షణ అత్యావసరంగా వుండాలి. వారికి అభ్యుదయ దృక్పథంతోపాటు, ఆత్మవికాసం, నవ జాగృతి కూడా శిక్షణ ద్వారా లభిస్తాయి.

"యేది చేస్తామో, అది అనుభవిస్తాం" 'యెవడు విత్తనాలు వేస్తాడో, వాడే పంటను అనుభవిస్తాడు'. అనే లాంటి సామెతలు మనకు తెలియనివి కావు. పిల్లల మనస్తత్వాన్ని, భవిష్యదభ్యుదయ పథానికి సక్రమంగా మళ్ళించని పక్షంలో, వాళ్ళ ఆలోచనలూ, భావాలూ మరో రకంగా పరిణతి చెందుతుంటాయి. కష్టం లేకుండా సత్వరం అలవడే దురభ్యాసాలూ, మోసం, అబద్ధాలవైపు అతి త్వరగా ఆకర్షింపబడతారు.

మానవుడు అలవాట్లకు బానిస.... అభ్యాసాలకు అనుగుణంగానే ప్రవర్తన యేర్పడుతుంది .... ప్రవర్తన ద్వారానే సచ్ఛీలం, అశ్లీలాలూ ఆవిర్భవిస్తాయి. అభ్యాసాలు చెడ్డవి పట్టుబడితే, ప్రవర్తన కూడా అపవిత్రంగానే వుంటుంది. వయస్సు ముదిరినకొద్దీ యిది మరింత ప్రగాఢమై విసర్జించడం అగాధమైపోతుంది.

సదభ్యాసాలు, మానవుణ్ణి సత్ప్రవర్తకుడిగా తీర్చి దిద్ది, భవిష్యజ్జీవితానికి

బంగారు బాటలను వేస్తాయి. కాబట్టి, పిల్లల అభ్యాస పరిశీలన జరపడంలో, తల్లిదండ్రులు యే మాత్రం అశ్రద్ధ, నిర్లక్ష్యవైఖరిని ప్రదర్శించినా వారికండ్ల ముందే వారి సంతానం అప్రతిష్ఠాపరులుగా, సోమరిపోతులుగా సిద్ధం అవుతారు. వాళ్ళకు వాళ్లే సమస్యలు కావటమేకాక, తల్లిదండ్రులు కూడా అనేక సమస్యలు తెచ్చిపెడుతూంటారు. అలవాట్లు ప్రబోధించడం పసితనంలో కొంచెం కష్టమే అయినప్పటికీ, తల్లిదండ్రులలో విసుగూ, నిరాశ వుండకూడదు. అస్తమానం పిల్లలకు మంచి విషయాలు నూరిపోస్తూ, మెదడు కెక్కిస్తుంటే అంత కష్టం కూడా అనిపించదు.

కాలం యెంత వేగంగా పురోగమిస్తున్నా, నూత్నయుగ పరిణామాలు అసంఖ్యాకంగా యేర్పడుతున్నప్పటికీ, మానవుడు నాటికీ, నేటికీ మానవుడుగానే వున్నాడు కాబట్టిన్నీ, మానవుడు యేదో వొక శిలలోనుంచో, లేక యంత్రంలోనుంచో, జన్మించడం లేదు కాబట్టిన్నీ యే కాలంలోనైనా యే యుగంలోనైనా, పిల్లల పెంపకంపట్ల తల్లిదండ్రులు శ్రద్ధాళువులై వుండటం, సర్వకాలాలకూ బాధ్యత వహించిన మౌలిక విషయం....యీ ప్రపంచం ఇలా వున్నంతవరకూ ఇది ఉంటూనే ఉంటుంది. దీనిని గుర్తించకుండా తల్లిదండ్రులు ప్రవర్తిస్తే, సమయం దాటిపోతుంది....మొక్క మ్రానుగా మారుతుంది. చేతులు కాలిన తరువాత ఆకులకోసం వెదకినట్టుంటుంది. పిల్లలను బాధ్యతగల సక్రమ పౌరులుగా తయారుపరచడమనేది పసితనంలోనే సాధ్యం, కాని మరొకప్పుడు కుదురదు. పసివాళ్ళ జీవితాలను మంచిగా మలచి నిర్మించడానికి ప్రయత్నించకుండా వాళ్ళ అదృష్టానికి వాళ్ళను వదలికూర్చుంటే, వాళ్ళకి త్వరగా పట్టుబడేవి, దురభ్యాసాలూ, దుష్ప్రవర్తన, నేరమనస్తత్వం.. తుదకు జీవితం నరకప్రాయం...ఏనం దేన్ని వద్దని కోరుకుంటామో, అదే మన పిల్లలలో ప్రత్యక్షం అవుతుంది.

పిల్లలకు సత్ప్రవర్తన అలవరచి, నీతిని బోధించడానికి, తల్లిదండ్రులు కేవలం దండనీతిని ఆశ్రయిస్తేనే సత్ఫలితాలు లభించవని బాగా గుర్తుంచుకోవాలి. వాళ్ళ మనస్తత్వాన్నీ, అభిరుచులనూ పూర్తిగా పరిశీలించి, బోధనా విధానం నిర్ణయించుకోవాలి. దీనికి నిరంతరశ్రద్ధ అవసరం.

జీవితం కేవలం స్వప్నంకానీ, ఆటకానీ కాదు.. సక్రమంగా జీవించటాన్నే జీవితం అంటారు. ఇదొక సహజసత్యం... అర్థమూ ఆశయమూ లేకుండా యీ జీవితాన్ని నిరామయంగా, నిష్కర్మంగా, నడపడం మృతితో సమానమేఅవుతుంది.. ఏదో బ్రతకాలి కాబట్టి, ఎలాగైనా బ్రతకవచ్చు ననుకోవటంలో అర్థంలేదు. బాధ్యతతో మానవుడు నిర్వహించ వలసిన విధులను జయప్రదంగా నిర్వర్తించడమే జీవితానికి సార్థకం. ఇలా జీవించడానికే నిరంతరం మానవుడు యత్నించాలి. పసిపిల్లలకు జీవితమంటే యేమిటో అర్థం తెలియదు. తెలియజెప్పటంకూడా చాలా కష్టమే. అయినప్పటికీ, అలవాట్ల ద్వారా పిల్లలకు ఆచరణరూపంలో ప్రబోధించాలి. జీవితంలో లభించే ఫలితాలను అనుభవించడానికి తగిన హృదయాన్నీ, బలాన్నీ పెంపొందించాలి. ఉత్తమత్వం, ఆశాభావం, సహనం, సత్యం, శాంత స్వభావాలను పిల్లలలో ఉద్బుద్ధం చేయాలి. జీవితంపట్ల ప్రగాఢమైన అనురక్తిని ప్రబోధించాలి. ఆ అనురక్తి లేకుంటే మనుష్యుడు నిరాశతో విముఖుడై పోతాడు. ఆచరణ స్వభావంలో పిల్లలు వీటిని అలవరుచుకుంటే, భవిష్యజ్జీవితంలో, కష్టసుఖాలన్నిటినీ సహనధైర్యాలతో తట్టుకోగలుగుతారు... జీవితాన్ని ఆనందప్రదం చేసుకోగలుగుతారు.

"మంచివిద్య మంచిబుద్ధులను చేకూరుస్తుంది." అన్న విషయాన్ని తల్లిదండ్రులు ప్రప్రథమంగా జ్ఞప్తిలో వుంచుకోవాలి. మంచివిద్య అలవడటానికి పిల్లలపట్ల శ్రద్ధ గైకొనాలి. పిల్లలుగలయింట్లో తల్లిదండ్రులు అవలంబించే ప్రవర్తన మొదలుకొని, పాఠశాలలో ఉపాధ్యాయుడు బోధించే పాఠాలవరకూ 'విద్య' అనే అనవచ్చు. పిల్లలకు భయాన్నీ, బలహీనతనూ కల్పించే విద్యనుండి జాగ్రత్తపడాలి. పిల్లలుగల కుటుంబంలో, తల్లిదండ్రులూ, తదితర పెద్దల ప్రవర్తన శీలసంపన్నమై వుండటం, యీ సందర్భంగా అత్యంతావసరం. ఇదే తల్లితండ్రులకు పరీక్ష అనుకోవచ్చు. పెద్దవారి ప్రవర్తనా సరళి, పిల్లలకు తేలికగా విద్య పట్టుబడుతుంది.

పెద్దల ప్రవర్తన అశ్లీలంగానూ, బాధ్యతారహితంగానూ వుంటే వారు పిల్లలకు నీతిపాఠాలు బోధించే హక్కును కోల్పోతారు. పిల్లలు ఒకరు చెప్పనవసరం లేకుండానే పెద్దల ఒరవడిలో నడిచి, ఆ గుణాలను అలవరచుకొంటారు. స్వచ్ఛమైన హృదయాలూ, ఉన్నతమైన ఆదర్శాలూ, పవిత్రజీవనంగల కుటుంబంలోని సంతానానికి అవే లక్షణాలు సహజంగా అబ్బుతాయి. ఇది నూటికి నూరు

పాళ్ళు సత్యం కాకపోవచ్చు. కాని, సహజమైనయదార్థంగా అంగీకరించవచ్చు.

తమ పిల్లల స్నేహితులూ, స్నేహలక్షణాలూ, వాతావరణం గురించికూడా పెద్దలు చాలా జాగ్రత్తగా గమనించాలి. దురభ్యాసాలు ప్రకోపింపజేసే స్నేహ వాతావరణం నుండి పిల్లలను దూరంగా వుంచడం, పిల్లల అభిరుచులకు అనుగుణమైన, మనోల్లాసకరమైన ఆటవస్తువులూ, ఆటలనూ ప్రోత్సహించడంకూడా ప్రధానంగా గుర్తించాలి. పిల్లలకు అన్న వస్త్రాలిచ్చి పోషించటం, సేవ చేయటమే కర్తవ్యం కాకుండా, తల్లిదండ్రులు పిల్లలకు స్నేహితులవలె కూడా ప్రవర్తించాలి. మంచి మార్గంలో ప్రయాణించటానికి మంచిసలహాలనిస్తూ గురువులుగా నిలబడాలి. పసితనంలోనే, ధైర్యం, ఆత్మవిశ్వాసం ప్రబలమయ్యే విధంగా చూడాలి.

పరిశుభ్రత, దేహపరిశ్రమ యొక్క సత్ఫలితాలను పిల్లల మనస్సుల కెక్కేటట్లు ప్రబోధించడం ఎంతైనా అవసరం. పరిశుభ్రత లేకుంటే వ్యాధులు వస్తాయనీ, దేహపరిశ్రమ లేకుంటే ఆరోగ్యం అభివృద్ధి కాదనీ వీలైనంతవరకు నచ్చచెప్పి ప్రోత్సహించాలి పరిశుభ్రత, పరిశ్రమవల్ల శరీరం ఆరోగ్యకరంగా వుండటమే కాక, పిల్లలకు మానసిక వికాసం, మెదడులో చురుకుదనం అభివృద్ధి అవుతుందని నిరూపించాలి.

ప్రతిదినం వేకువజాముననే మేల్కొని ముఖంకడిగి స్నానంచేసే స్థితికి పిల్లలను అలవాటు చేయాలి. భోజనాన్ని పూర్తిగా నమలిన తరువాతనే మింగటం, యెప్పుడూ చిరునవ్వుతో మాట్లాడటం, చిరాకుపడకుండా వుండటం గురించి, బోధించడం చాలా మంచిది. తల్లిదండ్రులు ప్రతిరోజూ పిల్లలకు వీటిని, వల్లెవేసి చెబుతూంటే, ప్రథమంలో వారు అర్థం చేసుకోలేకున్నా, క్రమక్రమంగా త్వరలో అర్థంచేసుకొని, అనుసరించగలరనడంలో ఏమాత్రం సందేహంలేదు. ఓపికతో విడమర్చి చెప్పకుండా పిల్లలు యేదీ అర్థంకానిదశలోనే వున్నప్పుడు, వారిని కొట్టడం, తిట్టడం, బెదిరించి చెప్పడంలాంటివి పనికిరావన్నది ముఖ్యంగా తల్లిదండ్రులు గమనించాలి. దెబ్బలూ, భయంవల్ల పిల్లలలో కలిగే క్రమశిక్షణ హృదయపూర్వకమైన పరిణామం కాదు. అలా కలిగే పరిణామం తాత్కాలికమైనది మాత్రమే అవుతుంది. తిట్లకూ, కొట్లకూ, బెదిరింపులకూ అలవాటైన పిల్లలు క్రమంగా వాటినికూడా లక్ష్యం చేయకుండా, స్వేచ్ఛాప్రవర్తకులౌతారు. కాబట్టి ఆ అలవాటు కానీయరాదు. శాశ్వత ప్రయోజనాన్ని చేకూర్చేశిక్షణ, పరిణామం పసివారిలో కలగాలంటే తల్లిదండ్రుల ఓపికకూ, యుక్తికీ పరీక్ష యేర్పడితీరాలి.

సాధారణంగా పసివారికి ఐదు లేక, ఆరు సంవత్సరాలవయస్సునుండీ ప్రపంచ జ్ఞానం యేర్పడుతుంది. అన్నిటినీ ఊహాలు యేర్పడుతుంటాయి.... కాబట్టి పిల్లలకు ఐదేండ్ల ప్రాయంనుంచీ ప్రవర్తనా సరళినీ, క్రమశిక్షణనూ బోధించాలి. అప్పుడు అభ్యసించేదేదైనా, భవిష్యజ్జీవితానికి పునాదిగా నిలబడిపోతుంది.... పెరుగుతున్న పిల్లలముందు, పెద్దలు అబద్ధాలాడటం జరిగితే, పిల్లలకి అబద్ధాలు చెప్పడానికి మరోగురువు అవసరం వుండదు. కాబట్టి. పిల్లలుఅడిగేప్రశ్నలూ, సందేహాలకు యదార్థమైన విధంగానే ప్రత్యుత్తరాలివ్వాలి.... తెలియని అమాయక ప్రశ్నలు అర్థరహితంగా వేస్తే, వారిని బుజ్జగించి ప్రేమతో సరిదిద్దాలి కాని, చికాకుతో కోపపడకూడదు. మంచి విషయాలలో పిల్లలు తమ అభిరుచిని ప్రదర్శిస్తూంటే వారిని అభినందించి, ప్రోత్సహించి, యింకా మంచిగా ప్రదర్శించే విధంగా బోధించాలికాని, వెక్కిరించడం పొరపాటు. ఉదాహరణకు ఒక పిల్లవాడు ఒక బొమ్మను గీసి, తండ్రికి చూపిస్తాడనుకుందాం. అదివంకర గీతలనీ, నీ ముఖంవలెనే వుందనీ అంటే, కుర్రవాడు నిరుత్సాహపడిపోతాడు. ఒకటి రెండు ఇలాంటి సంఘటనలతో అతని అభిరుచి అస్తవ్యస్తమై పోతుంది. కాబట్టి మంచి అభిరుచులకు మార్గం చూపాలి కాని, నిరుత్సాహ పరచకూడదు. అలాగే ఆహార విహారాలలో కూడా పిల్లలపట్ల చాలా జాగ్రత్తను పెద్దలు ప్రదర్శించాలి. అధికంగా తినడం మంచిదికాదని బోధించాలి కాని, అరుస్తూ ఆహారం పెట్టనని మొండిగా సమాధానాలు చెప్పరాదు.

కొంతమంది తల్లిదండ్రులు పిల్లల పాలిటికి యమకింకరులవలె తయారై అనుక్షణం వారిని దెబ్బలతో నానా యాతనలకు గురిచేస్తూ చాలా కఠోరంగా ప్రవర్తిస్తూంటారు.... పిల్లలు స్వేచ్ఛగా ఆటాడుకోవడాన్నికూడా అరికడతారు. అల్లరి భరించలేమని యెంతో యిదిగా చెబుతారు. కాని దీని దుష్ఫలితాలను మాత్రం గ్రహించరు. ఇంట్లో పిల్లలు అల్లరి చేస్తూవుంటే, అలా చేయవద్దని, నర్మగర్భంగా మందలించాలి. ఇంట్లో అల్లరిచేయటం యింట్లోవారికే కాక, పక్కయింట్లో చదువుకునే పిల్లలకూ రోగగ్రస్తులకూ అశాంతికర మవుతుందని

బోధించి, పిల్లలను బాధ్యత గుర్తించే విధంగా చేయాలి. చెబితే పిల్లలు గ్రహించలేరనుకోవడం పొరపాటు. వాళ్ళన్నీ అర్థం చేసుకోగలుగుతారు. నోరులేని పశువులకుకూడా శిక్షణ యిస్తే నేర్చుకొని మనగలుగుతున్నప్పుడు పిల్లలు నేర్చుకోరనడం అవివేకమే. చెప్పే విధంగా చెప్పాలి. అంతే.

పిల్లలు డబ్బుని అధికంగా దుర్వ్యయం చేస్తుంటే, డబ్బువిలువనూ, డబ్బు సాధించడానికి పడే శ్రమనూ వారికి చెప్పాలి. దుర్వ్యయాన్ని అరికట్టాలి. కుటుంబం ఆర్థిక స్థితిగతులతో పరిచయం కలిగిస్తూ వుండాలి.

పెద్దవాండ్లకు వున్నట్టే పసివాళ్ళకూ్కడా, అభిమాన రోషాలు అనేవి వుంటాయి కాబట్టి, ప్రతివిషయానికీ, పిల్లలను, వారి తోటి స్నేహితులముందు పల్చదనంగా మాట్లాడ్డం పనికిరాదు. అలా చేయటం వాళ్ళ ఆత్మవిశ్వాసాన్ని దెబ్బకొట్టినట్లవుతుంది. పసిహృదయంలో, స్వయంగా తక్కువతనపు భావం ప్రజ్వరిల్లుతుంది. సిగ్గుపడిపోతారు. ఇన్నిటికీ తోడు పిల్లలకు పసితనంనుంచీ, ఆజ్ఞాపాలనం అభ్యసింప జేయాలి. వాళ్ళతో చిన్న చిన్న పనులు చేయిస్తూ, తమ ఆజ్ఞలు విధేయతతో పాటించడాన్ని నేర్పాలి. యింటికివచ్చిన పెద్దలను గౌరవించడం విధేయంగా మెలగడం కూడా అలవాటు చేయాలి.

పెద్దలు తమ పనులన్నిటికీ క్రమశిక్షణతో, నిర్ణీత సమయంలో నిర్వహిస్తూ పిల్లలకూ్కడా అలాగే నిర్వహించడాన్ని నేర్పి, సోమరితనం పాలుకాకుండా చూసుకోవాలి. శరీరశ్రమయొక్క అవసరాన్ని, విలువనూ గుర్తింపజేయాలి.

బాధ్యతలను గుర్తింపజేసి, పిల్లలను భావి పౌరస్వత్వానికి అర్హులుగా తీర్చిదిద్దవలసిన ప్రధానబాధ్యత ముఖ్యంగా తల్లిదండ్రులమీదనే ఆర్థికంగా వుంటున్నదన్నది నిర్వివాదాంశం. తల్లిదండ్రులు తమ యీ బాధ్యతలు గుర్తించితేనే పిల్లలు భావిభారత భాగ్యవిధాతలైన పౌరులుగా సిద్ధం అవుతారు. వారే యీ మహత్తర విప్లవాత్మకమైన దేశాభ్యుదయానికి వారసులు కాగలుగుతారు. తమ సహజ వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూ ధీరులుగా, స్వతంత్రులుగా జీవితాలు గడపగలుగుతారు. పెద్దవారే తమ బాధ్యతలను విస్మరిస్తే పిల్లలు ఆ కుటుంబాలకే కాకుండా, దేశానికే భారకారణంగా గుదిబండలుగా తయారవుతారు. పిల్లల పెంపకంపట్ల తమ బాధ్యతలు గుర్తించలేని తల్లిదండ్రులూ, పెద్దలూ, ఒక విధంగా తమ పిల్లల్ని అంధకారంలోనికి యీడుస్తున్నారని చెప్పవచ్చు... మన సంతానంద్వారా, మన దేశాన్ని నందనవనంలా చేసుకోవడం ప్రతివారి ప్రధానకర్తవ్యంగా భావించాలి. ★

# పదినేముత్యాలు

ధాత్రి న్భక్త జనానురంజనముగాఁ
దత్త్వప్రకాశంబుగాఁ
జిత్రార్థాంచిత శబ్దబంధురముగా
సేవ్యంబుగా సజ్జన
శ్రోత్రానందముగా శుభాంచితముగా
శోధించి స్వరేశ్వర
స్తోత్రింబన్నయ చెప్పె నిజ్జగములో
శోభిల్ల సర్వేశ్వరా ! ॥

తరులం బుష్పలు పిందెలై
యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర ! మీ పాదపయోజపూజితము
లై యత్యద్భుతం బివ్విరుల్
కరులౌ సత్వములౌ నవర్ఘమణులౌఁ
గర్పూరమౌ హారమౌ
దరుణీ రత్నములౌఁ బటీరతరులౌఁ
దథ్యంబు సర్వేశ్వరా ! ॥

ఒకపుష్పంబు భవత్పదద్వయము
పై నొప్పంగ సద్భక్తి రం
జకుడై పెట్టిన పుణ్యమూర్తికిఁ
బునర్జన్మంబు లేదన్నఁ జా
యక కాలత్రిత యోపచారముల
నిన్నర్చించుచోఁ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాడు
నీవగుట దాఁజిత్రింబె సర్వేశ్వరా ! ॥

అతిలాలిత్యముగా నహర్నిశము
నిన్నర్చింపఁగా వచ్చును
వ్రతుఁడై యుండఁగవచ్చు
నెల్లకళలం ప్రౌఢుండుగావచ్చు వా
క్పతిగా నైననువచ్చుఁగాని మఱి
నీ భక్తుండు గారాదు ను
స్థిగిగా నీదయ లేనిమానవునకుం
జింతింప సర్వేశ్వరా ! ॥

చావం బుట్టుచుఁ బుట్టఁజచ్చుచు
మహాచండాల సంసార పా
రావారంబునఁ గూలి తాఁ
జెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో
నేవం బొందక యేసు నీవనుట
తా నేజ్ఞానమో శ్రీ మహా
దేవా యిట్టికుతర్కముం
గలదె చింతింపంగ సర్వేశ్వరా ! ॥

ఏయే వేళల నే వయస్సున
నరుండే భూమి నే యూరిలో
నేయే కర్మము నాచరించు
నశుభం బేని న్శుభంబేనిఁ దా
నాయా వేళల నా వయస్సున
నరుండాభూమి నాయూరిలో
నాయా కర్మఫలంబు లెల్ల నగుఁ
దథ్యంబింత సర్వేశ్వరా ! ॥

పరమార్థంబుగ నా మనంబున
భవద్భక్తి ప్రభావంబు వి
స్తరమై పుట్టగు పుట్టినం బ్రబల
దంతం గొంత వర్ధిల్లెనే
విరసంబై యటమీఁదఁ జిక్కువడు
భావింపంగ నెట్లన్న న
స్థిరుడం గాన జడుండ గాన
బకవేషింగాన సర్వేశ్వరా ! ॥

కాయం బన్నది వారి బుద్బుద
సదృశం బందు రూపింప లేఁ
బ్రాయంబన్నది శారదాంబుదతటి
త్ప్రాయంబగున్ దత్సుఖ
శ్రేయంబన్నది మాయ యిల్లెఱిఁగి
యున్
శీఘ్రుంబె నీధ్యాన సం
స్థాయీభావనఁ బొందఁడేమిటి
కయో సంసారి సర్వేశ్వరా ! ॥

శ్రీ సర్వేశ్వరుఁగా సదాశివునిఁగా
జిద్రూపునింగా నిరా
భాసాఖ్యాతునిఁగా నిరంజన
పరబ్రహ్మంబుగా బ్రహ్మవి
ద్యాసారాంగునింగా నిరంతరము
నే ధ్యానింతు హృత్పద్మ సీ
తాసీనస్థిరుఁగా గురుప్రభుని
లీలానంద ! సర్వేశ్వరా ! ॥

చూచేవారలఁ జూచువాని
మదిలోఁ జూచేటి వా రెప్పుడున్
జూచేచూపును జూచువారి
తరముం జూడంగబోరాత్మనున్
జూచేవారల భేదభేదముగలిన్
జూడండ్రు చూచేది చూ
పాచూపే తెలివండ్రు
కోవిదులు లీలానంద ! సర్వేశ్వరా ! ॥

— యథావాక్కుల అన్నమయ్య

* * *

అలుకునెడ తొనిచల్లుట
కులుబల్లము కాదు మిగులఁ గూర్చుట
కొఱకే

వలయు నెడ నర్థమిచ్చుట
వెలయఁగ నభివృద్ధికొఱకె వినురా
సుమతీ ! ॥

ఎన్నడు గుడువక నధికతఁ
నన్నేమరి కూర్చుధనము ధరలో
నెపుడున్
అన్నలకును రాజులకును
గన్నములకుఁ బోవుచుండుఁ గదరా
సుమతీ ! ॥

సిరి తన్ను వలఁచియుండఁగ
సిరిగల్గినచిన్నె లెల్లఁ జేయఁగవలయున్
సిరిఁగూర్చి పొరలాడిన
సిరియుండదు లోభియొద్ద సిద్ధము
సుమతీ ! ॥

బిరుసైన హయము నెక్కకు
పరుమాటం బలుకుసుతుని మానక
విడుమీ
వెర వెఱుఁగని......
తరచుగ సతిఁగవయఁజనదు ధరలో
సుమతీ ! ॥

రిపుపొత్తు పాముపొత్తును
గపటాత్ముని మిత్రుపొత్తు గడుసరి
పొత్తున్
విపరీతి భార్యపొత్తును
అపదప్తను చేతవచ్చు నదిగో సుమతీ! ॥

— బద్దెన "సుమతీశతకం" (అముద్రితం)

*  *  *

వెదమతియై యుదారగుణ
వీరగుణంబులు బీజమాత్రమే
ర్పడినను నీగి నాటు కలుపండగు
దానగుణంబు లోభికిన్
బోడువఁగ నోడుబీతునకు
బోటును నేర్పడఁ జెప్పుచుండఁగాఁ
దొడరినమంత్రి తానె పగతుండగు
నన్న నగంధవారణా ! ॥

సతికంటె నబల వసుమతి
సతి పతిలేకున్న జెడదు సత్యముధాత్రీ
పతి లేనినాఁడు సద్య
చ్యుతి వసుమతి కండ్రు నన్నెచోడ
నరేంద్రా ! ॥

దానగుణంబ యెన్నఁగఁ
బ్రధాన గుణం బదియున్న గల్గినన్
గాని విశేషమై పురుషకారము
నివ్వదు లోభి నాఁగఁ జ
న్నెని యశంబు సత్త్వము
సహిష్ణుతయున్ విభవంబు విద్యయున్
మానము శీరమున్ వృథయ
మానిసికిం బరపతు భైరవా ! ॥

క్రూరాహు లెగసి కలచిన
వారిధియే మేర దప్పివచ్చినఁ బతిదాఁ
గ్రూరుండైనను బ్రజ సం
హారము గాకున్నె దశదిశాభరణాంకా!

కులము కుపుత్రుచేఁ, జెలిమి
కూర్పమిచేఁ దనయుండు ముద్దుచేఁ
బలుకనృతముచే నడత
పానముచే, ముని సంగమంబుచే,
పలను ప్రతిజ్ఞచే దొర వివాదముచేఁ,
దనయొప్పు లేమిచేఁ,
గలిమి మదంబుచే, మతి
వికారముచేఁ, జెడు బద్దె భూపతీ!"

— బద్దెన–నీతి ముక్తావళి

*  *  *

భూతలపతి వితతాజ్ఞా
జ్యోతిఁ బ్రవర్తింపకున్న సూర్యాగ్నిశశి
జ్యోతులు వెలుంగవు గాన వి
చేతనముం బొందిసృష్టి చీఁకటిగాదే.

సతత సుఖానుభవంబులు
నతిశయవిభవములు తా నృపతి
యాశ్రితజన సం
తతికైన లేవె ధరణీ
పతికాజ్ఞయగాక రాజ్యఫలముదలఁపన్.

పసరము పసరమ పులి పులి
బిసరుహాసంభవుని దృష్టి పెంపెంత
మహిం
బసరముఁ బులిచేయుం బులిన్
బసరముగాఁ జేయు నృపతి బల మది
గాదే !

రాజు నిజప్రభావ మభిరక్షణ
మెప్పుడు సేయ భూజనుల్
రాజున కర్థవృద్ధియు ధరం
బహుభంగులఁ గూర్తురిందులో
రాజభివృద్ధికంటె జనరక్షయ
యుత్తమ మెందు భూజనుల్
రాజసురక్ష లేక చెడి
రాజభివృద్ధి యొనర్ప నేర్తురే.

చాలప్రజఁ బ్రోరకయె యం
గోలాసంబాడితప్పింకొనుచుండెడిభూ
పాలకుండు కుప్పఁ జిచ్చిడి
ప్రేలలు వెదకికొనితినెడు బేలతలంపన్.

— శివదేవయ్య - పురుషార్థసారం



# సెలవుల్లో...

అక్కిరాజు జనార్దనరావు

తమ్ముళ్లూ, చెల్లాయిలూ!

నిజానికి మనలో వారాంతపు సెలవు అంటే ఆదివారం కొరకు ఎదురు చూడని వారు వుండరు. సోమవారం మొదలు శనివారం వరకు ఆరురోజుల కార్యభారం అనంతరం ఇక ఈనాటికి దానిని కట్టిపెట్టి ఆటపాటలకు దిగండంటూ ఆదివారం వస్తుంది. ఈ ఎదురు చూపులో అందరూ ఒకే విధమైన ఉత్సాహం, ఆసక్తి కనబరచినప్పటికీ వారి వారి అభిరుచి, మన సత్వాన్ని బట్టి ఈ 'నిరీక్షణ లోని ఉద్దేశం విభిన్నంగా వుంటుంది. రాముడు, రంగడు – వీరిద్దరూ ఆదివారానికై ఎంతో కుతూహలంతో ఎదురు తెన్నులు చూచేవారే. అయితే ఈ ఎదురు చూపులో రాముడి ఉద్దేశం ఒకటైతే రంగడి ధ్యేయం మరొకటి. రాముడికి చదువు సంధ్యలంటే శ్రద్ధ ఎక్కువ. రంగడికి ఆటపాటలంటే ఎంతో మక్కువ. రాముడు, రంగడు ఒకే ఊళ్ళో, ఒకే బళ్ళో, ఒకే తరగతిలో చదువుతున్నారు. మంచిగా చదువుకొని తనకూ, తన తల్లిదండ్రులకూ మంచి పేరు తేవాలనే ఆకాంక్షతో రాముడు బడికి వెళ్తుంటే, తన తల్లిదండ్రుల నిర్బంధం వల్ల గత్యంతరంలేక ఏదో మొక్కుబడిగా పాఠశాలకు హాజరవుతున్నాడు రంగడు.

వారంలో జరిగిన పాఠాలను గట్టిచేసుకోడానికీ, మిగిలిపోయిన హోమ్‌వర్క్ పూర్తి చేసుకోడానికీ ఆదివారం రాముడికి చక్కగా ఉపయోగపడుతుంది. అందుకొరకే వాడా వారాంతపు సెలవు కోసం అంతగా ఎదురు చూస్తుంటాడు. మరి రంగడో! వారం పొడవునా బడికి వెళ్లాల్సి రావడంవల్ల వాయిదా వేయాల్సి వచ్చిన ఆటపాటలను తనివితీరా సాగించడానికి ఆదివారం నాడే వాడికి అవకాశం వుంటుంది. అందుకే ఆ రోజు కొరకు వారమంతా గంటలు లెక్కిస్తూ గడుపుతాడు వాడు. సెలవురోజు కోసం జరిగే నిరీక్షణ ఒక్కొక్క వ్యక్తి నైజాన్నిబట్టి ఒక్కొక్క విధంగా ఎలా వుంటుందో వివరించడానికే ఇదంతా చెప్పాల్సి వచ్చింది. ఇక అసలు విషయానికి వద్దాం.

ఒక రోజు సెలవుకే మనం ఇంతగా కనిపెట్టుకొని వుంటుంటే ఇక దీర్ఘకాల సెలవులు ముఖ్యంగా ఏడాదికి ఒకసారి వచ్చే వేసవి సెలవుల సంగతి చెప్పనే అక్కర్లేదు.

వారం రోజులు చేసిన శ్రమకు విశ్రాంతి తీసుకోడానికై తేనేమి, దానిమదింపుకై తేనేమి వారం ముగింపులో ఒకరోజు సెలవు ఇచ్చినట్లుగానే విద్యార్థి విద్యార్థినులు పరీక్షల్లో ఉత్తీర్ణులుకావడానికి సంవత్సరమంతాకష్టపడి చదివినందుకు ఆటవిడుపుగా (విద్యా) సంవత్సరంముగింపులో నెలా పదిహేను రోజుల పాటు సెలవులు ఇస్తుంటారు. అయినా అసలు కారణం ఇదికాదనుకోండి.

ఆదివారాలవలెనే వేసవి సెలవులు కూడా బాలబాలికల అభిరుచినిబట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా వినియోగమవుతూ వుంటాయి. అయితే ఈ సెలవులను రంగడిలా ఆటపాటలు మొదలైన వ్యర్థ కాలక్షేపాలకంటే విద్యాసముపార్జన, విజ్ఞానాభివృద్ధి, విహారయాత్రలు, సాంఘిక సేవ వంటి ఉపయుక్తమైన, ప్రయోజనాత్మకమైన కార్యకలాపాలకు వినియోగించినప్పుడే తమకు, సంఘానికి కూడా ఎంతో మేలు కలుగుతుంది. సార్థక్యత సిద్ధిస్తుంది.

కాలం విలువ మనకు తెలిసిందే ఆది అమూల్యమైనదనీ, గడచిపోయే ప్రతి క్షణమూ ఎనలేనిదనీ, దానిని మనం తిరిగి ఎప్పటికీ పొందలేమనీ చదువుకున్నాం. కనుక మనకు లభించే పరిమితమైన సమయాన్ని వృథాకాలక్షేపాలతో కాక పొదుపుగా, ఉపయోగకరంగా వినియోగపరచుకోవాలనీ, కాలం విలువ తెలుసుకొని తదనుగుణ్యంగా వ్యవహరించే వారికి జీవితంలో అసాధ్యమైన పనంటూ వుండదనీ, మానవుడు ఉన్నతిని చేరుకోడానికి నియమబద్ధమైన జీవితం 'లిఫ్టు'గా ఉపయోగపడుతుందనీ మన పెద్దలు చెబుతూ వుంటారు కదా.

ఈ కారణాల దృష్ట్యా మనకు లభించే సెలవులకు అపారమైన ప్రాముఖ్యత వుందన్నమాట. తమ తమ వ్యక్తిగత పరిస్థితులు, కుటుంబ పరిస్థితులను బట్టి ఈ సెలవులను ఎవరు ఏ విధంగా వినియోగించుకున్నప్పటికీ కావల్సిందల్లా వాటిని వ్యర్థం చేయకుండా వుండటమే.

వేసవి సెలవులు ఆరంభమయ్యే సమయానికి చాలామంది తమ్ముళ్ళకు, చెల్లాయిలకు (దాదాపు అందరికీ) వారి పరీక్షా ఫలితాలు తెలిసిపోతాయి. ఎవరో కొందరు



మినహా దాదాపు అందరూ పరీక్షప్యాసై పై తరగతికి వెళ్తారు. పాపం పరీక్ష తప్పిన సోదరీ సోదరులు జూన్‌లో జరిగే పునః పరీక్షలకు హాజరు కావాలి కాబట్టి వాళ్ళకు ఆటవిడుపే వుండదు. వేసవి నిజంగానే వేడివేడిగా గడిచిపోతుంది వారికి. 'వేసవి సెలవులు ఎలా గడపడమా'? అన్న సమస్యే వారికి వుండదు. పునఃపరీక్షలో నెగ్గి తోడి వారిని చేరుకోడానికి వారు ఈ సెలవుల్లో శ్రద్ధగా, దీక్షగా చదువుకోవాల్సి వుంటుంది. తొలి పరీక్షలో తమకు కలిగిన అపజయానికి మలిపరీక్షలో గట్టి సమాధానం చెప్పి మళ్ళీ అది తమ దరిదాపుల్లోకి రాకుండా చేసుకోవాల్సి వుంటుంది.

పరీక్ష ప్యాసైనవారు తమ ప్రతిభా సామర్థ్యాలపై అనుచితమైన విశ్వాసం పెంచుకొని మళ్ళీ బళ్ళు తెరిచేవరకూ చదువు సంధ్యల జోలికి పోవడం అనవసరమని తీర్మానించుకోడం సహజం ఇలాంటి సోదరీ సోదరులు తమ శక్తిసామర్థ్యాలను ఎంత తక్కువగా అంచనా వేసుకుంటే వారికి అంత శ్రేయస్కరం. హెచ్చులకు పోయి పరాభవం జెందడం కన్న మెలకువగా మెలిగి మర్యాద కాపాడుకోడం మంచిదంటూ మన పెద్దలు చెప్పే హితవును ఈ సందర్భంలో మననం చేసుకోడం అవసరం. పరీక్ష నెగ్గిన వారు చదువులను పూర్తిగా విస్మరించకుండా తీరిక వేళల్లో తమకు కఠినమైన సబ్జెక్టులలో శ్రద్ధచూపి సాధనతో వాటిని సులభం చేసుకోడానికీ, ఎక్కువ మార్కులు సాధించడానికీ ప్రయత్నించాలి. ఈ సమస్యలు లేనివారు పై తరగతి పాఠ్యాంశాలను ఇప్పటినుంచే ఆకళింపు చేసుకోడానికి పూనుకోడం భావ్యం.

సెలవు రోజులు విజ్ఞాన, విహార పర్యటనలు జరపడానికి చాలా అనువైనవి. అవకాశం వున్న వారు తమ సెలవు కాలాన్ని వీటికి వెచ్చించడం మంచిది. ఏదైనా విషయాన్ని గురించి విన్నదానికన్నా, చదివిన దానికన్నా ప్రత్యక్షంగా చూచి తెలుసుకున్న సంగతులు కలకాలం జ్ఞప్తి కుంటాయి. ఇంతేకాక ఇటువంటి పర్యటనల వల్ల ఏన్నెన్నో కొత్త కొత్త విషయాలు ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చి విజ్ఞాన, పరిజ్ఞానాలు పెంపొందుతాయి. అందుచేత ఈ సెలవుల్లో సాధ్యమైతే నాగార్జునసాగర్ వంటి ప్రముఖ ప్రాజెక్టు స్థలానికి కానీ, తిరుపతివంటి దివ్య పుణ్యక్షేత్రానికి కానీ, ఇతర ప్రకృతి రమణీయమైన ప్రదేశాలకు కానీ యాత్ర వెళ్ళడం ఉచితం. అయితే ఇది మనలో అందరికీ సాధ్యమయ్యేది కాదు.

వేసవిలో సత్కాలక్షేపం చేయడం ఎలా వున్నా మండుటెండల్లో ఆటలాడి ఆరోగ్యం చెడగొట్టుకోకుండా వుండటం చాలా అవసరం. కొంతమంది తమ్ముళ్ళు, చెల్లాయిలు పెద్దవారు ఎంతచెప్పినా వినకుండా మిట్టమధ్యాహ్నసమయంలో ఆటలాడి తరువాత వాటి దుష్ఫలితాలు అనుభవిస్తూ వుంటారు. ఎండ వేళల్లో ఆటలు ఆడకుండా ఇంట్లో కానీ, దగ్గరలోవున్న గ్రంథాలయానికి వెళ్ళి కానీ ఏమైనా చదువుకోడం ఉత్తమం.

వేసవి సెలవుల్లో విద్యార్థి శిబిరాలను నిర్వహించి సాంఘిక సేవ ఇతర నిర్మాణాత్మక కార్యక్రమాలు నిర్వహించడం జరుగుతుంటుంది. ముందు తరంవారైన బాలబాలికల భావిజీవితం దృష్ట్యా ఇటువంటి సేవా కార్యక్రమాల ఆవశ్యకత, వారు వాటిలో పాల్గొనవలసిన అవసరం ఎంతైనా వుంది. అయితే చిరుత ప్రాయులైన విద్యార్థి విద్యార్థినులకు వీటిలో పాల్గొనే అవకాశం అట్టే వుండదు.

మనదేశం ఈనాడు ఎదుర్కొంటున్న విషమ పరిస్థితుల దృష్ట్యా సంఘసేవా కార్యకలాపాలను సమర్థవంతంగా నిర్వహించడానికీ, దేశరక్షణపాటవాన్ని పెంపొందించడానికీ తీవ్రంగా పరిశ్రమించవలసిన అవసరం వుంది. ఈ కృషి విజయం యువతరం వారు ఈ విషయంలో ప్రదర్శించే శ్రద్ధాసక్తులపై ప్రధానంగా ఆధారపడి వుంటుంది.

కాబట్టి మనమంతా ఎంతో అప్రమత్తతతో మెలగుతూ, ప్రతి క్షణాన్నీ సద్వినియోగ పరచుకుంటూ మన ప్రతిభా సామర్థ్యాలను రాణింపజేయాలి. మనం, మన దేశం యొక్క గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేయాలి. కీర్తి పతాకాన్ని అలరింపజేయాలి.



## పసివాని పసిడికోరికలు ★ *గొబ్బూరి అప్పారావు*

నల్లని మేఘము
నేనైతే ;
కొల్లగ వర్షము
కురిపిస్తా !!
బీడులు, మోడులు
పండిస్తా !
పేదరైతులను
మురిపిస్తా !!
చల్లని గాలిని
నేనైతే ;
మెల్లగ పుడమిని
ప్రసరిస్తా !
ఇల శ్రమజీవుల
తనువులకూ
ఎంతో గాలిని
ప్రసరిస్తా !!

ఫలవృక్షమ్మును
నేనైతే ;
వెలగోరకనే
ఫలమిస్తా !
వేసవి పాంథుల
వేసటలో
బాసటనై నే
స్థలమిస్తా !!
మాయా మాంత్రికు
నేనైతే ;
మాటికి రూపులు
మారుస్తా !
మన దేశంపై
దండెత్తే
చైనీయుల హత
మారుస్తా !!



# మట్టిబెడ్డ - ఎండిన ఆకు

— వేటూరి ఆనందమూర్తి

అనగా అనగా ఒక వూళ్ళో ఒక మట్టి 'బెడ్డ ఒక ఎండిన ఆకు చాలా స్నేహంగా వుంటూ వుండేవి. అవి ఎప్పుడూ ఒకదానిని విడిచి ఒకటి వుండేవికావు. ఇలా అవి కలసి మెలసి



సుఖంగా వుంటూవుంటే ఇంతలో వేసవికాలం వచ్చింది. అప్పుడు 'ఆంధీ' అనే యిసుక తుపానులు పెద్దపెట్టున వీచినాయి. పాపం ఆ గాలితాకిడికి ఎండినఆకు బెదరిపోయింది. "అయ్యో! మట్టిబెడ్డా! ఈ గాలి తుపానులో నే నిక్కడ నిలువగలనా? ఇక నీతో నే నిక్కడ వుండలేనా? నీ స్నేహం నా కింక లేదా!" అని విచారించింది. అప్పుడు మట్టిబెడ్డ ధైర్యం పలికి "ఛిఛీ-అవేం మాటలు. గాలితుపాను వీస్తేమాత్రం నిన్ను దూరం కాని స్తానా! నీ మీద బరువు కూచుని ఎక్కడికీ ఎగిరిపోకుండా చూచుకోనూ!" అంది. అన్నమాట చెల్లించుకొంది. ఎన్నో గాలి తుపానులు వీచి పోయినాయి కాని మట్టిబెడ్డ సాయం వల్ల పాపం ఎండిన ఆకు ఎక్కడికీ ఎగిరిపోకుండా అక్కడే వుంది.



ఇలా కొంతకాలం గడిచింది. మరి కొంతకాలానికి వానాకాలం వచ్చింది. పెద్దయెత్తున వానలు పడేలా ఆకాశం మబ్బులు కమ్ముకొంది. మట్టిబెడ్డ వణికిపోయింది. "ఎండిన ఆకూ! ఎండిన ఆకూ! చూశావా ఆ మబ్బులు! ఆ వాననే కురిస్తే నే నిక కరిగిపోనూ; ఇక నీ స్నేహం నాకు లేదుకాబోలు" అని విచారించింది. అప్పుడు ఎండిన ఆకు అండగా నిలబడి "మట్టిబెడ్డా! ఆపదలో నన్ను కాపాడిన మిత్రుడివి. నిన్ను నేను వదులుకుంటానా? ఎంత వానపడినాసరే గొడుగుకిమల్లే కప్పి నేను నిన్ను కాపాడుకోనూ!" అంది. అన్నమాట చెల్లించుకొంది. ఎన్నో



వానలు కురిసి వెలిశాయి. కాని ఎండిన ఆకు అండలో మట్టిబెడ్డ ఏమీ కరిగిపోక అక్కడే చక్కగా వుంది.

ఇలా ఎండలోనూ వానలోనూ అక్కడే ఆ రెండూ సుఖంగా, ఒక



దాని కొకటి సాయంగా వుండిపోయాయి.

(83 వ పేజీ తరువాయి)

సంస్థ చాందీపూర్ సముద్ర తీరంనుంచి అతి ఎత్తుకువెళ్ళే రాకెటును ప్రయోగించారు.

విదేశాలలో

25 ఫిబ్రవరి : ఈస్టర్న్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన నాలుగు జెట్ ఇంజనులుగల విమానం పోంట్చార్ట్రన్ సరస్సులో కూలి అందులోని 58 మంది మరణించారు.

2 మార్చి : అంతర్జాతీయ ఇకేఫ్ సంస్థ 20 వ వార్షిక సమావేశాన్ని టెహరాన్‌లో ఇరాన్ రాజు ప్రారంభించారు.

3 మార్చి : ప్రపంచ ఆరోగ్యసంస్థ 17 వ అసెంబ్లీ ప్రాథమిక సమావేశం జెనీవాలో జరిగింది.

5 మార్చి : ప్రభుత్వ విద్యుచ్ఛక్తి శాఖా పనివారలు ప్రారంభించిన సమ్మెను ఎదుర్కోడానికి వీలుగా సిలోన్‌లో అత్యవసర పరిస్థితిని ప్రకటించారు.

6 మార్చి : గ్రీక్‌రాజు పాల్, ఏథెన్స్‌లో కాలధర్మం చెందారు.

11 మార్చి : భారత, ఇరాన్‌దేశాల మధ్య జరిగిన మూడు సంవత్సరాల వాణిజ్యం ఒప్పందంపై టెహరాన్‌లో సంతకాలు జరిగాయి.

11 మార్చి : సైప్రెస్ సమస్యను చర్చించడానికి యు. యన్. భద్రతామండలి, అత్యవసర సమావేశం జరిగింది.

---

(65 వ పేజీ తరువాయి)

ఎలిమెంటరీ పాఠశాలలకు కేర్ మధ్యాహ్న భోజన పథకం క్రింద పాలపొడి, రవ్వ, నూనె మొదలైన వాటిని సరఫరా చేశారు.

నిజామాబాదు జిల్లా

*ఉత్తమ పంచాయతీ సమితి :*

1963–64వ సంవత్సరానికి ఎల్లారెడ్డి బ్లాకును జిల్లాలో ఉత్తమ పంచాయతీ సమితిగా నిర్ణయించారు.

విశాఖపట్నం జిల్లా

*ఉత్తమ పంచాయతీలు :*

1963–64వ సంవత్సరానికి అచ్యుతాపురం పంచాయతీ సమితిలోని హరిపాలెం పంచాయతీని జిల్లాలో ఉత్తమ పంచాయతీగా నిర్ణయించారు.

1963–64వ సంవత్సరానికి రోలుగుంట పంచాయతీ సమితిని జిల్లాలో ఉత్తమ పంచాయతీ సమితిగా నిర్ణయించారు.

వరంగల్లు జిల్లా

*వ్యవసాయ పనిముట్ల పంపిణీ :*

పర్కాల్ పంచాయతీ సమితిలో 1964 ఫిబ్రవరి నెలలో 44 ఆధునిక వ్యవసాయ పనిముట్లను పంపిణీ చేశారు. 1569మణుగుల రసాయనిక ఎరువులు, 378మణుగుల మేలురకం విత్తనాలను సరఫరా చేశారు.

---

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం

1964 జనవరి నెలలో యీదిగువ గ్రామాలలో విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించబడింది.

వరంగల్లు జిల్లా : ఇనోలె, కామరవల్లి, అనంతపురం, జామండ్లపల్లి, నాంచారిమదుర్, కరీంనగర్ జిల్లా : హసనపూర్, మెదక్ జిల్లా : తిమ్మారెడ్డిపల్లి. ఖమ్మం జిల్లా : జగ్గులరావుపేట, అరెకోడు, ముజ్జిగుడ్డెం, యార, కొంజెర్ల. నల్గొండ జిల్లా : మైలవరం, చొండనాడు. మహబూబ్‌నగర్ జిల్లా : కొత్తకోట, రాజపేట, పాపిరెడ్డిగూడెం, కనెమందనం, చిలకమర్రి. నిజామాబాదు జిల్లా : గడకోలు, తుంపల్లి, కొండాపూర్. అనంతపురం జిల్లా : రెడ్డివారిపల్లి, గంగివారిపల్లి, (ఈ రెండు కదిరి తాలూకా లోనివి) చిత్తూరు జిల్లా : కె. ఎమ్. అగ్రహారం (పుత్తూరు తాలూకా), పుడిపట్ల బాయలు (చంద్రగిరి తాలూకా).

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

21 ఫిబ్రవరి : ఆంధ్రప్రదేశ్ శాసనసభ బడ్జెటు సమావేశం ప్రారంభమయింది.

ఆర్థికమంత్రి రు. 1.79 కోట్ల లోటు బడ్జెటును శాసనసభకు సమర్పించారు.

22 ఫిబ్రవరి : ఆంధ్రప్రదేశ్ ఆహార ధాన్యాల వ్యాపారుల సమావేశానికి ముఖ్యమంత్రి హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు.

23 ఫిబ్రవరి : శ్రీ యన్. సంజీవరెడ్డి తమ మంత్రివర్గం రాజీనామాను గవర్నరుకు సమర్పించారు. ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాంగ్రెసు పార్టీ నాయకులుగా ఆయన ఏకగ్రీవంగా ఎన్నిక అయ్యారు. శ్రీ ఎన్. సంజీవరెడ్డి సలహా అనుసరించి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిని మంత్రివర్గం ఏర్పాటు చెయ్యాల్సిందిగా గవర్నరు ఆహ్వానించారు.

24 ఫిబ్రవరి : ఇరాక్ ప్రణాళికా శాఖామంత్రి డాక్టర్. అబ్దుల్ అల్ — అలీ హైదరాబాదుకు వచ్చారు.

26 ఫిబ్రవరి : శ్రీ డి. నరసరాజు తన అడ్వకేటు జనరల్ పదవికి ఇచ్చిన రాజీనామాను ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఆమోదించారు.

27 ఫిబ్రవరి : జీతాల స్కేళ్ళలోగల వ్యత్యాసాలను పరిశీలించిన ద్విసభ్య సంఘం (ఆర్థిక, ప్రణాళికాశాఖల కార్యదర్శులు) నివేదికనూ, ప్రభుత్వ నిర్ణయాలను ప్రకటించారు.

29 ఫిబ్రవరి : శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా పదవీస్వీకారం చేశారు.

1 మార్చి : భారత వైద్యసంఘం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం బ్రాంచి 7వ వార్షిక సమావేశానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

3 మార్చి : శాసన సభలో బడ్జెటుపై ఐదు రోజులపాటు జరిగిన సాధారణ చర్చకు ముఖ్యమంత్రి సమాధానం ఇచ్చారు.

ప్రణాళిక, పంచాయతీరాజ్ శాఖల మంత్రి శాసనసభలో బడ్జెటు డిమాండులను ప్రవేశపెట్టారు.

7 మార్చి : పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి శాసనసభలో బడ్జెటు డిమాండులను ప్రవేశపెట్టారు.

15 మార్చి : హైదరాబాదులో పదిరోజుల పాటు జరిగే ఫ్రెంచి సమకాలీన అలంకార చిత్రకళా ప్రదర్శనానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

20 మార్చి : పరిశ్రమల శాఖామంత్రి శాసనసభలో బడ్జెటు డిమాండులను ప్రవేశపెట్టారు.

## భారత దేశంలో

21 ఫిబ్రవరి : 1963—64 వ సం॥ ఆర్థిక పరిశీలనా అంశాలను కేంద్ర ఆర్థికమంత్రి పార్లమెంటుకు సమర్పించారు.

23 ఫిబ్రవరి : శ్రీ లలిత్ నారాయణ్ మిశ్రాను కేంద్ర హోంశాఖ డిప్యూటీ మంత్రిగా నియమించారు.

24 ఫిబ్రవరి : వస్తువుల దిగుమతికి సంబంధించిన 225 మిలియన్ డాలర్ల అమెరికన్ ఋణానికి చెందిన ఒప్పందంపై భారత, అమెరికా దేశాల ప్రతినిధులు క్రొత్తఢిల్లీలో సంతకాలు చేశారు.

సోవియట్ సుప్రీం కౌన్సిల్ అధ్యక్షుని నాయకత్వాన 13 మంది సభ్యులుగల సోవియట్ పార్లమెంటరీ ప్రతినిధివర్గం 15 రోజులపాటు భారత దేశంలో పర్యటించడానికి క్రొత్తఢిల్లీ వచ్చారు.

23 ఫిబ్రవరి : రాష్ట్ర ఆహార వ్యవసాయ శాఖల మంత్రుల సమావేశం క్రొత్త ఢిల్లీలో ప్రారంభమయింది.

25 ఫిబ్రవరి : సింగపూరు ప్రధాన మంత్రి లీకానియీ ఒకరోజుకై క్రొత్తఢిల్లీ వచ్చారు.

28 ఫిబ్రవరి : శ్రీ జి. యం. సాదిక్ జమ్మూ—కాశ్మీరుకు ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు.

29 ఫిబ్రవరి : కేంద్ర ఆర్థిక మంత్రి, మిగులు బడ్జెటును పార్లమెంటుకు సమర్పించారు.

3 మార్చి : కేంద్ర కార్మిక శాఖామంత్రి, బోనస్ కమీషన్ నివేదికను పార్లమెంటులో ప్రవేశపెట్టారు.

4 మార్చి : భారత వైమానిక దళానికి చెందిన రవాణా విమానం హల్గీవద్ద ప్రమాదానికి గురిఅయి 22 మంది మరణించారు.

1963 వ సం॥ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) భూమిశిస్తు (సవరణ) బిల్లును, 1963 వ సం॥ ఆంధ్రప్రదేశ్ సహకార సంఘాలబిల్లును రాష్ట్రపతి ఆమోదించారు.

రెండు రోజులపాటు జరిగే రాష్ట్ర సమాచారశాఖా డైరెక్టర్ల సమావేశం క్రొత్తఢిల్లీలో ప్రారంభమయింది.

11 మార్చి : రక్షణ పరిశోధన, అభివృద్ధి

(మిగతా 82 వ పేజీలో)




# వెన్నెల మెట్లు

వెన్నెల వెన్నెల కథల సంపుటి

సమీక్ష

**కె. దేశపతిరావు**

ఎనిమిది ఉత్తమ కథల సంపుటి "వెన్నెల మెట్లు". జానకీజాని అనే గుప్తనామం ధరించిన శ్రీ సామవేదం జానకిరామ శాస్త్రిగారి దీ రచన. దీనిలో "వ్యత్యాసం", "దరిద్రం పట్టిన మనిషి" అనే రెండు మౌలికరచనలు, ఆరు అనుసరణ లున్నాయి. ఇది 88 పుటలకు మాత్రమే పరిమిత మైనది. కనుక చిన్న పుస్తకంగా కనిపించ వచ్చు. కాని విషయాన్నిబట్టి చూస్తే పెద్దదే. పేజీ తర్వాత పేజీ చదువుతూ పోతుంటే మనముందు తిరిగే వివిధ వ్యక్తుల ప్రతిబింబాలు దీనిలో కన బడతాయి. అంతేకాక వారి మనోగత భావాలు తెలుసుకొంటాము. చిత్త సంస్కారం, ఆనందం కలుగుతాయి. "వెన్నెల మెట్లు" ఎక్కితే ఎవరి మనస్సు సంతోషంతో పరవళ్లు త్రొక్కదు!

క్రొత్తగా సంసారం పెట్టిన ఉద్యోగికి భార్యా తన దగ్గర వున్నప్పుడు, లేనప్పుడు ఇంటిలో కనిపించిన తేడాను, భార్యపై చేయి చేసుకొన్నప్పుడు అతని మనస్తత్వాన్ని, ఆమె పుట్టింటికి వెళ్లిన తర్వాత భార్యపై అతనికి కలిగిన సానుభూతిని "వ్యత్యాసం" కథలో ఉదాత్తంగా, ఉత్తమంగా చిత్రించారు రచయిత 1955-56లో ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషాసమితి నిర్వహించిన కథానిక పోటీలో దీనికి ప్రథమ బహుమతి లభించింది.

దరిద్రం పట్టి బాధపడుతూ అభిమానాన్ని చంపుకోలేని, బ్రతికి చెడిన కుటుంబంలోని యువకుని జాలిగొలిపే కథ "దరిద్రం పట్టిన మనిషి". రామమూర్తి స్థితిమంతుడు. పదేళ్లలో అనేక కారణాల వల్ల ఆస్తి అంతా పోతుంది. సహాయానికై లెక్చరర్‌గావున్న మిత్రుని దగ్గరకు వెడతాడు. అతనిని మిత్రుడు ఆదరించి అతని పరిస్థితిలోవచ్చినమార్పుకు సానుభూతి తెలుపుతాడు. బి. యిడి. చదవడానికి సహాయం చేయమని కోరితే అలాగే నంటాడు మిత్రుడు. మర్నాడు ఉదయమే రామమూర్తి ప్రయాణమౌతాడు. అతని వద్ద చార్జీలకు వుందోలేదో - అడిగితే మూర్తి ఏమి బాధపడతాడో నని లెక్చరర్ అడగడు. రైలు స్టేషన్ దూరంగా వుంది. అందుకని మూర్తిని రిక్షా ఎక్కించి, రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపిస్తాడు మిత్రుడు. అప్పటికే కాలేజీ టైమ్ అయిపోయి నందువల్ల 5 నిమిషాలలో అన్నీ సర్దుకొని 'మిత్రుడు' కాలేజికి బయలు దేరుతాడు. రోడ్డు మీదకు వచ్చే సరికి "రిక్షా కావాలా బాబూ" అని అడుగుతాడు రామమూర్తిని తీసుకెళ్లిన రిక్షావాడు. "అయ్యగార్ని అప్పుడే స్టేషన్ దగ్గర దింపి వచ్చావా" అని అడిగితే "లేదు బాబు అమలుపు తిరగ్గానే ఆయన నడిచి వెళ్ళి పోయారు, మీరిచ్చిన డబ్బుల్లో బేడ మినహా మిగిలినదంతా ఆయనే తీసుకున్నారు" అంటాడు రిక్షావాడు. ఈ మాటకు మిత్రునితో పాటు మనంకూడా విస్తు పోతాము.

డబ్బులు అడగలేని రామమూర్తి అభిమానాన్ని, తాను ఇవ్వబోతే మూర్తి ఎక్కడ బాధపడతాడో నన్న మిత్రుని సంశయాత్మక స్థితిని చిత్రించడంలో శ్రీ జానకిరామశాస్త్రి గారు చక్కని నేర్పు ప్రదర్శించారు. కథ ఒక మెరుపుగా ముగిసింది. ఇది ఓ హెన్రీ కథన శిల్పాన్ని అందుకొన్నది.

స్వతంత్ర రచనలు ఎంత కష్టమో అనువాదాలు, అనుసరణలు అంతే కష్టం. రెండు పనులను కూడ శ్రీ జానకిరామశాస్త్రి గారు దక్షతతో నిర్వహించారు. తెలుగులో పునసృష్టి చేయడానికి శాస్త్రిగారు ఎన్నుకొన్న ఆరు కథలు కూడ ఉత్తమోత్తమమైనవి.

ఒక్కొక్క కథ వినూత్న శిల్పంతో వరలు తున్నది.

అనుసరణలు చూసినా, స్వతంత్ర రచనలు చూసినా ఎక్కడా అన్వయరహితమైన వాక్యం కాని, అస్పష్టమైన భావం కాని కనబడదు. తెలుగు నుడికారంతో శ్రీ శాస్త్రి గారి శైలి సరళంగా, గంభీరంగా వున్నది.

# పాషాణి

రవీంద్రుని "నటీర్ పూజ" లోని లోకేశ్వరి పాత్ర ఆధారంగా శ్రీ సామవేదం జానకిరామశాస్త్రి గారు ఈ నాటికను రచించారు. "తన సామ్రాజ్యంలో శాంతిని స్థాపించడానికి సహాయపడ్డ బౌద్ధమత మంటే ఎంతో అభిమానం ఒక ప్రక్కనా, తన భర్తను, తన ఏకైక పుత్రుణ్ణి సన్యాసులుగా చేసి, తన నుంచి వేరుచేసి నందుకు ఆ బౌద్ధంపై ద్వేషం మరొక ప్రక్కనా తన్ను నిరంతరం బాధించగా తీవ్రమైన భావసంఘర్షణకు లోనైన మహారాణి లోకేశ్వరి" ఈ నాటికలో ప్రధాన పాత్ర.

లోకేశ్వరి బౌద్ధ సన్యాసులను హత మార్చవలసిందని ఆజ్ఞాపిస్తుంది. చివరకు బింబిసార మహారాజు (లోకేశ్వరి భర్త) కూడా హత్యాచేయబడతాడు.

దానితో లోకేశ్వరి పూర్తిగా మారిపోతుంది. తనకునిష్కృతిలేదా అని ఆత్మహత్యకు దిగుతుంది. అదే సమయంలో పుత్రుడు (బౌద్ధ భిక్షువు) వచ్చి తథాగతుని శరణు వేడుమని ప్రబోధిస్తాడు. లోకేశ్వరి ఆ బౌద్ధ భిక్షువు ననుసరిస్తుంది.

లోకేశ్వరి పాత్రోన్మీలనంలో రచయిత అసాధారణ నైపుణ్యం ప్రదర్శించారు. ద్వేషంతో దహించుకొని పోయినప్పుడు, పశ్చాత్తాపంతో క్రుంగిపోయినప్పుడు లోకేశ్వరి హృదయాన్ని ప్రతిభాపూర్వకంగా ఆవిష్కరించి, ఆమెపై సానుభూతి కలిగేటట్లు చేయగలిగారు రచయిత.

['వెన్నెల మెట్లు' వెల: రూపాయి, పాషాణి, వెల : 50 నయాపైసలు. ఈ రెండు రచనల ప్రతులకు: సామవేదం జానకిరామశర్మ, సాహితీ సదన్, అశోక్‌నగర్ — ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా.]

## 1. బ్రతుకుబాట

[రచయిత : ఇసుకపల్లి దక్షిణామూర్తి; నవ్యభారతి ప్రచురణ, 760, హిమాయత్‌నగర్, హైద్రాబాదు-29, ధర — మూడు రూపాయలు, పేజీలు. 162]

నవలలు, కథలు, కవితలు కోకొల్లలుగా సృష్టించడం ఫ్యాషనుగా, హాబీగా మారిన ఈ రోజుల్లో, ఉత్తమ సాహిత్య సృష్టి జరగడం లేదన్న సహృదయుల విమర్శ సహేతుకమైనది. ఉదాత్తమైన భావసంపద, భాషా పాటవమూ, మానవ మనస్తత్వ పరిశీలనా శక్తి పరిపుష్టిగా లేనివారందరూ సాహితీ సృష్టికి పూనుకోవడం, తత్ఫలితంగా నిర్జీవమైన రచనలు బయటపడడం, నేటి స్థితి.

చికాకు కలిగించే పరిస్థితుల్లోనుండి పారిపోవడమే చిన్నప్పట్నుంచి అలవడినట్టి, మరియు ఎదురు తిరిగి నిలబడడం చేతకాని ఒక యువకుని పరిమిత జీవిత చిత్రణే ఈ 'బ్రతుకు బాట.' జీవితాన్ని నిర్దిష్టోద్దేశరహితంగా కొనసాగించిన నారాయణ అను ఆ యువకుని జీవితంలోని కొన్ని సంఘటనలు మాత్రమే ఇందులో చిత్రితమైనవి. సాధారణ పరిస్థితుల్ని కూడా ప్రతిఘటించ గలిగే ఆత్మబలము గానీ, స్థిర సంకల్పము గానీ, మనోదారుఢ్యంగానీ లేనట్టి నారాయణ స్తబ్ధావస్థగతిలో ఉంటూ, నవల చివరి భాగంలో, జీవితం నేర్పిన అనుభవాలను ఆసరాగా గైకొని 'మనిషి'గా బ్రతకడానికి పూనుకుంటాడు విచిత్ర పరిస్థితుల్లో. అది దీని కథావస్తువు.

సమీక్ష

బాసాని సుదర్శన రెడ్డి

పరిమిత జీవితంతో, పాత్రలతో పరిభ్రమించే కథావస్తువు కావడం వల్లా, 'నవల'గా విస్తృతీకరించడం వల్లా కథా సంవిధానం తగినంత ప్రతిభావంతంగా జరుగలేదు. చక్కని కథలు వ్రాసిన శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి నవలా రచనకు పూనుకోవడం అభినందనీయమే. వారి లేఖిని నుండి ఉదాత్తమైన నవలలు కూడా రావాలని ఆకాంక్ష.

## 2. వడగళ్ళు

(కథల సంపుటి)

[రచయిత : పి. వి. సుబ్బారావు; మహోదయ పబ్లిషర్స్, తెనాలి, మూల్యం : రెండు రూపాయలు, పేజీలు 126]

ఏడు కథల సంపుటి 'వడగళ్ళు.' రచయిత తమ మిత్రులైన స్వర్గీయ గోపీచంద్‌కు అంకిత మిచ్చారు దీన్ని.

స్వరాజ్య సంపాదనానంతరం తమలో నిర్లిప్తత ఏర్పడిందనీ, నేడు వ్యక్తిస్వార్థం స్వైరవిహారం చేస్తోందనీ, మలినపూరితమైన తృష్ణ మాత్రమే ఉందని తమ 'ఇంద్రధనుస్సు'లో రచయిత ప్రస్తావించారు.

"మానవుణ్ణి దేవతగా మార్చవలసిన స్వరాజ్యసాధన మానవుణ్ణి రాక్షసుడిగా తయారు చేసిందేమో అనే నాదుగ్ధ; నా ఆవేదన. అదే నా తీరని ఆర్తి" అని కూడా రచయిత నైరాశ్యంతో పేర్కొన్నారు.

"జన్మహక్కులు" అను తొలి కథలో భార్యా భర్తల విరుద్ధ ప్రవృత్తులను, నేటి వాస్తవిక దాంపత్యజీవితాన్ని రచయిత బాగా చిత్రించారు. రెండవ కథ "కావ్యేషు నాటకమ్..."లో పరిస్థితుల కారణంగా, నాటకాల్లో వేషాలువేసి, నైతిక పతనానికి గురి అయిన ఒక స్త్రీగాథ చిత్రించబడినది. ఈ కథలో పటుత్వం లేదు.

మూడవ కథ "ఆత్మగతం"లో దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన ఒక ఆదర్శవాది అంతిమ ఘడియల్లో ఆత్మావలోకనం చేసుకోగా కల్గిన స్మృతులు; చివరికి దారుణ మృతికి గురికావడం వాస్తవికంగా చిత్రించారు.

"నా ఆరాధ్యదైవం" అను కథలో సాహిత్యాభిమాని తాను ఎంతో అభిమానిస్తున్న కవిని ప్రత్యక్షంగా చూసినప్పుడు కల్గిన భావాన్ని, ఆ కవి విచిత్ర ప్రకృతిని వర్ణించాడు. రచన ముఖ్యం కానీ రచయిత ముఖ్యం కాదన్న విషయాన్ని చెప్పడానికి పూనుకున్నారు.

"స్మారక సభ" వ్యంగ్యాత్మకమైన కథ. ఇది నేటి స్మారక సభల్లో ఉపన్యాసకుల ధోరణిని తెలియజేస్తున్నది.

"కర్మయోగి"లో నేటి రాజకీయాల్లోని కుంభకోణాల్ని ఎత్తిచూపారు. వ్యవస్థపట్ల నిరసనను ప్రదర్శించారు.

చివరి కథ "ప్రేమ జీవులు"లో ఇద్దరు స్త్రీ, పురుషుల దయనీయమైన ప్రేమగాధ వర్ణితమైనది.

ఉత్తమ కథానికల సంపుటి 'వడగళ్ళు.' ప్రేమ కథల్తో విసిగెత్తి వేసారిన పాఠకులు 'వడగళ్ళు' చదివి తీరాలి. నేటి సమాజాన్ని అతి తీవ్రంగా విమర్శించే కథలు ఇందులో ఉన్నాయి. భావనకు తగ్గ భాషతోపాటు

చక్కని సంవిధానం గల ఇలాటి కథల్ని అందజేసిన శ్రీ సుబ్బారావు మరి కొన్ని త్వరలోనే అందిస్తారని ఆశిస్తాను.

## 3. తాను వెలిగించిన దీపాలు
### (కథా సంపుటి)

[రచయిత: మధురాంతకం రాజారాం(మొగరాల); ప్రకాశకులు-శ్రీగోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణ పురం; ఉల్లిపాలెం పోష్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా; వెల రు. రెండు; పేజీలు 114]

ఈ సంపుటిలో 'తాను వెలిగించిన దీపాలు,' 'జారుడుమెట్లు,' 'చేదునిజం' అను మూడు కథలున్నాయి.

ఇతి వృత్తంలో నేమీ, పాత్రల చిత్రణలో నేమీ, కథా కథనంలో నేమీ చక్కని శిల్పాన్ని ప్రదర్శించిన శ్రీ రాజారాం కథలు పఠితృజనతకు ఒక తృప్తి, ఒక అనుభూతి కల్గిస్తాయి.

'తాను వెలిగించిన దీపాలు'లో ఒక వృద్ధ ఉపాధ్యాయుని మనోభావాల్ని కళాత్మకంగా చిత్రించారు.

రెండవది 'జారుడుమెట్లు' 57 పేజీల పాటు నడచి ఈ సంపుటిలో అత్యధిక భాగాన్ని ఆక్రమించినది. ఈ కథ కొంత అనవసరంగా పెరిగిందేమో అనిపిస్తుంది. నీలకంఠం చిత్రణ చక్కగాఉంది. ఇందులో కూడా భాషాగాంభీర్యం ద్యోతకమవుతున్నది.

మూడవ కథ 'చేదునిజం'లో పాఠకుడు ఆదినుంచి నిజం అనుకుంటున్నది అంతంలో అబద్ధం కావడం జరుగుతుంది. ఈ కథ వస్తువులో బిగువులేదు. రచయిత తన ప్రత్యేకతను నిలుపుకోలేదని అనిపిస్తుంది. అందుకే 'చేదు నిజం' ఈ సంపుటిలో చివరి స్థానం పొందినదేమో.

శ్రీ రాజారాం తమ కథల్లో తెలుగు భాష సొగసులు, తెలుగు దనపు సోయగాలు రమ్యంగా చిత్రించారు. ఉత్తమ కథకునికి కావలసిన భావసంపద, భాషా పుష్టి వారిలో నిండుగా మెండుగా ఉండడం, శిల్పానికి కూడా వారు ప్రాధాన్యం ఇవ్వడం ప్రశంసార్హం.

## 4. రాజయోగి
### (నాటకం)

[కర్త: అంబటిపూడి లక్ష్మీనరసింహం; పేజీలు 106; మూల్యం. రు.1.25. ప్రాప్తిస్థానాలు 1. మేనేజరు, బ్రహ్మంగారి మఠం, కందిమల్లయ్యపల్లె (పోష్టు), బద్వేలి (తాలూకా), కడప (జిల్లా); 2. రచయిత, పదుబాడు, అన్నంబొట్లవారిపాలెం (పోష్టు), వయా-పర్చూరు, గుంటూరు (జిల్లా)].

శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి పేరు వినని ఆంధ్రు డుండడు. ప్రత్యేకించి జానపదుల కీయన గతానుగతికంగా పరిచయం. బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలు పల్లీయుల రసనలపై నటిస్తూ ఉంటాయి. వేమన పద్యాలకున్నంత ప్రచారం బ్రహ్మంగారి తత్త్వాలకూ ఉంది. వేమన పద్యాల్లోని ప్రత్యక్షరంలో లౌకిక సత్యాలు లాస్యమాడితే బ్రహ్మంగారి తత్త్వాల్లో భూత భవిష్యద్వర్తమాన కాలాల్లోని అద్భుత విషయాలు తాండవ మాడుతాయి. వీటిలోని అద్భుతాలు కొన్నివరకే జరిగాయి. కాబట్టి మిగిలినవి ఎప్పుడో ముమ్ముందు తప్పక జరగ్గలవనే గట్టివిశ్వాసం ప్రజల్లో నాటుకొని ఉంది.

ఈ నాటకం బ్రహ్మంగారి జీవితంలోని అద్భుతాన్ని వివరించేవాటిల్లో ఒకటి. అయితే ఇతః పూర్వం బయల్దేరిన నాటకాలకి మల్లే అభూతకల్పనలకి తావివ్వకుండా చరిత్రకు సన్నిహితంగారచించిన నాటకమిది అని రచయిత తెలియపరుస్తునాడు. ఈ నాటకానికి 'బ్రహ్మంగారి నాటకము' అని నామాంతరం. 'రాజయోగి' అనే నామకరణ మెందుకు చేశారో రచయిత, నేపథ్యములోని వివరణలో చర్చించి విశదంచేశారు. అంచేత పాఠకులకు యోచించే విషయ మిందులో కించిత్తైనా మిగల్లేదు.

ఐదవ రంగంలో బ్రహ్మంగారి పరిణత మనస్కతని కూడా శంకించేందుకు రచయిత అవకాశాన్ని కల్పించారు. బ్రహ్మంగారు సమాధిగతులు కాబోయేముందు మఠాధిపత్యం వహించమని పెద్ద కుమారుడికి చెబుతారు. గోవిందయ్య సిద్ధునికే ఆధిపత్యం ఇవ్వవలసినదని ఈర్ష్యతో అంటాడు. అరిషడ్వర్గాల్ని జయించని వానికి మఠాధిపత్యం అప్పజెప్పడంలో ఔచిత్యంశూన్యం. పోనీ మఠాధిపత్యానికి అగ్రవర్ణుడే కావాలని బ్రహ్మంగారి ఉద్దేశ్యమైతే ఆయన జాతిమత రహితంగా మోక్షాన్ని పొందవచ్చునని బోధించడంలో అర్థంలేదు...

రచయిత తన కృతిని ప్రస్తుతం మఠాధిపతులుగా ఉన్న శ్రీ శ్రీనివాస స్వాములకే అంకిత మిచ్చారు. పుస్తకం ముఖపత్రంమీద పత్నీసమేతులైన బ్రహ్మంగారి పటమూ, లోపలిపేజీలో భాగీరథాంబా సమేతులైన శ్రీనివాసస్వాములవారి ఛాయాచిత్రమూ, రచయిత తల్లిదండ్రుల ఛాయాచిత్రాలూ ఉన్నాయి.







Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.

# ఆంధ్రప్రదేశ్

| | | |
|---|---|---|
| విస్తీర్ణం | ... | 1,06,286 చదరపు మైళ్లు. |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | ... | 212 |
| గ్రామాలు | ... | 28,997 |
| పూర్తి జనాభా (1961) | ... | 359.83 లక్షలు |
| జన సాంద్రత | ... | ఒక చదరపుమైలుకు 339 |
| అక్షరాస్యులు (1961) | ... | 76.27 లక్షలు |
| నికర సాగుభూమి (1960-61) | ... | 10,783,000 హెక్టర్లు |
| పశువులు (1961) | ... | 326.43 లక్షలు |
| నమోదైన ఫ్యాక్టరీలు (1961) | ... | 3,140 |
| విద్యుదుత్పాదన (1962) | ... | 1,120.3 మిలియన్ కె. డబ్ల్యు. హెచ్. |
| విద్యుత్ సౌకర్యాలుగల పట్టణాలు, గ్రామాలు (1962-63) | ... | 4,315 |
| విశ్వవిద్యాలయాలు | ... | 3 |
| కళాశాలలు (1961-62) | ... | 125 |
| ఉన్నత పాఠశాలలు (1961-62) | ... | 1,435 |
| వృత్తివిద్యా పాఠశాలలు | ... | 440 |
| పంచాయతీలు (1959-60) | ... | 14,552 |
| అభివృద్ధి మండలాలు (31-3-1963 నాటికి) | ... | 446 |
| 1961-62 లో అప్పటి ధరలనుబట్టి రాష్ట్రాదాయం అంచనా | ... | రూ. 1,066.04 కోట్లు |
| పార్లమెంటు సభ్యులు | ... | 61 |
| శాసన సభ సభ్యులు | ... | 301 |
| శాసన మండలి సభ్యులు | ... | 90 |




వాసక సజ్జికలు